అనురాగ మొలికించు ఓ చెలీ...!
అమృతాలు కురిపించు జాబిలి!!



# చతుర



సంపుటి -31
సంచిక - 8
సెప్టెంబరు 2008
368వ సంచిక



ముఖచిత్రం : శ్రియ  2వ పేజీ : సునీత
ముఖపత్రాలంకరణ : రాజు యాట

'కులవృత్తికి సాటిలేదు
గువ్వల చెన్నా...!'
అన్నది ఒకప్పటి మాట.
మారుతున్న పరిస్థితుల్లో
అన్ని కుటుంబాలు
సంక్షోభంలో
కొట్టుమిట్టాడుతున్నట్లే
జానపద కళాకారులు
ఎదుర్కొంటున్న ఇక్కట్లను
కళ్లకు కట్టేలా
ఆవిష్కరించిన
**డాక్టర్ వి.ఆర్. రాసాని**
నవల

## పరస



14 వ పేజీలో

బొమ్మలు:
బాలి

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

# అడవుల మ్యూజియం!




అడవులకు సంబంధించిన 'గాస్' మ్యూజియం వందేళ్లకుపైగా పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది.. అడవుల ఉన్నతాధికారి హెచ్.ఎ.గాస్ దీనికి రూపకల్పన చేశాడు. ఆయన అందులో అపురూపమైన వివిధ రకాల కలప, రకరకాల జంతువుల చర్మాలు, జంతుజాలాల నమూనాలు ఏర్పాటు చేశాడు. ఇది కోయంబత్తూర్‌లోని ఫారెస్ట్ కాలేజీవద్ద ఏర్పాటైంది. 15 ఏప్రిల్, 1902లో అప్పటి మద్రాస్ గవర్నర్ దానిని ప్రారంభించాడు. మ్యూజియం కోసం ఒక పెద్ద భవనాన్ని నిర్మించమని ఆయన గాస్‌కు పెద్ద మొత్తంగా ధనాన్ని కూడా అందజేశాడు.

మనదేశంలో 17 రకాల మ్యూజియమ్‌లు దాదాపు 408 వరకు ఉన్నాయి. వాటిలో ఐదు మాత్రమే అడవులకు సంబంధించినవి. 'వరల్డ్ డైరక్టరీ ఆఫ్ మ్యూజియం'లలో గాస్ స్థాపించిన ఈ మ్యూజియం స్థానం పొందింది.

గవర్నర్ సలహాదారుడు ఉడ్ దీనిని ఓసారి వేలం పాటలో పెట్టాలని భావించాడు. దీంతో ఎక్కువ ఆదాయానికి అమ్మివేయచ్చనుకున్నాడు. అయితే అప్పటి ఛీఫ్ ఫారెస్ట్ కన్సర్వేటర్‌గా పనిచేస్తున్న ఎ.మాస్టర్ జోక్యంతో ఆ వేలం రద్దయింది. కాలక్రమేణా మ్యూజియం భవనం కొంత శిథిలమైంది. ఆ కాలేజీ పిన్సిపాల్ సి.ఆర్. రంగనాథన్ దానికి మరమ్మతులు చేయించి, తిరిగి అందంగా తీర్చిదిద్దాడు.

ఇందులో మూడువేల వరకూ వివిధ రకాల వస్తువులు ఉన్నాయి. కలప, అడవుల్లో పంటలు, దినుసులు, బొటానికల్ కలెక్షన్స్, సిల్వీకల్చర్, వైల్డ్‌లైఫ్, జువాలజీకి సంబంధించినవి, పక్షుల గురించిన నమూనాలుఅనేకం ఉన్నాయి. వైల్డ్‌లైఫ్ సెక్షన్లో 2 నెలల ఏనుగు తాలుకు పిండం, 4 నెలలు, 14 నెలల పెద్ద పులిపిండాలు ఉన్నాయి. 142 రకాల పక్షుల్లో- బెంగాల్ రాబందు, మలబార్ హార్న్ బిల్, భారతీయ పిట్ట, స్టోక్‌ప్లోవర్, కెస్ట్రల్ తదితర అరుదైన పక్షుల మోడల్స్ చూపరులకు ఆకట్టుకుంటాయి.

456 సంవత్సరాలనాటి టేకు దుంగ, అతి పెద్దరోజ్ ఉడ్‌దుంగలు ఉన్నాయి. వెనుకటి కాలంలో ప్రజలు ధరించిన నారదుస్తుల్ని కూడా ప్రదర్శనకు పెట్టారు. కాగితం తయారీలో వినియోగించే ముడి పదార్థాలు, ప్లే ఉడ్ నమూనాలు, చిప్ బోర్డ్స్, డయాపర్ బోర్డ్ సామాగ్రి చిన్నారులను అలరిస్తాయి.

ఓసారి ఇక్కడ భద్రపరిచిన ఆరున్నర అడుగుల పొడవు, 33 కేజీల బరువుగల రెండు భారీ ఏనుగు దంతాలు కొన్నేళ్ల క్రితం దొంగతనానికి గురయ్యాయి.

ఈ మ్యూజియంలోనికి ప్రవేశానికి నామమాత్రపు రుసుమునే వసూలు చేయడం విశేషం.



# బిపాసా ఆరోగ్య రహస్యాలు ఇవిగో!



**అందానికీ, ఆరోగ్యానికీ, ప్రతీక ఆమె. శృంగార తారగా ఆ బెంగాలీ భామ ఇప్పటికే ఎందరో ప్రేక్షకుల గుండెల్లో గిలిగింతలు పెడుతోంది.. అలాగని నటన విషయంలోనూ ఆమె ఎవరికీ తీసిపోదు.. ఎల్లవేళలా మొహంలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడే ఆ మూడుపదుల అందాల తార మరెవరో కాదు.. బిపాసా బసు...**

ఆరోగ్యమే మహాభాగ్యమని తరచూ చెప్పే బిపాసా తన అందాన్ని, ఆరోగ్యాన్ని ఎలా కాపాడుకుంటోందనేది అత్యంత ఆసక్తికరం. ఇందుకోసం ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటుంది. యోగ, వ్యాయామాలతోపాటు చక్కని పౌష్టికాహారం తీసుకోవడం ఆమె ప్రత్యేకత. దీని ద్వారానే ఆమె తన శరీరాకృతిని శిల్పంలా మలుచుకుందని చెబితే అతిశయోక్తి కాదు.

సెలెబ్రిటీసే కాదు.. ఒకింత శ్రద్ధపెట్టి రోజూ కాస్త సమయం కేటాయించుకుంటే సాధారణ వ్యక్తులూ చక్కని అందాన్ని, ఆరోగ్యాన్నీ సొంతం చేసుకోవచ్చని చెబుతోంది

బిపాసా. సమస్యల వలయమైన ఈ ప్రపంచంలో జీవించడానికి సానుకూల దృక్పథం, ఆత్మవిశ్వాసం, ఆరోగ్యం అత్యవసరమనేది జగమెరిగిన సత్యం. దైనందిన జీవితంలో క్రమశిక్షణ పాటిస్తూ సరైన రీతిలో ఆహార పుటలవాట్లను మలచుకుంటే ఎవరైనా చక్కని దేహసౌష్టతను, మంచి ఆరోగ్యాన్ని తమ సొంతం చేసుకోవచ్చు.

**బిపాసా ఆరోగ్య సూత్రాలు ఇవీ..**

★ వ్యక్తిగత పరిశుభ్రత విషయంలో ఎప్పుడూ రాజీ వద్దు. ఇందులో ఏమాత్రం అశ్రద్ధ వహించినా అసలుకే మోసం..

★ క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం మరచిపోవద్దు.

★ ఎక్కువగా నీళ్లుతాగండి. దాంతోపాటు సమతులాహారం అవశ్యం. అదీ అవసరం మేరకే. ఏదీకూడా ఎక్కువగా తినడం ఎట్టి పరిస్థితుల్లో మంచిదికాదు.

★ కూరగాయలు, ఆకుకూరలు తగినంతగా ఆహారంలో ఉండేలా చూసుకోండి.

★ కాఫీలు, టీలు తగ్గించాలి. వీలైనంత వరకూ పండ్లరసాలు క్షేమం.

★ క్రమశిక్షణతో కూడిన అలవాట్లు పాటించడం చాలా ముఖ్యం.

**రోజూ బిపాసా చేసే కసరత్తులు ఇవీ:**

★ వ్యాయామానికి శరీరాన్ని సంసిద్ధం చేసేందుకు 10 నిమిషాల వార్మ్ అప్.

★ ప్రతి ఉదయం యోగాసనాలు మామూలే. పనిలోపనిగా విధిగా 108 సూర్య నమస్కారాలూ చేస్తుంది.

★ వారంలో ఆరురోజులు సగటున రెండుగంటలపాటు వ్యాయామశాలలోనే గడుపుతుంది. శిరస్సు పైభాగానికి, ఉదర భాగానికి, నడుము, కాళ్లు, చేతులు, తొడలు, పిరుదులు ఇలా ఒకటని కాకుండా దేహం మొత్తానికీ వ్యాయామం కల్పిస్తుంది.. చెమ టోడ్చుతుంది.

★ అలాగే 50 నిమిషాలపాటు హృదయం, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాయామాలు, కాళ్లూ చేతులు చాపుతూ నృత్య భంగిమలు చేస్తుంది.

★ వారంలో నాలుగు రోజులు జిమ్‌లోని ట్రెడ్‌మిల్ తదితరాలపై 50 నిమిషాలు, రోయింగ్ మెషీన్‌పై 20 నిమిషాలు వ్యాయామం తప్పనిసరి.

★ గుండెజబ్బులు రాకుండా ఉండేందుకు అన్ని వ్యాయామాలను కొద్దికొద్దిసేపు వేగంగా చేయడం అవసరం అంటుందామె.

★ శరీర సౌష్టవానికి, కండరాల బిగువుకూ మరెన్నోరకాల కసరత్తులు చేస్తుంది. నాలుగు నెలలకు ఓసారి వీటి క్రమాన్ని మార్చేస్తుంది.

★ రోజుకు సరాసరి ఆరున్నర గంటల నిద్ర తప్పనిసరి అంటుందామె.

**ఆహారపు అలవాట్లివీ..**

★ నానబెట్టిన బాదం పప్పులు, వేడినీళ్లు, టీతో ఉషోదయం ప్రారంభం.

**ఉదయం 9 గంటలకు తీసుకునే అల్పాహారం:** పచ్చసొనలేని గుడ్లు, పుట్టగొడుగుల టోస్ట్, వెన్నతీసిన పాలు, పండ్లు ఇందులో ఉంటాయి.

★ ఉదయం 11 గంటలకు ఒక ఆపిల్.

**మధ్యాహ్నం ఒంటి గంటకు లంచ్:** ఆకు కూరలు, పప్పు, తగుమాత్రంగా చికెన్/చేపలు, సలాడ్, రెండు సోయా చపాతీలు ఇందులో తప్పనిసరి.

★ పుట్టినరోజులాంటి ప్రత్యేక వేడుకల్లో తప్ప అన్నానికి పూర్తిగా దూరం.

★ సాయంత్రం ఐదు గంటలకు టీ, రెండు బిస్కట్లు

**రాత్రి భోజనం 9 గంటలకు:** ఇందులో పప్పు, సలాడ్, ఆలివ్ నూనెలో ఉడికించిన కూరగాయల ముక్కలు, చేప/చికెన్, ఏదేని ఒకస్వీటు ముక్క.

★ ముఖ్యమైన విషయం పొగతాగడం మద్యపానానికి బిపాసా ఆమడ దూరం. Ⓒ

అపార్ట్‌మెంటాలజీ - 8

# లవ్‌కి మినిమమ్ ఏజ్ ఎంత?



యర్రంశెట్టి సాయి

ఒక్కసారిగా మా అపార్ట్‌మెంట్స్‌లో భగ్గుమందా వార్త. మరుక్షణం మా అపార్ట్‌మెంట్స్‌లో జనమంతా గుంపులు గుంపులుగా చేరి ఆ విషయమే - (దానికి మరిన్ని వదంతులు కలిపి) డిస్కస్ చేసుకోవటం మొదలుపెట్టారు.

మా ఫ్లాట్ ఓనర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్ వెంటనే ఎమర్జెన్సీ మీటింగ్ పెట్టాడు.

"నేను చాలా దినాలకెల్లి అబ్జర్వ్ చేస్తున్నయ్! మనది అపార్ట్‌మెంట్స్‌లో అన్నీ సెన్సేషనల్ వింతలు అవుతున్నాయ్! అయితే గిప్పుడు ఇంకా టూమచ్ భయానక్ విషయం జరిగినయ్. దస్ సాల్‌కీ లడకీకి గర్భం వచ్చినయ్. పదేళ్ళ లడకీకి గర్భమా? టూమచ్ ఉన్నయ్. మన సొసైటీ- మానే- అప్నా అపార్ట్‌మెంట్‌కీ బాత్ నహీకర్ రహ! బాహర్- సొసైటీ మానే సమాజం- మన సమాజం ఎటుపోతున్నయ్? మన సోషల్ ఫాబ్రిక్ చిరిగిపోతున్నయ్- మన పేరెంట్స్ అన్నీ కలసి మన కల్చర్‌ని ప్రొటెక్ట్ చేయనికే మనం ఇక్కడ మీటింగ్ పెట్టినయ్- ఇప్పుడు మాట్లాడాలనుకునోళ్ళు వన్ బైవన్ మాట్లాడతయ్-" అన్నాడు ఆవేశంగా.

"అవునూ- మన సంస్కృతిని కాపాడాలి? వెస్టరన్ కల్చర్ డౌన్ డౌన్" అంటూ అరిచాడు విజయ్‌యాదవ్. విజయ్‌యాదవ్‌కి బి.జె.పి. బ్యాక్‌గ్రౌండ్ ఉండటం వల్ల ప్రతి విషయానికి పాశ్చాత్య సంస్కృతీ డౌన్ డౌన్ అంటూండటం అలవాటు. ముందు అంజనీ బొపాషా లేచి వేదిక మీద కొచ్చింది.

"ఒక పదేళ్ళ ఆడపిల్ల ప్రెగ్నెంట్ అవటం నిజంగానే టూమచ్ షాకింగ్! మన ప్రెసిడెంట్‌గారు భాషణ్ ఇచ్చినట్లు మనం వెంటనే యాక్షన్ తొయ్యాలి. ప్రొటెస్ట్ తొయ్యాలి-" అంటూ ఆవేశంగా అరచి కూర్చుంది.

ఇంకొంతమంది మాట్లాడాక చివరకు కల్చరల్ సెక్రటరీ శంకరమూర్తి మాట్లాడాడు. "పదేళ్ళకు ప్రెగ్నెంటా? ఏమిటి దారుణం? లోపం ఎక్కడువుంది? మన పెంపకంలోనా? మన కల్చర్‌లోనా, ఇవన్నీ మనం వెంటనే ఒక కమిటీ వేసి ఇలాంటి సంఘటనలు ఏ నేపథ్యంలో జరుగుతున్నయ అనే అంశాన్ని స్టడీ చేయాలి-" అన

గానే అందరూ తప్పట్లు కొట్టి "శంకర మూర్తి వన్‌మాన్ కమిటీ" అంటూ అరిచారు. ఇంకొంతమంది "శంకరమూర్తే స్టడీ చేయాలి - అతను జీనియస్" అని కూడా అరిచారు. మా అపార్ట్‌మెంట్స్‌లో ఎవరికి వారే తప్పించుకుని పనులన్నీ ఎదుటివారికి తగిలించడం చాలా మామూలు విషయం. ఈ సంగతి శంకరమూర్తికి కూడా తెలుసు. ఎందుకంటే అతనే చాలాసార్లు ఆ ట్రిక్ ప్రయోగించి హమీద్‌మియాకి ఎన్నో పనులు అంటగట్టాడు. అంచేత అతను బోల్తాపడలేదు.

"చూడండి సార్! ఇలాంటి క్లిష్టమయిన సమస్య స్టడీ చేయాలంటే నా ఒక్కడి వల్ల కాదు. నాకన్నా ఇంకా ఇంటెలిజెంట్స్ ఉండాలి. ఆ కమిటీలో లేడీ కూడా ఉండాలి"

'నువ్వుండు అంటే నువ్వే ఉండాలి-' అంటూ అందరూ ఒకరినొకరు ఇరికించడానికి ప్రయత్నించారు గానీ చివరకు లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ మంగతాయారు, సీతావరదరాజన్, హమీద్, శంకరమూర్తి, విజయ్ యాదవ్‌లతో కమిటీ ఓకే అయింది.

వెంటనే కమిటీ వాళ్లందరం కలసి డి బ్లాక్‌లో ఆ పదేళ్ల అమ్మాయి ఉన్న ఇంటి కెళ్ళి తలుపు తట్టాము.

వాళ్ళమ్మా నాన్నా తలుపు తెరిచారు. వాళ్ళిద్దరూ దిగులుగా కనిపించారు- "రండి! మీ కోసమే ఎదుర్చూస్తున్నా!" అన్నాడతను.

"ఆ న్యూస్ విన్న దగ్గర్నుంచీ మా అందరికి కూడా చాలా బాధగా ఉంది. అసలు ఇలాంటి దారుణానికి దారితీసిన పరిస్థితులేమిటో అధ్యయనం చేయడానికి మమ్మల్ని కమిటీగా వేశారు. ఎందుకంటే ఏ సమస్య వచ్చినా ప్రజలంతా మా కెందుకని ఊరుకుంటే మొత్తం సమాజం నాశనమవుతుంది-" అన్నాడు శంకరమూర్తి.

"నిజమే" వప్పుకున్నారు వాళ్ళు.

"ముందు మీ పాపతో ఒకసారి మాట్లాడతాం!" అన్నాడు విజయ్‌కుమార్.

"ఆ గదిలో ఉంది. వెళ్ళి మాట్లాడండి" అన్నాడు తండ్రి.

అందరం ఆ గదిలోకెళ్ళాం. వెళ్ళేముందు సీతావరదరాజన్ కాషన్ ఇచ్చింది-

"మనం రొంబ డెలికేట్ టాకిల్ చేస్తాం! లేకుంటే ఆ అమ్మాయి అయిపోచ్చి".

"ఓకే.. ఓకే" అన్నాడు విజయ్.

"హాయ్ అంకుల్- హాయ్ ఆంటీ?" అందాపిల్ల మమ్మల్ని చూడగానే.

"నీ పేరెన్న?" అంది మంగతాయారు.

"ఆషా"

"చూడమ్మా ఆషా! నీకు స్కూల్లో చాలా మంది ఫ్రెండ్స్ ఉన్నారా?" అడిగాడు విజయ్‌యాదవ్.

"విజయ్- మనం చిన్నపిల్లతో మాట్లాడుతున్నాం! అందుకని డెలికేట్‌గా డీల్ చేయాలి. డైరక్ట్‌గా సబ్జెక్ట్‌లోకి వచ్చేస్తే ఆ పిల్ల ఎంబ్రాసింగ్‌గా ఫీలవుతుంది" అన్నాడు శంకరమూర్తి.

"అవును! ఆ అమ్మాయి ఫీలింగ్స్ దానే హర్ట్ అవకుండా పణ్ణి!" అంది సీతావరదరాజన్.

"మీరు చైల్డ్ సైకాలజీ బుక్స్ తెగ చదువుతుంటారు కదా! అందుకని మీరే డీల్ చేయటం బెటర్" అన్నాడు హమీద్‌మియా ఆమెతో.

వెంటనే సీతావరదరాజన్ తనే చైల్డ్ సైకాలజిస్ట్‌లాగా ఓ ఫోజిచ్చి ఆషాతో మాట్లాడటం మొదలుపెట్టింది-

"ఆషా! నీకు స్కూల్లో చాలామంది ఫ్రెండ్స్ ఉన్నారా?"

"మీరడిగేది బాయ్‌ఫ్రెండ్స్ సంగతా, గాళ్స్ సంగతా ఆంటీ?"

అందరం ఉలిక్కిపడ్డాం!

సీతావరదరాజన్ కర్చీఫ్‌తో మొఖం

తుడుచుకుంది.

"ఓ! నీకు బాయ్‌ఫ్రెండ్స్, గాళ్ ఫ్రెండ్సూ అందరూ ఉన్నారన్నమాట!"

"అయ్యో! బాయ్‌ఫ్రెండ్స్ లేకుండా ఎవర యినా ఉంటారా ఆంటీ?" తలకొట్టు కుంటూ అడిగింది ఆషా.

"యా- యా- అందరికీ బాయ్‌ఫ్రెండ్స్ ఉంటాయ్!" సర్దిచెప్పాడు హమీద్ మియా.

"ఉంటయ్ కాదంకుల్! 'ఉంటారు' అనాలి-" హమీద్‌మియా దెబ్బతిని ఫేస్ పక్కకు తిప్పేశాడు.

"బాయ్‌ఫ్రెండ్స్‌తో కలసి మీరు గేమ్స్, స్పోర్ట్స్ ఆడుతుంటారు కదూ?" అడిగాడు విజయ్‌యాదవ్.

"వాటన్నిటికీ టైమెక్కడుందంకుల్- ఎడల్ట్ మూవీస్‌కి వెళ్తూంటాం-"

విజయ్‌తోపాటు మేమందరం కూడా షాక్ తిన్నాం- ఆ జవాబుకి.

"ఎడల్ట్ మూవీస్‌కా?"

"అంటే తెలీదా అంకుల్- అదే వాల్‌పోస్టర్స్‌లో 'A' అని వేస్తారు కదా! అలాంటి వన్నమాట-"

"కానీ వాటికి పెద్దాళ్ళనే రానిస్తారు కదా?"

"మేము పెద్దాళ్ళమే కదా?"

మాకేం మాట్లాడాలో తెలీలేదు.

"మీ కంటే పెద్దవాళ్లు మేమున్నాం కదా! అందుకని మిమ్మల్ని చిన్న పిల్లలంటారు-" తెలివిగా అన్నాడు శంకరమూర్తి.

"కానీ మా స్కూల్లో చిన్న క్లాసుల్లో మా కంటె చిన్నవాళ్లున్నారు కదా! వాళ్ళందరి కంటే మా ఎయిత్‌క్లాస్ వాళ్ళం- పెద్ద వాళ్ళం కదా!"

మా అందరికి ఆ లాజిక్‌తో మతిపోయి నట్లయింది.

ఆ తరువాత ఇంకేం మాట్లాడాలో అర్థం కాక ఒకరిమొఖాలొకరు చూసుకుని సైగలు చేసుకుని- ఆ ఇంటర్వ్యూ ఆపి అర్థాంత రంగా బయటికొచ్చేశాం.

ఆషా తండ్రి దివాకర్ "ఇప్పుడేం చేద్దాం?" అనడిగాడు టెన్షన్‌తో.

"ఒకసారి ఆషా స్కూలుకెళ్ళి అక్కడి అట్మాస్ఫియర్ కూడా స్టడీ చేయాలి. ఆ తరువాత ఈ విషయం ప్రిన్సిపాల్‌తోనూ, ఆషా క్లాస్ టీచర్‌తోనూ మాట్లాడాలి" అన్నాడు విజయ్ యాదవ్.

వెంటనే అందరం దివాకర్ ఆమధ్యే కొన్న థర్డ్‌హాండ్ కార్లో 'బ్లూ రోజ్ స్కూలు కెళ్ళాం.

అరగంటసేపు వెయిట్ చేశాక ప్రిన్సి పాల్ మమ్మల్ని లోపలకు పిలిచింది. కానీ అంతమందిని చూడగానే చిరాకు పడింది.

"వై సో మెనీ ఆర్ కమింగ్, ఓన్లీ ఆషా పేరెంట్సే రావాలి. మిగతావాళ్ళంతా అవుట్-" అంది డోర్ చూపిస్తూ

"ఇది చాలా ముఖ్యమయిన విషయం మేడమ్- మా అపార్ట్‌మెంట్స్‌లో ఉండే త్రీహండ్రెడ్ ఫామిలీస్‌కి సంబంధించిన విషయం. అందుకే మా ప్రెసిడెంట్ గారు స్వయంగా వచ్చారు-" అన్నాడు శంకర మూర్తి.

"ఇదుగో- వీరుదా మా సొసైటీ ప్రెసిడెంట్ సార్-" అంది మంగతాయారు హమీద్‌మియాని పరిచయం చేస్తూ.

హమీద్ వెంటనే తన కార్డ్ తీసి ఆమెకి చ్చాడు.

"మా అపార్ట్‌మెంట్స్‌లో బహుత్ సారే పిల్లలు మీ స్కూల్లో ఉన్నయ్" అన్నాడు

"యా- అయ్‌నో- ఇంతకూ ఏమిటీ ముఖ్యమయిన విషయం?" అడిగిందామె.

"విషయం ఏన్నాచ్చీ, దివాకర్‌సార్ పెగ్ ఆషా ఇరికిదిల్లియ- ఆమె ఆ అమ్మాయి-" ఇంక ముందుకెళ్ళలేక, "నువ్ చెప్పు శంక రమూర్తి" అంది.

వెంటనే శంకరమూర్తి అందుకున్నాడు.

"విషయం ఏమిటంటే మేడమ్- ఇది

చాలా సీరియస్ మేటర్! పిల్లల లైఫ్ అండ్ డెత్‌కి సంబంధించిన విషయం- అందుకే మా అపార్ట్‌మెంట్స్‌లో అందరం షాక్‌లో ఉన్నాం. కొంతమంది మ దర్స్ డి(ప్రెషన్‌లో క్కూడా వెళ్ళి పోయారు-"

ప్రిన్సిపాల్ కి కోపం వచ్చింది.

"ప్లీజ్ డోంట్ వేస్ట్ మై టైమ్-" చిరాకుగా అంది.

"చూడండి మేడమ్- దివాకర్ గారి డాటర్ ఆషా మీ స్కూల్లో ఎయిత్ క్లాస్ చదువుతోంది- మీకు తెలిసే ఉంటుంది" అన్నాడు శంకరమూర్తి.

"యా! అయ్ నో! ఆ పిల్ల రాహుల్ గాళ్ ఫ్రెండ్-"

అందరం ఉలిక్కిపడ్డాం-




"ఇంతకూ ఇప్పుడు ప్రాబ్లెమ్ ఏమిటి?" అడిగిందామె.

"చెప్తే మీరు షాకవుతారు మేడమ్- అంత దారుణం జరిగింది-"

"కొంపదీసి వాళ్ళిద్దరూ లేచిపోయారా?" మేము ఖంగారుపడ్డాం.

"లేచిపోటమా? నోనో- అదేంకాదు మేడమ్-"

"థాంక్ గాడ్! లేచిపోతే నాకు పోలీసులతో చాలా హెడేక్ అయిపోతుంది- పోలీసాఫీర్ల పిల్లలందరికీ స్కూల్లో సీట్స్ ఇవ్వాల్సి వస్తుంది-"

శంకరమూర్తికి ఆమె బిహేవియర్ నచ్చినట్లులేదు. అందుకే విజయ్‌యాదవ్ అందుకున్నాడు.

"అంటే లేచిపోవటంలాంటివి కూడా మీ స్కూల్లో జరుగుతుంటాయా?" అనుమానంగా అడిగాడు.

"మా స్కూల్లో అన్న మాటేంటి? అన్ని చోట్లా అది కామనే! మీ అపార్ట్‌మెంట్స్ వాళ్ళెవరూ న్యూస్‌పేపర్స్ చదవరా? సెవెన్త్ క్లాస్ పిల్లలు, ఎయిత్ క్లాస్ పిల్లలు

బెంగుళూరు, బొంబాయి పారిపోవటం- పోలీసులు మళ్ళీ వాళ్ళను వెదికి తీసు కొచ్చి ఇంట్లో అప్పజెప్పటం- రెగ్యులర్‌గా న్యూస్ వేస్తూనే ఉంటారు కదా?" మమ్మల్ని ఇల్లిటరేట్స్‌లాగా చూస్తూ అడి గింది.

"యా-యా- వాట్ యూ సెడ్ ఈజ్ ట్రూ" అన్నాడు హమీద్‌మియా.

"అసలు విషయం ఏమిటంటే లేచిపో వటంకన్నా దారుణమయిన విషయం జరిగింది"

ప్రిన్సిపాల్ మొఖంలో ఆందోళన కని పించింది.

"కొంపదీసి- ఆషా ఎవర్నయినా మర్డర్ చేసిందా?"




మేము అదిరిపడ్డాం.

"మర్డరా? అంత చిన్నపిల్ల మర్డర్ చేయ టమా? మీరు మరీ టూమచ్" అన్నాడు శంకరమూర్తి.

ప్రిన్సిపాల్ తలకొట్టుకుంది.

"మీరు సిటీలో ఉంటున్నారో, విలేజెస్‌లో ఉంటున్నారో నాకర్థం కావటంలేదు. మీలో ఎవరికీ మినిమమ్ జనరల్ నాలెడ్జ్ కూడా ఉన్నట్లు లేదే? పిల్లలు తమ తోటి పిల్లల్ని మర్డర్ చేయటం రెగ్యులర్‌గా టి.వి.లో, న్యూస్‌పేపర్లలో వస్తున్నా తెలీటం లేదంటే- సమ్‌థింగ్ రాంగ్ విత్ యూ పీపుల్, గన్ తీసుకొచ్చి క్లాస్‌లో తనకి నచ్చని వాడిని కాల్చేయటం, దెబ్బలాడాడని నలుగురయి దుగురు కలసి ఒకడిని గొంతు పిసికి చంపేయటం-ఇవన్నీ వెరీ కామన్ యార్".

మేము చాలా ఇన్సల్ట్ ఫీలవటం మొద లుపెట్టాము.

"జరిగిందేంటంటే మేడమ్- ఆషా- ప్రెగ్నెంట్ అయినట్లు ఇందాకే తెలిసింది మామ్-"

ప్రిన్సిపాల్ ఆ మాట విని షాక్‌కు కుర్చీ లోనుంచి కిందపడుతుందని అనుకున్నాం గానీ అలా జరగకపోగా ఆమె పగలబడి నవ్వసాగింది. మాకు మతిపోయినట్ల యింది.

"వ్వాట్- అహ్హహ్హా- ప్రెగ్నెంట్ అయిందా? అహహ్హా- అదేదో కొంపలు మునిగే విషయమయినట్లు ఇంతమంది పరుగెత్తుకొచ్చారా?"

నవ్వుతూనే మాట్లాడుతోందామె. మాకు వళ్ళు మండిపోయింది.

"అలా నవ్వుతారేంటి మేడమ్? అది లాఫింగ్ మేటర్‌లాగా మీకనిపిస్తోందా?" అడిగాడు శంకరమూర్తి కోపంగా.

"లేకపోతే ఏంటి? ప్రెగ్నెంట్ అయితే మాత్రం? అదేదో ప్రళయం వచ్చినట్లు ఏంటా ఖంగారు? దటీజ్ వెరీ కామన్ యార్. బయటి ప్రపంచంలో ఏం జరుగు తుందో తెలుసుకోకుండా- నా ఆఫీసూ- ఇల్లూ అంటూ కూర్చుంటే ఎలా?"

"ఏంటీ అది కామనా?"

"అవును! ఆషా గాళ్ కాబట్టి ఆషాకే ప్రెగ్నెన్సీ వస్తుంది. అది బాయ్స్‌కి రాదు కదా?"

"దిసీజ్ టూమచ్ మేడమ్! పదేళ్ళు వయస్సున్న- ఎయిత్ క్లాస్ గాళ్ కి ప్రెగ్నెన్సీ రావటం కామనా? "

"చూడు మిస్టర్ ఎయిత్ క్లాస్‌కే అంత గొడవెత్తిపోతున్నారు గానీ ఇలాంటివి సెవెన్త్ క్లాస్‌లోనే జరుగుతుంటాయ్- అంతెందుకు? మొన్న ఇంకా చిన్న పిల్ల- ఆ పిల్ల ఏ క్లాస్ రాములూ? " ఆ పక్కనే నిల బడ్డ ప్యూన్‌నడిగిందామె.

"అయిదో క్లాస్ మేడమ్"

"యా- ఆ పిల్ల అయిదో క్లాస్- అయినా ప్రెగ్నెంట్ అయింది"

మాకు చెమటలు పట్టేసినయ్.

"వ్వాట్? అయిదో క్లాస్-"

"యా! ఆ పిల్లను చూపించమంటారా? రాములూ- సంగీతను తీసుకురా!"

అందరం ఖంగారుగా అడ్డుపడ్డాం.

"వద్దు మేడమ్- పిలవకండి! మాకు సిగ్గుగా ఉంటుంది!" అన్నాన్నేను.

"కానీ- ఇన్ని దారుణాలు- ఇంత తక్కువ వయసులో జరుగుతుంటే- మీరేం చేస్తు న్నారు మేడమ్? "

"ఏం చేస్తున్నానా? ఇలా రండి!" అంటూ మా అందరినీ బయటకు తీసుకెళ్ళి అక్కడున్న నోటీస్ బోర్డ్ చూపించింది.

అందరం ఆ నోటీస్ బోర్డ్ మీదున్న మేటర్ హడావుడిగా చదివాం.

"మన స్కూల్లో గాళ్ స్టూడెంట్స్ కొంత మంది- స్కూల్ వర్కింగ్ అవర్స్‌లో ప్రెగ్నెంట్ అవుతున్నట్లు మా దృష్టికి వచ్చింది. స్కూల్ అవర్స్ కేవలం పాఠాల కోసమే అన్న విషయం మరోసారి గుర్తుచే స్తున్నాం! దీన్ని అతిక్రమించిన వారికి పని ష్మెంట్ తప్పదని హెచ్చరిస్తున్నాం- ప్రిన్సి పాల్" అని రాసి ఉంది.

అది చదివి మాకు మతిపోయినట్ల యింది.

"మేడమ్- మీకు పిచ్చెక్కిందో, మాకు పిచ్చెక్కిందో ఏమీ అర్థం కావటం లేదు. మీ స్కూల్లో ఇన్ని ఘోరాలు జరుగుతుంటే పేరెంట్స్‌కి తెలియజేయటం మీ డ్యూటీ! ఆ డ్యూటీ చేయకుండా స్కూల్ అవర్స్- ఆఫ్టర్ అవర్స్ అంటూ నోటీసులు రాస్తు న్నారా? "

"అదంతా ఆషా క్లాస్ టీచర్ డ్యూటీ! మాది కాదు-"

"ఏదీ ఆమెని పిలవండి అర్జంటుగా"

అయిదు నిమిషాల్లో వొళ్ళంతా ఎక్స్ పోజ్ చేసే డ్రస్‌లో క్లాస్ టీచర్ వచ్చింది.

"మిస్ కుంతీరాణీ! ఈయన ఆషా ఫాదర్"

"హాయ్" అందామె దివాకర్‌వేపు చూస్తూ.

"వాళ్ళ ఆషా ప్రెగ్నెంట్ అయిందని- అలాంటి విషయాలు జరుగుతున్నప్పుడు పేరెంట్స్‌కి ఎందుకు ఇన్‌ఫామ్ చేయలేదని అడుగుతున్నారు!"

"పేరెంట్స్‌కా? ఎందుకు? అందులో అన్‌నేచురల్ ఏముంది? "

హమీద్‌కి కోపం ముంచుకొచ్చింది.

"క్యా బాత్ కర్ రహేహై? నీకు దమా కుందా? పదేళ్ళ పిల్ల ప్రెగ్నెంట్ అవటం నీకు నేచురల్ ఉన్నయ్? "

ఆమె కన్‌ఫ్యూజయి ప్రిన్సిపాల్‌వేపు చూసింది.

"వీళ్ళెందుకింత అప్సెట్ అవుతున్నారో నాకర్థం కావటంలేదు మేడమ్!"

ఆషాకి ఆల్‌రెడీ పదేళ్ళు వచ్చినయ్. ఇప్పుడు ప్రెగ్నెంట్ అయింది. తొమ్మిదే ళ్ళకే ప్రెగ్నెంట్ అవటం నార్మల్ కదా మన దగ్గర-"

"నేనూ అదే చెప్తున్నాను. వీళ్ళకి అండర్ స్టాండ్ కావటంలేదు-" అంది ప్రిన్సిపాల్ చిరాగ్గా.

***(తరువాయి భాగం వచ్చేనెలలో..)***

'అయ్యగారికి దండం పెట్టు...అమ్మగారికి దండం పెట్టు...' అంటూ ఊరూరా, గడపగడపకీ తిరుగుతూ గంగిరెద్దులాడించే కళంటే అతనికెంతో ప్రాణం. మనుషుల భాష అర్థం చేసుకుని చెప్పినట్టు వింటూ ఆడిపాడే ఓ ఎద్దును ఎంపిక చేయాలంటే ఎంతో ప్రయాస. గ్రామగ్రామాన పరసలెన్నో ప్రదక్షిణం చేయాల్సిందే...అలా అనేక పరసలు తిరిగిన అతనికి తీరా అనుభవంలోకి వచ్చిన జీవన సత్యం...ఈ ప్రపంచమే పెద్ద పరసని!

డాక్టర్ వి.ఆర్. రాసాని **పరస** ఈనెల చతుర కానుక.



డాక్టర్ వి.ఆర్. రాసాని

# పరస

పరసలో పసికోడె

"అన్నా! బస్టాండొచ్చేసింది"

బస్సు వెనక సీట్లో కూలబడి ఆనాటి దినపత్రికలో తలదూర్చి వార్తల్ని చదువు కుంటున్న చిన్నబ్బ ఒక్కసారి తలెత్తి చూశాడు. అప్పటికే ఆగివున్న బస్సులో నుంచీ జనం దిగుతున్నారు. ఎక్కే జనం వాళ్ళను తోసుకుంటూ బస్సులోకి వస్తు న్నారు.

"లెయ్యన్నా దిగుదాం"

ఆతని ముందు సీట్లో కూర్చోనున్న బీశే రయ్య పైకి లేచి, చిన్నబ్బను మరోసారి హెచ్చరించి ముందుకు నడిచాడు.

చదువుతున్న పత్రికను మడచి చేతిలో పెట్టుకొని, పైకి లేచి, బీశేరయ్య వెనక నిల బడి, అందరితో బాటు తలుపు వైపుకు కద లసాగాడు చిన్నబ్బ.

డ్రైవర్ అప్పటికే తన సీట్లోనుంచీ దిగి, పక్కనే వున్న టీ కొట్లో దూరాడు.

"రంగనాథ బస్ సర్వీస్" అన్న అక్షరాల కింద 'పాకాల- పుంగనూరు' అని కనిపి స్తున్న బోర్డును తిప్పిపెట్టి, కండక్టరు బస్సు దిగి టీ కొట్లోకి వెళ్లిపోయాడు.

రంగనాథ బస్ సర్వీస్... ఎక్కేజనం, దిగేజనంతో కిటకిటలాడుతూ మట్టిని మింగి మట్టినే విసర్జిస్తున్న వానపాములా మనుషుల్ని మింగి మనుషుల్ని విసర్జిస్తూ అటు ఇటు కదుల్తోంది.

ఎక్కుతున్న జనాన్ని తోసుకుంటూ బీశే రయ్యతో బాటు దిగిన చిన్నబ్బ ఒక్కసారి చేతులు పైకెత్తి ఒళ్లు విరుచుకుంటూ 'ఇస్సుబ్బ... నడుం హూనమై పోయిందిరా నాయనా' అనుకుంటూ బస్సువైపు ఒక్క సారి చూశాడు. ఇప్పుడు 'పుంగనూరు-పాకాల' అన్న అక్షరాలు స్పష్టంగా కనిపిం చాయి.

"తెల్లారెప్పుడో ఎక్కితే, దిగేగుందికి యింత పొద్దయింది. నాస్తా తిందాంగానీ యాడన్నా హోటల్ సూడబ్బా పోదాము" అన్నాడు చిన్నబ్బ.

'ఈ దలాల్‌కాన్ని తీసకొస్తే యింతే. తీసకొచ్చినోన్ని సీడపురుగు మాదిరి తినే స్తాడు'

లోపల్నే తిట్టుకుంటూ, బస్టాండు ముందరున్న 'రెడ్డమ్మ హోటల్లో'కి అడుగు పెట్టాడు బీశేరయ్య. అక్కడ చెరో మసాలా దోసె తిని, కాఫీలు తాగి, అక్కడినుంచీ దక్షిణం వైపున జమీందారు బంగళా వున్న నగరివైపు నడవసాగారు.

బీశేరయ్య ఒక సన్నకారు రైతు. ఆతనిది మంగళంపేటకు నైరుతిగా మూడు మైళ్ళ దూరంలో వున్న ఘంటావాళ్ళపల్లె. ఆత నికి పది గొడ్లున్నాయి. అందులో ఒకటి గంగెద్దు. రెండు సేద్యపు గొడ్లు, రెండు కోడెదూడలు. మిగిలినవి పాడావులు.

కోడె దూడల్లో ఒకటైన దేశపు కోడెను గంగెద్దుగా తయారు చేయాలనుకున్నాడు. కానీ అది ఆతని మాట వినలేదు. రెండోది ఎరుపు నలుపు కలిసిన రేగు కాయ మాగిన రంగులో నిగనిగలాడు తున్న చాగిరిదూడ. ఆ రంగు కోడె గంగె ద్దుగా బాగుండదు. దేశపు కోడైతేనే బాగుంటుంది. అలాంటి దూడను కొనా లనే దళాలకాడైన చిన్నబ్బను తీసుకుని ఎద్దుల పరసలు తిరుగుతున్నాడు. నెల నుంచీ ఇద్దరూ జిల్లాలో అన్ని పరసలు తిరుగుతున్నారు. వారం క్రితం పలమ నేరు పరస, పూలగిరి పరస తిరిగారు. మొన్నటికి మొన్న కలికిరి పరస కూడా వెళ్ళి వచ్చారు... టెంకాయరంగు కల జూకాయ పుల్లరంగుదైన దేశపు దూడ దొరకడంలేదు... వాళ్ళకు నెలలోపు వయ సుగల దూడ కావాలి. అది విడిగానైనా సరే... తల్లి ఆవుతోనైనా సరే... చివరి ప్రయత్నంగా పుంగునూరు పరస కొచ్చారు.

రాజుల కాలంనాటి చివరి చిహ్నంగా నిలచివున్న పుంగనూరు జమీందార్ల బంగళాముందుకొచ్చారు.

ముందర ఎత్తయిన ఆర్చి దానిపైన మధ్య ధర్మచక్రం, దానికిరువైపులా రెండు పులులు రెండు కాళ్ళపైన నిలబడి గాండ్రిస్తున్నట్టున్న రాజచిహ్నం కలిగిన తోరణం... దానికవతల శిథిలావస్థకు చేరుకుంటున్న బంగళా... వాళ్ళకంట బడింది.

"అబ్బ... ఎంత వైభోగంగా వుండాదో ఈ బంగ్లా" అన్నాడు దాన్ని గుడ్లప్పగించి చూస్తూ బీశేరయ్య.

"వొగబ్బుడు యిది వొగ ఎలుగు ఎలిగింది. టిప్పుసుల్తాను వాళ్ళ నాయన హైదరాలీ కాలంలో ఈ జమీందార్లు తెల్లోళ్ళకు సాయం జేసినారంట. అందుకని హైదరాలీ ఈ కోటపైన దండెత్తొచ్చినాడంట" దాన్ని చూస్తూ చెప్పసాగాడు చిన్నబ్బ.

"ఈ విషయం నీకెట్ల తెలుసు సిన్నబ్బ? " ప్రశ్నించాడు బీశేరయ్య.

"దాసరోళ్ళు గుమ్మెత కతలో దీనికి సంబంధించిన పాట పాడతారు గదా... అంతేగాకుండా పోయినాదోరంనాడు దీని చరిత్ర గురించి పేపర్లో యేసింద్రిలే"

"యింతకీ నువ్వు జెప్పిన అయిదరాలీ ఎవురు? "

"మైసూరు మహారాజు సామీ... వాళ్ళది పెద్ద రాజ్యం... వందవాసీ యుద్ధమని ఒగిటి జరిగిందంట. ఆ యుద్ధం ఈ హైదరాలీకి, తెల్లదొర్ల నాయకుడు కారను వాలీసుకి మద్దె జరిగిందంట... అప్పుడు ఈ జమిందార్లు యింగిలీసోళ్ళకు ఆయిదాలు సరఫరా చేసినారంట. అందుకని హైదరాలీ దీనిపైన యుద్ధం జేసినాడంట. ఆ యుద్ధంలో కందూరునించీ నాయనోరి పాపన్న, సిద్దప్ప లాంటోళ్ళు యిద్దానికొచ్చి సచ్చినారంట. యింతకీ ఆ హైదరాలీ అమ్మగారూరు మదనపల్లి దగ్గిరుండ్లా అర గొండ... అదంట"

తనకు తెలిసిన పేపరు జ్ఞానాన్నంతా రంగరించి మరీ చెప్పాడు సిన్నబ్బ నాయుడు.

"మరి ఈ జమీందార్లు యిప్పుడుండారా? " అడిగాడు బీశేరయ్య.

"ఉండారంట. కానీ అన్నీ పోగొట్టుకొని ఈ బంగళా మాత్రం మిగిలిండాదంట వాళ్ళకు. వోళ్ళిప్పుడు బెంగుళూరు చేరిపోయినారంటలే. మేము చిన్నోళ్ళుగా వున్నప్పుడు చిన్న బసవ చిక్కరాయలని ఈ జమీందారు ఎలక్షన్లో గూడా నిలబడుండె. ఆయన తర్వాత రాణి అమ్మన్నమ్మ ఎం.ఎల్.ఏ.గా గెలిసిందంట..."

"ఏంటోళ్ళో వోళ్ళు"

"ఓళ్ళు లింగాయతులంటలే. వోళ్ళకు పశుగణం శ్యానా వున్నిందంట. వోళ్ళ పశువుల్ని అమ్ముకుండేదానికే యిక్కడ పరస ఏర్పాటు చేస్తావున్నారంట. యింక అప్పట్నుంచీ పతి సంవత్సరం ఈడనే పరస జగతావుండాదంట"

అలా మాట్లాడుకుంటూ ముందుకు వెళుతున్నారు వాళ్ళు.

వాళ్ళ సంభాషణకు అంతరాయం కలిగిస్తూ పశువులతో నిండిన ట్రాక్టర్ ఒకటి దడదడమని శబ్దం చేసుకుంటూ వాళ్ళను దాటుకొని వెళ్ళిపోయింది. అది రేపిన

## కొత్తగాలి...

**నువ్వు**
**గొయ్యి తవ్వుతున్నపుడే**
**ఆలోచించాలి**
**అందులో నువ్వు పడొచ్చేమోనని**

–సాంధ్యశ్రీ చంద్రిక, ఖుర్దారోడ్, ఒరిస్సా

దుమ్ము కళ్ళలో పడకుండా క్షణంసేపు కళ్ళు మూసుకొని తెరిచారు. అప్పటికే దూరంగా పోతూ కనిపించింది ట్రాక్టర్.

"సిన్నబ్బా... అన్ని గొడ్లు వోళ్ళు యాడికి తోలకపోతా వుండారు? " అడిగాడు బీశేరయ్య.

"కోతకు... బెంగుళూరు కేసకపోతావుంటార్లే" అన్నాడతను.

"అయ్యో పాపం" జాలిగా ముఖం పెట్టి మరీ అన్నాడు బీశేరయ్య.

రెండు ఎర్రగిత్తల్ని తోలుకొని ఎదురుగా వచ్చిన ఒకవ్యక్తి వాళ్ళను తొలగేసుకుని వెళ్ళిపోయాడు.

"య్యోవ్... కలర్ షోడా తాగదామా? " ఓ అంగడి ముందర నిలబడి అన్నాడు చిన్నబ్బ.

"యిప్పుడే గదా దోశ తింటివి? " నసుక్కుంటూ అన్నాడు బీశేరయ్య.

"కడుపులో ఏందో వాగమాదిరిగా వుండాది. అందుకనీ..."

"సరే... కానీ"

అక్కడ రెండు కలర్ షోడా తాగి మళ్ళీ ముందుకు నడవసాగారు.

"పట్టేటప్పుడు మంచి గొడ్డును పట్టాల. ఏ గొడ్డుకు ఎక్కడ సుడులుంటాయో, ఎక్కడ ఏముంటుందో తనకు పూర్తిగా తెలీదు. అట్టాంటప్పుడు ఎట్టాంటిదంటే అట్టాంటిది పట్టుకొచ్చేస్తే ఏం చెరుపు జరుగుతుందో. అందుకే గొడ్డొచ్చినేళ బిడ్డొచ్చినేళ అంటారు. మంచి గొడ్డు యింటికొస్తే మంచే జరుగుతుంది. అందునా పట్టేది గంగెద్దుకాయ. అట్టాంటిదాన్ని పట్టిచ్చేదానికే దళాలకాన్ని ఎనకింటే పిల్చుకొచ్చుకున్నె. వీడేమొ పెతిసోటా బోసీలగతాడు. వోడి పెగ్గె ఎంతుందో అంతా సూపిస్తా వుండాడు. అయినా తప్పదుగదా" మనసులోనే అనుకోసాగాడు బీశేరయ్య.

"య్యోవ్ బీశేరాయనా. వచ్చేసినాం. ఎంత పెద్ద పరసో సూడు పుంగునూరు పరస. ఎంతదూరం సూసినా గొడ్లే... ఎర్రవి, పుల్లవి, నల్లవి, తెల్లవి... పసివి, నాటువి, దేశిపువి, గుంటూరు గిత్తలు, వొగిటీ అరా వొంగోలావులు.. చిన్నవీ పెద్దవీ... ఎట్టుండాయో సూడు... యిసకేస్తే రాలనన్ని గొడ్లు గిజగిజలాడతావుండాయి. ఇంత పెద్ద ఎద్దల పరస ఈ యిలాకాలో యింకేడా జరగదు... ఎన్ని గొడ్లు చేరిపోయినాయోసూడు. సూస్తే గీస్తే పుంగునూరు పరసే జూడాలమల్ల"

ఆనందంగా చెబుతున్నాడు చిన్నబ్బ.

ఇన్ని రోజులూ పుంగునూరు పరస గురించి వినడమే గానీ, మొట్టమొదటగా యిప్పుడే చూస్తున్నాడు బీశేరయ్య. గేటు దాటుకొని పరసలోకి అడుగుపెట్టి ఒక్కసారి కళ్ళింతవి చేసి పరసవైపు పరిశీలనగా చూశాడు.

గొడ్లు... గొడ్లు... గొడ్లు!

ఎంత దూరం చూసినా గొడ్లే. 'ఎంత గొడ్లసంతో'

అని నోరు వెళ్లబెట్టాడు బీశేరయ్య.

అక్కడ ఒకటే అరుపులు... పశువుల అరుపులు... మనుషుల అదిలింపులు. అక్కడ ఒకటే మాటలు... గొడ్ల యజమానులు, దళారులు, వ్యాపారుల మాటలు.

తల్లులకోసం అరిచే దూడలు, దూడల కోసం అరిచే ఆవులు, నేలనుగీరి పక్క పశువుల్ని కవ్వించే గుబిలికోడెల రంకెలు...

మనుషుల్ని చూసి చిటపటల తొక్కుతూ కొన్ని, రోషంతో బుసలు కొడుతూ కొన్ని... కొమ్ములకు బులుగురంగులు పూసినవి కొన్నయితే, కుప్పెలు వేసిన కొమ్ముల్తో మరికొన్ని. రైతులకదొక పండుగ్గా అనిపిస్తోంది. చూసే వాళ్ళకదొక పశువుల ప్రపంచంగా అనిపిస్తోంది.

ఇద్దరూ వరుసగా పశువుల్ని పరిశీలిస్తూ

## గొర్రెలేనా!

జిహ్వకో రుచి,
పుర్రెకో బుద్ధి అంటారు.
ఇంటీరియర్ డెకరేషన్ నేడు
కొత్త పుంతలు తొక్కుతోంది.
లక్షలాది రకాలుగా
వైవిధ్యాలను మనం
చూస్తున్నాం.
ఇంట్లోనే గొర్రె పిల్లల్ని
తలపించే టెలిఫోన్
స్టాండ్‌లను రూపొందించిన
ఈ కళాత్మకతను
మెచ్చుకోక
ఉండలేం కదూ?



పోతున్నారు. పశువుల మధ్య కోలకట్టెల్తో వాటి ముడ్లు పొడుస్తూ వాటి మధ్య తిరుగుతూ కొందరు, బేరాలాడుతూ కొందరు, బేరం కుదిరినవాటిని తోలుకొస్తూ కొందరు, పశువుల్ని నఖశిఖ పర్యంతం పరిశీలిస్తూ మరికొందరు... అక్కడక్కడా నిలబడి కనిపిస్తున్న ఆ మనుషులు కొల్లబోయిన పెద్ద చెరువులో చేపలు పట్టడానికి నీళ్ళల్లో అడ్డదిడ్డంగా తిరుగుతున్న జాలర్లలా కనిపిస్తున్నారు.

"చూడయ్యా. వళ్ళంతా తెలుపు నలుపు ఎంటికల్తో కనిపించే ఈ సున్నపకాయ మైలగొడ్లు అల్లికారు కోడెలు... వీట్లో నీకు సరిపోయేదుందా" అడిగాడు చిన్నబ్బ.

"యివి పెద్దవన్నా... చెప్పినట్లు యినవు" వాటిని చూస్తూ అన్నాడు బీశేరయ్య.

"ఎరుపు తెలుపు చారలుండే ఆ ఎర్రమట్టువి ఎర్రశ్యామడ గొడ్లు. ఎరుపు నలుపు కలిసిపోయి రేగిపండు వర్ణంలో వుండే ఈ ఎద్దులు చాగిరి జాతివి. వీటిలో నీవనుకున్నది దొరుకునా"

'ప్చ్' తల అడ్డంగా తిప్పాడు బీశేరయ్య.

మరికొన్ని గొడ్లను దాటి ముందుకు నడిచారిద్దరు. ఒకచోట వాళ్ళకు యచ్చేపలు కనిపించాయి.

"అద్దో ఆడ గెడ్డి మేస్తావుండే దూడలు యచ్చేపలు. వాటిలో తెలుపు నలుపు కలిసిపోయిన రంగుండే ఆవులు నల్లమట్టి యచ్చేపలు. ఎరుపు తెలుపు కలిసినవి ఎర్రమట్టి యచ్చేపలు. వాటిపక్కనుండే దూడలు చూడబ్బా"

"యచ్చేపలివి గంగెద్దుకు బాగుండవు"

"ఆ పక్కన ఎద్దుల మాదిరి జంపుగా కనిపిస్తావుండ్లా. అవి క్రాసింగావులు. ఈ పక్కన మాసిపోయిన సున్నపు గోడ రంగువి పుల్లావులు. వాటి పక్కనుండేవి నాటుగిత్తలు. వాటికి పక్కన ఎత్తుగా బలంగా మూరెడు పొడవుతో యాలాడతా వుండే గంగడోలు ఊపుకుంటా నిలబడి వుండేవి ఒంగోలు గిత్తలు... వాట్లో వుండే దూడలు సూడు. నీ మొనుసుకు ఏమైనా నచ్చుతాయేమొ..."

అక్కడా వాటిల్లో వుండే దూడల్ని చూసి తల అడ్డంగా తిప్పాడు బీశేరయ్య. ఎంతో ఉత్సాహంగా తనకు తెలిసిన గొడ్ల జాతుల రకాలన్నింటినీ చూపిస్తూ ముందుకు పోతున్నాడు చిన్నబ్బ. ఆతని వెంట నడుస్తున్నాడు బీశేరయ్య... అలా చూస్తూ వెళుతున్న బీశేరయ్య దృష్టి ఒకచోట ఆగిపోయింది.

"య్యోవ్. చిన్నబ్బా... యిది సూడు. లేతదూడ. అచ్చం మా గంగెద్దు మాదిరే వుండాది" ఒక ఎద్దును చూపిస్తూ బీశేరయ్య చెప్పాడు!

"అవును. ఆ ఎత్తయినా గోపురం, బలమెన కాలిపిక్కలు, అందమైన మెడ అర్రు, తలపైన సక్కంగా మొలిచుండే కొమ్ములు, నొసటన తెల్లచుక్క. అంతా నువ్వాడిస్తా వుండే గంగెద్దుమాదిరే వుండాది" అన్నాడు చిన్నబ్బ.

"అది సరేగానీ దానికాపక్క సూడు... దానిమాదిరే వుండే ఆవు. చుక్కావు, ఎంత సోగ్గా వుందో".

"అద్దో బేశేరాయనా... ఈ పక్క సూడు. వగెద్దు. ఈ ఊర్లో దేవరెద్దు మాదిరి చేతిలావు గొమ్ముల్తో గంభీరంగా నిలబడుండాది. ఎంత పెద్దదిగా బలంగా వుండాదో సూడు".

అలా మాట్లాడుకుంటూ నడుములెత్తున్న ఒక చిన్న దేశపు కోడెదూడ దగ్గరాగారిద్దరు.

"చిన్నబ్బా. ఇది పెద్దదయితే అచ్చం మీ యింట్లో దేశపు కోడె మాదిరే వుంటుంది. చూద్దామా? " అడిగాడు చిన్నబ్బ.

"ఆc... దూడ బాగుంది. పైగా న్యాత

దూడ. నెలవయసున్నిట్లు గూడాలే. దాని పక్కనే దాన్ని కన్న ఆవు గూడా వున్నట్టుందే. పదా చూద్దాం" అన్నాడు బీశేరయ్య.

దాని దగ్గరకు పోయారు.

ఆవు నాలుకతో దూడ శరీరాన్ని నాకుతోంది.

"ఏమయ్యా. ఆవు దూడను రెంటినీ బేరం చేస్తావా, వొగదాన్నే యిస్తావా? " చిన్నబ్బ దూడను చూస్తూ పక్కనే నిలబడి వున్న దాని యజమానితో అన్నాడు.

"యిడిగా గూడా యిచ్చేదే. సూడండి" అన్నాడా యజమాని.

"పాలెన్ని ఇస్తాది? " అడిగాడు చిన్నబ్బ.

"పొద్దన్నె రెండు శేర్లు. సాయంత్రం రెండు శేర్లు".

"ఈ దూడ పుట్టి ఎన్ని దినాలయింది" బీశేరయ్య అడిగాడు.

"యాడిది. అంతానెలే".

"బాగా బక్కసిక్కుండాది... నువ్వు చెప్పినన్ని పాలు ఆవు యిచ్చేట్లులేదే" దూడ వీపును చేత్తో నిమురుతూ అన్నాడు చిన్నబ్బ.

"నేనేం తప్పు సెప్పలేదన్నో నిజమే..." ఖచ్చితంగా చెప్పాడు యజమాని.

"తల్లినీ, దూడనీ విడివిడిగా అమ్మితే పాపం గదా". బీశేరయ్య మాట.

"పాపమే... కానీ అమ్మక తప్పడంలేదే".

"ఎందుకు? "

"నిజం చెప్తావుండాన్నా... దీనిత్తగిల్ల పాలు పిండనీయదన్నా".

"ఓహో... అదా కతా. సరే మాకు దూడసాల్లే. దూడ బేరం చెప్పు".

"ఇది సొక్కం దేశిపు దూడన్నా... యాడేగానీ చిన్న సుడిగానీ, తప్పు గానీలే. సొక్కమైన కోడె" గర్వంగా చెబుతున్నాడు చిన్నబ్బకు యజమాని.

"ఏ ఊరన్నా మనది? " ప్రశ్నించాడు బీశేరయ్య.

## కొత్తగాలి...

**ప్రమాదాన్ని ఎదిరిస్తే**
**తెగించడం**
**సమాజాన్ని ఎదిరిస్తే**
**బరితెగించడం**

-తరిగొప్పుల విఎల్లెన్‌మూర్తి, హైదరాబాద్

"మాది కందూరు" అన్నాడతను.

చిన్నబ్బ దాని వీపును తడుతూ నోట్లో నాలికను అంగిలికేసి నొక్కి 'టెర్ర్‌ర్' అని, దాని తోకబట్టి చూశాడు. దాంతో అది ఒక్కసారి చిన్నబ్బవైపు ఉరిమి చూసి మరోవైపుకు తిరిగింది.

"ఓవ్.. ఓవ్. నిలు... నిలు" అంటూ నోట్లో నాలుకను ఒకవైపు దవడకేసి కిర్ర్ కిర్ర్‌మని శబ్దంచేసి గిరికెవేస్తూ దాని శరీరాన్ని ఆప్యాయంగా నిమరసాగాడు దాని యజమాని.

చిన్నబ్బ దాని శరీరాన్ని చూస్తూ దాని ముఖంవైపు చూశాడు. దాని నొసటన నిలువుగా ఒక నల్లటి చార కనిపించి పెదవి విరిచాడు చిన్నబ్బ.

"ఆం. లాభం లేదయ్యా. గొడ్డేమొ బంగారటట్లాటిది. కానీ దాని నొసటన నాముసుడి వుంది" అన్నాడు.

"నాముసుడా!" అయోమయంగా ముఖం పెట్టాడు బీశేరయ్య.

"నాముసుడి మంచిదేలేయ్యా. మనం కొలిసే ఎంకటేసునికి నామంలేదా ఏందీ? " అన్నాడు దాని యజమాని.

"నాముసుడి దాన్ని పడితే కొన్నోడికి నిలువు నామాలే. అచ్చిరాదు. రావయ్యా పోదాము" అన్నాడు చిన్నబ్బ.

"ఓన్నో... ఆవునన్నా చూసికొనండన్నా... కొంచెం అగ్గవగా యిస్తాను".

బతిమాలాడసాగాడు యజమాని.

"వద్దులేవయ్యా సామీ" అంటూ చిన్నబ్బ బీశేరయ్యను తీసుకొని మరి రెండడుగులు ముందుకేశాడు.

అంతవరకూ వాళ్ళనే చూస్తున్న ఒక



వ్యక్తి వాళ్ళ దగ్గరికొచ్చి "చిన్నబ్బన్నా..." అన్నాడు.

"ఇంత పరసలో మనల్ను పలకరించేవో డెవుడబ్బా" అనుకుంటూ అటు చూశాడు చిన్నబ్బ.

ఎదురుగా తెల్లటి లుంగీ, అదే రంగు చొక్కాతో తలగుడ్డ భుజానేసుకుని ముప్పై దాటిన వ్యక్తి అటే వస్తున్నాడు.

"నేనన్నా. పేరా వాండ్ల పల్లె గంగచెంద్రని" దగ్గరకొస్తూ తనకు తానే పరిచయం చేసుకున్నాడతను.

ఘంటావాళ్లపల్లె పక్కనున్న ఊరే అది. ఆ ఊర్లో అందరూ తనకు తెలిసినవాళ్లే.

"ఓ గంగచెంద్రా. నువ్వా! నువ్వు గూడా ఎద్దులు పట్టేదానికొస్తివా?"

"అవునన్నా. రెండు కపిలగొడ్లు కొనాలని వస్తి. ఈ సుడులు గిడులు నాకు తెలీవు. కొంచెం కొని పెడతావా?"

తాను వచ్చిన పని చెప్పాడతను.

"యాడయ్యా. మేమొగ దేశిపు దూడను కొనాలని వస్తిమే..." నసిగాడు చిన్నబ్బ.

పని లేకపోయినా పని ఉన్నట్టు మాట్లాడ్డం దళారులకొక నైపుణ్యం. ఆ విషయం గంగచెంద్రకు బాగా తెలుసు.

"అన్నో. గొడ్ల మంచీ సెబ్బురా తెలీనోన్ని. నువ్వేమీ నా కోసరం ప్రత్యేకంగా రావాల్సిన పనిలేదు. మీతోబాటే నేనూ వస్తా. నాకు నచ్చిన వాటిని చూపిస్తా. వాటికి సుడులు చూసి కొంచెం బేరం చేసి పెట్టు సామీ చాలు. నీ రుణం ఉంచుకోన్లే" అన్నాడు.

"సరే... రా" అంటూ ముందుకు నడిచాడు చిన్నబ్బ.

గొడ్లను, గొడ్ల యజమానుల్ని పక్కన బెట్టి, పైగుడ్డ చేతులపైన వేసుకుని ఒకరి వేళ్ళు మరొకరు నలుపుకుంటూ రహస్య బేరాలు ఆడుకుంటున్న దళారుల్ని, పశువుల్ని చూసుకుంటూ ముందుకు వెళుతున్నారు ముగ్గురూ.

ఒకచోట అల్లి కారు ఎద్దుల్ని చూపించి "ఇవి చూడన్నా" అన్నాడు గంగచంద్ర.

ఆ గిత్తలు తెలుపు నలుపు వెంట్రుకలతో నిగనిగలాడుతున్నాయి. వాటి పక్కనే, వాటి ముందర వరిగడ్డి పోచల్ని విసరేస్తూ నిలబడున్నాడు వాటి యజమాని. అతని పక్కనే మరో దళాల్ కాడూ ఉన్నాడు.

"ఇవి కపిల తోల్తాయాన్నా?" వాటిని చూస్తూ అడిగాడు గంగచంద్ర.

"వొగ కపిలేమన్నా. మడక, బండి, గుంటవ తోల్నాయి. గొర్రు గూడా తోల్నాయన్నా..." ఏదో బేరం తగిలిందనుకుంటూ చెప్పాడు వాటి యజమాని.

"నాకు కపిలకు బాగా రావాలన్నా..." నలిగిన వాటి అర్రుల్ని చూస్తూ అన్నాడు గంగచంద్ర.

"య్యోవ్. మీదేవూరో గానీ... నిజం చెప్పినా నమ్ముతారు. అబద్దం చెప్పినా నమ్ముతారు. కపిల తోలేదానికి అపీలేలే. తోల్తే గీల్తే శనిగసాళ్ళు, గొర్రుసాళ్ళు వీటితోనే తోలాల. అట్టా యిట్టా జగ్గవు. పుల్ల బెట్టి గీసినట్టే సాళ్ళు. అంతలెక్కా సారమైన గొడ్లు" వాటి దళాల్ కాడన్నాడు.

చిన్నబ్బ కళ్ళు వాటి శరీరాల్ని నిశితంగా చూస్తున్నాయి.

"యేందన్నా చూస్తా ఉండావు?" అన్నాడు వాటి యజమాని.

"య్యోవ్. మంగలోడు మనుషుల తలెంటికిలకల్లా చూస్తాడు. సాకలోడు చొక్కాలు చూస్తాడు. గొడ్ల దళాలకాడు గొడ్ల సుడులు చూస్తాడు. అంతమాత్రంతెలీదా" అన్నాడు చిన్నబ్బ.

"అట్టాంటి తప్పులు గిప్పులు ఏమీ లేవన్నా" చెప్పాడు యజమాని. గంగచంద్ర, బీశేరయ్యా వాటి కొమ్ముల్ని, కాలి గిట్టల్ని, అర్రుల్ని, వాటి ఎనక భాగాన గాయాలై మానిపోయి ఉన్న చర్మాన్ని

## కొత్తగాలి... 

**ఒకప్పుడు యాత్రలు**
**పుణ్యం కోసం**
**నేడు ఆ యాత్రలు**
**పదవులకోసం**

**-అద్దేపల్లి భరత్‌కుమార్, చిలకలూరిపేట**

చూస్తున్నారు.

"వీటి ముడ్లు ఇట్టా పొడిచేసినారే... పనికి బాగా వస్తాయా రావాన్నా".

అనుమానం వ్యక్తం చేశాడు బీశేరయ్య.

"గొడ్ల ముడ్లు పొడిచి బతికేవాళ్లం. మీక బద్దం చెప్తామా?"

వాళ్ళ దళాల్ కాడన్నాడు.

ఆ ఎద్దుల్లో ఒకదాని కొమ్ములు కాస్తా అర్ధచంద్రాకారంగా ముందుకు వంగి, చూడ్డానికి చక్కగా ఉన్నాయి. జత ఎద్దుకు ఒక కొమ్ము కాస్తా వెనక్కి వంగినట్లనిపిస్తోంది.

"అంతా బాగానే ఉండాయి. కొమ్ములు కలవలేదు గదన్నా" అన్నాడు చిన్నబ్బ.

వాటిలో బాగా నలిగి ఉన్న ఒక ఎద్దు అర్రుని స్పృశిస్తూ "ఏదివలపట. ఏది దాపట" అన్నాడు గంగచంద్ర.

"కొమ్ములు సక్కంగా ఉండేది దాపటిది. ఎనుకూ ముందులుగా ఉండేది వలపటిది" చెప్పాడు యజమాని.

"మరి ఇంత మంచి గొడ్లను ఎందుకమ్ముకుంటా ఉండావు. ఇవేమన్నా పొడిచే గొడ్లా..." ఆరా తీశాడు చిన్నబ్బ.

"అబ్బే.. అదేం లేదన్నా. దాపటెద్దు మాత్రం పిల్లోల్లు దగ్గిరికొస్తే కొంచెం కొమ్ములిసరతాదంతే."

"తంతాయా?"

"అట్టా అలబాట్లేవీ లేవన్నా".

"పనికి సక్రమంగా వస్తాయా... అణికే సుకుంటాయా?"

"అన్నా... సత్తె ప్రమాణకంగా సెప్తా వుండా. బంగారట్లా గొడ్లన్నా. ఏ పనైనా నల్లేరు మింద బండే. అప్పీలేలే."

"మరెందుకమ్ముకుంటా ఉండావు" సూటిగా ప్రశ్నించాడు గంగచంద్ర.

"ఏం చెప్పేదన్నా. నాకేమొ వయసైపోతా ఉండాది. ఇంకా సేద్దెంజేసే ఓపికలే. ఉండే వొగ కొడుకు టవున్లో పనిజేస్తా ఉండాడు. ఈ గొడ్లతో అగసాట్లు బడలేక అమ్మదామనుకుంటా ఉండా" దాపరికం లేకుండా చెప్పాడు యజమాని.

"ఏవూరన్నా మీది?" అంటూ వెళ్ళి ఒక ఎద్దుకు ముక్కుతాడు పట్టుకొని, దాని పైపెదవి తెరచి పళ్ళు చూస్తూ అడిగాడు చిన్నబ్బ.

"ఇది నాలుగు పళ్ల మీదుంది" అని వదిలేసి "ఏ ఊరో చెప్పలేదే" అన్నాడు.

"మాది వాయల్పాడు దెగ్గిర... మర్రిపాడు"

"ఆ ఎద్దు ఎన్ని పళ్లమీదుంది?" మరో ఎద్దును చూస్తూ అడిగాడు.

"నిజం చెప్పొద్దా... దానికి కడలు మొలిచినాయన్నా"

"అదీ గంగచెంద్ర. యింకనీ యిష్టమబ్బా" అన్నాడు చిన్నబ్బ.

"ఫరవాలేదులేన్నా... తప్పులేమైనా వుండాయేమొ సూడు" అన్నాడు గంగచంద్ర.

అందులో ఒక ఎద్దు కుడికంటి చుట్టూ వున్న తెల్లమచ్చ చూసి "యిదేమబ్బా. దీనికి 'కంటిపులి' వుంది. తప్పుకదా" వాటి యజమానిని చూసి అన్నాడు చిన్నబ్బ.

"నాయాలు బోతెలివిమంతుడు. కనుక్కున్నే" మనసులోనే అనుకున్నాడు యజమాని.

"నిజమేన్నా వొగకంటికే వుంటే తప్పు. రెండు కండ్లకూ వుంటే మంచిది గదన్నా.

దానికి రెండు కండ్లకు కంటిపులి వుంది. సూడు"

ఆతని పక్కనే వున్న దళాలకాడన్నాడు.

"నువ్వు ఈయప్పకు దలాలకాడివా? "

"అవునబ్బా"

"దలాలకాడంటే ఎవురన్నా? "

వాళ్ల సంభాషణ వింటున్న గంగచంద్ర అడిగాడు.

"ఎద్దుల యజమాన్ల మద్దెన బేరాలు కుదిర్చే దళారే... దలాల్ కాడు. గంగ చంద్ర! ఈ గిత్తలు నీకు నచ్చినాయా? "

"నచ్చినాయన్నా.... మరి ఏదో కంటి పులి అన్నారే..." తల గోక్కున్నాడు. "కంటిపులి అనేది ఒక మచ్చ. అది ఒక కంటికుంటే తప్పు. రెండు కండ్లకూ ఉంటే మంచిది. కొనొచ్చు"

"సరే. బేరమాడన్నా. ఎంతలో ఉండాడో!"

"యేమబ్బా దలాల కాడూ. బేరం నువ్వు చెప్తావా, ఎద్దలాయన చెప్తాడా? " అడిగాడు చిన్నబ్బ.

యజమానికి దళాల్ కాడీకీ ముందే ఒక అవగాహన వుంటుంది. కాబట్టి,

"నేనే చెప్తాన్లే" అన్నాడతను.

"సరే చెప్పు."

"నాలుగు వేలన్నా"

"నాలుగు వేలా... యింకొగమాట చెప్పు."

"వొగ యిన్నూరు తగ్గిచ్చుకో... అంత కంటే తక్కువైతే కష్టమన్నా"

దళారులిద్దరూ బేరమాడుకుంటుంటే మిగిలినవాళ్లు వాళ్లవైపే చూస్తున్నారు. వాళ్లు బేరమాడుతున్న గొడ్లు నింపాదిగా, వరిగడ్డి పోచల్ని నములుకుంటున్నాయి. దళాలకాళ్లు కొంతసేపు బేరాలాడుకున్న తర్వాత చిన్నబ్బ గంగచంద్ర దగ్గరకు వచ్చి, ఆతన్ని అవతలికి తీసుకెళ్లి ఎంతక యితే కొంటాడో తెలుసుకున్నాడు. అలాగే అవతలి దళాలే వాటి యాజమానిని అవతలకు తీసుకెళ్లి ఏదో గుసగుసలాడి తిరిగొచ్చాడు. దళాలకాళ్లు యిద్దరూ మళ్లీ దగ్గర కొచ్చారు.

"ఏమబ్బా. అట్టకాదు గానీ.... ఇట్లరా" అని ఇంకా దగ్గరకు పిలిచి అతని కుడిచేతిని తన చేతుల్లోకి తీసుకుని భుజానున్న తలగుడ్డతీసి చేతుల్ని కప్పాడు. ఆ తర్వాత గుడ్డకింద చేయి కదిలిస్తూ "యిద్దోబ్బా. ఇంతకు తెంచతా... అందులో నాపక్క నాసి యింత" అన్నాడు.

"యిద్దో, అదికాదు గానీ... పెద్దవి యింత... చిన్నవి ఇంత. యింతకు వప్పిస్తా... నా పక్క నాసి ఇంత పెట్టుకో... నీకి యింతలో యింత నాసి..." చిన్నబ్బ వేళ్లని నలుపుతూ చెబుతున్నాడు అవతలి దళాలకాడు.

మిగిలినవాళ్లు అయోమయంగా చూస్తున్నారు. వాళ్లు మాట్లాడుతున్నది తమ కళ్లెదుట, తెలుగే అయినా అంతా అయోమయంగా ఉంది. వాళ్లకేమీ అర్థం కావడం లేదు. వాళ్లు అలా చూస్తుండంగానే యిద్దరి మధ్య అవగాహన కుదిరింది.

అవతలి దళాలకాడు ఎద్దుల యజమానిని మళ్లీ దూరంగా తీసుకెళ్లి ఏదో రహస్యంగా చెప్పి మళ్లీ తీసుకొచ్చాడు.

చిన్నబ్బ గంగచంద్రను పక్కకు తీసుకొచ్చి "మూడువేలా మున్నూరబ్బా. అంత కంటే తక్కువ రాదన్నాడు" అన్నాడు.

"గొడ్లు నెమ్మదిగానే వుండాయి... ఆ కంటిపులి..."

మళ్లీ నసిగాడు గంగచంద్ర.

"య్యోవ్ గంగచంద్రా. నా మాటిను. అదేం చెరుపు లేదు. నీనుండా గదా. అంతగా నువ్వు వద్దనుకుంటే నేనే అమ్మిపెడతాలే. గొడ్లు మంచివి... అగ్గవ కూడా... ఈ రేటుకి వేరేవైతే వొగెద్దు రాదు. ఆc" అన్నాడు చిన్నబ్బ.

'సరే' అన్నాడు గంగచంద్ర.

అలా ఎద్దుల బేరం కుదిరాకా గంగ చంద్ర మూడువేలా మూడు వందలు జేబులో నుంచీ తీసిచ్చాడు. చిన్నబ్బ అవతలి దళారిని పక్కకు తీసుకువెళ్లి, మూడు వేలు అతని చేతిలో పెట్టాడు. ఒకవంద దళారికిచ్చి తను రెండువందలు జేబులో వేసుకున్నాడు. తిరిగొచ్చి గంగచంద్ర దగ్గర తన కమీషన్ మళ్లీ ఒక వంద తీసుకుని "గంగచెంద్రా ఎద్దుల్ని పట్టుకో..." అన్నాడు.

"పట్టుకుంటాగానీ మీరు పోయి మీక్కావాల్సిన గొడ్డును పట్టుకరండి. తోడులో తోడు. వచ్చినప్పుడు మీరొస్తారని తెలీదు. అందుకని కలిసిరాలా. పోయేటప్పుడైనా అందరూ కలిసి వెలదాం. అంత వరకూ నేనిక్కడే ఉంటాలే" అన్నాడు గంగ చంద్ర.

చిన్నబ్బా బీశేరయ్యా దూడని అన్వేషిస్తూ ముందుకు కదిలారు.

"ఏం చిన్నబ్బా. మరుగు బేరంలో పెద్దవి, చిన్నవి, నాసి నీకింత. నాకింత యేందబ్బా అది. దాన్ని గురించి కొంచెం చెప్పవా?"

"ఇది నిగూఢం... దళాలకాడెవుడూ అది చెప్పడే"

"నాకు చెప్పేదానికేం గానీ చెప్పబ్బా"

"ఏం లేదబ్బా నాసి అంటే కమీషన్. తువ్వాలు కింద రెండేళ్లు తీసుకోని ఒక సారి నొక్కితే పెద్దవి. అంటే వేలు. రెండు సార్లు నొక్కితే చిన్నవి. అంటే నూర్లు. నాసి... అమ్మినందుకు నీకింత, ఇప్పిచ్చినందుకు నాకింత అని" వివరించాడు చిన్నబ్బ.

"నాసి అంటే దళాలకాడి కమీసనన్న మాట. భలేవుందబ్బా మీ మరుగు బేరము, అందులో కిటుకు"



"మరి నాకు కోడెదూడను కొనిచ్చినా అంతేనా..."

"ఏమబ్బా. తేనె తీసినోడు చెయ్యి నాక్కోకుండా వుంటాడా?"

"మంచి వరుంబడేన్నా నీకు, సరే సుడులు, మచ్చల గురించి కూడా కొంచెం చెప్పు' తెలుసుకుంటా. ఎబ్బుడన్నా గొడ్డును కొనాలన్నా, అమ్మాలన్నా బాగుంటుంది."

"గొడ్లుండే పతివాడూ తెలుసుకోవాలబ్బా. సెప్తాయివరంగా... యినుకో" చెప్పడం మొదలుపెట్టాడు చిన్నబ్బ.



"పశువులకుండే సుడులు, మచ్చలు అన్నీ మంచివీ కాదు. అన్నీ చెడ్డవీ కాదు. కొన్ని మంచి వుంటాయి. కొన్ని తప్పుడివి వుంటాయి. నొసటన సుక్కసుడుంటే అది మంచిగొడ్డు. కొనేవాడికి మంచిది. నాముంటే తప్పు. కొన్ని గొడ్లకు అర్ధబఱ్రెలే వుంటాయి. బఱ్రెముకలు పూర్తిగా వుండవు. అట్లా వాటిని 'మోటబఱ్రె' అంటారు. ఎడం పక్కన మోటబఱ్రె వుండే గొడ్డును ఎవురూ కొనరు. కొన్ని గొడ్లకు ముందరి కాళ్ళకి మచ్చలుంటాయి. వీటిని 'సంకెళ్ళసుడి' అంటారు. ఈ సంకెళ్ల సుడి గిట్టల కాన్నించీ జానేస్తే అందకూడదు. అందితే తప్పు. ఇంకపోతే గూటంసుడి. ఇది పేడేసే తావన, తోక ముట్టెపైనుం టుంది. ఇది తప్పు. దీన్ని కొన్నోళ్ళకు గూటమే. అంటే సెరుపే. అట్టాంటిదే పొరకసుడి. వీపు మింద శంకం మాది రుంటుంది. ముడ్డి పూసనుంచీ బెత్తె వేస్తే అందకుండా వుండాల. అందితే అది తప్పు. అందకుంటే ఒప్పు. గొడ్డు మెడకు

ఇరుపక్కలా గం(డగొత్తులుంటాయి. వీటిని 'పలుపు సుడులు' అంటారు. ఇవి కూడా కొందరికి సెరుపే, పట్టరు. మెడపైనుండే మచ్చను 'అరితిసుడి' అంటారు. దీనికి కాడిమాకు తగలకూడదు. అంటే అ(రు పైకి వుండకూడదు. కాడిమాను కింద సుడినలిగితే దాన్ని కొన్నోడి సంసారం గూడా అ(రు నలిగినట్టు నలిగిపోతుంది. పసరానికి ముక్కెసంగా చూడాల్సిన సుడి కొమ్ముసుడి. రెండు కొమ్ముల మద్దెన గుంత మాదిరుంటుంది. దాన్లో నీళ్ళు పడితే, ఆ నీళ్ళు చెవులకు వెనక పక్కింటే పోవాల. అదే ముందు పక్కగా కారితే దాన్ని కొనుక్కున్నోడి బతుకు ఏడుపే" చెప్పుకుపోతున్నాడు చిన్నబ్బ.

సుడుల విషయంలో ఆతనికున్న జ్ఞానానికి అబ్బురపడుతూనే తనకు తెలిసున్న 'ఎడమ గోటిసుడి' గురించి అడిగాడు బీశేరయ్య.

"ఎడమ కాలి సబ్బన ఎలబారి సంకలో తేల్తుందీ సుడి. అదే కుడి పక్కనుంటే మంచిది" అన్నాడు చిన్నబ్బ.

"ఈ సుడి వున్న గొడ్డును కొంటే తప్పా? "

"తప్పా తప్పన్నర. కొనగూడదు అంతే"

"గొడ్లకున్నట్లు మనుషులకు సుడులుండవా? "

"వుంటాయి, ఎందుకుండవు? "

"ఏదీ రెండు చెప్పు చూద్దాం"

"కొందరికి ముచ్చినగుంటలో సుడి వుంటుంది. యింకొందరికి నన్నెత్తిన సుడుంటుంది. ఈ సుడున్నోడికి ఎప్పుడూ పైసూపే గానీ కింది సూపుండదు"

"అంటే ఎట్లా? "

"మనిషికి అబ్బే ఆలోచనలు చెయ్యడన్నమాట. ఈ సుడున్నోడికి మంగలోడు ఎంత బాగా కటింగ్ చేసినా, ఎంటికిలు కుచ్చుమాదిరి నీలుక్కోనుంటాయి. వీడికి పెగ్గె ఎక్కువ. మనుషుల్ని చూస్తే నెత్తిన ఎంటికిలు మాదిరే నీలుక్కుంటాడు. యింకొందరికి నొసటన సుడుంటుంది. వీళ్లని సుక్కతలోడు అంటాం. మగోళ్లకు సుక్కతలుంటే కొందరు ఆడ బిడ్డనియ్యరు. కొందరికి కనుబొమ్మలు కలుసుకోనుంటాయి. ఇది గూడా మొగోళ్ళకు ఫరవాలే. ఆడోళ్లకుండకూడదు"

"వుంటే ఏమి? "

"ఏమీలే... వయసులోనే మొగడు పోతాడంటారు మరి"

"ఇట్టాంటివి భలే తెలుసబ్బా నీకు. యింకా సెప్పు" ఆసక్తిగా అడిగాడు బీశేరయ్య.

అరసెయ్యి సాంపి సక్కంగా పెట్నప్పుడు అరచేతిలో గుంతుండే వోడికి దుడ్డు కూడుతుంది. ఏళ్ళమద్దెన సందులుంటే సంపాదించేదంతా నీళ్ళు కారినట్టు కారిపోతుంది. "అద్దో అన్నో దేశిపుదూడ. మనకు సరిగ్గా సరిపోతుంది" ఒక దూడ ముందర నిలబడి ఆతని వా(క్ప్రవాహానికి అడ్డుపడుతూ అన్నాడు బీశేరయ్య.

"యిప్పుడు నువ్వాడిస్తా వుండే గంగెద్దు జతకు కూడా కుడిచేతికి ఎడమచెయ్యి మాదిరి సరిగ్గా సరిపోతుందిలే" దాన్ని పరిశీలిస్తూ అన్నాడు చిన్నబ్బ.

"ఎవురయ్యా. యీ దూడగల్లాయన" అక్కడేవున్న ఓ వ్యక్తినడిగాడు బీశేరయ్య.

"నేనేప్పా ఏం చెప్పండి? " పక్కనే వున్న మరో కోడెదూడను వీపు నిమురుతూ అన్నాడా వ్యక్తి.

"యిది యిచ్చేదేనా? "

"యిచ్చేదానికే గదా యీ సంతలో కట్టేస్తాము"

"ఎన్ని దినాలైంది యిది పుట్టి... శ్యానా న్యాతదూడగా వుండాదే"

"న్యాతదూడ... పుట్టినెలైందంతే. దీనమ్మకు కు(రమొచ్చి సచ్చిపోతే అమ్మేదానికి

తీసకొచ్చినా"

"గెడ్డి తింటుందా..."

"కొంచెం కొంచెం గెరిక నమల్తాది"

"ఇంకా ముగుదాడు కుట్టలా"

"చిన్న బిడ్డెకదా... అప్పుడు ముగుతాడు కుడితే తట్టుకోలేందిగదా. అందుకే మూతికి వల మాదిరి ముగుజంబారి యేసినా"

దాని ముగుజంబారి పట్టుకోబోయాడు బీశేరయ్య. అది బుస్సుమంటూ ముందుకొచ్చింది.

"ఓ బో... రోషమే దీనికి..." అని "కొంచెం జంబారి పట్టియ్యి" అన్నాడు చిన్నబ్బ.

యజమాని దాని ముఖాన్నీ, వీపుని చేత్తో నిమురుతూ... జంబారి పట్టుకొని దాని మోర పైకెత్తాడు. కొర్రమని శబ్దం చేస్తూ మళ్ళీ బుస్సుమని కదం తొక్కింది.

"వుండు... ఓవ్... ఓవ్..." అంటూ దాన్ని సముదాయిస్తూ ఆ తాడును చిన్నబ్బ చేతికిచ్చాడు.

చిన్నబ్బ దాని పెదాలు లాగి పళ్ళు చూశాడు. ముత్యాల్లా దాని పళ్ళు మిల మిల మెరిసిపోతున్నాయి. 'అతను చెప్పింది నిజమే... పాల పళ్ళు. వట్టి చిగురు గడ్డలు వుండాయి' అనుకుని ఆపాదమస్తకం పరిశీలించి రెండువేలకు బేరం కుదిర్చాడు.

బీశేరయ్య నడుముకు కట్టుకున్న వల్లిటం విప్పి, అందులో దాచుకొని వున్న డబ్బుల్ని తీసి... అందులోనుంచీ రెండు వేలు తీసిచ్చాడు. "కన్న కష్టాలు బడి తెచ్చిన దుడ్డు... అయినా దూడ మంచిదయితే సాలు, అదే సంపాదిస్తాది" అనుకుంటూ దూడ పగ్గం చేతబట్టుకున్నాడు.

గంగచంద్ర అప్పటికే తను కొన్న ఎడ్లను తోలుకొని సిద్ధంగా వున్నాడు.

చిన్నబ్బ బీశేరయ్య దగ్గర రావల్సిన కమీషన్ తీసుకొని "నేను బస్సుకొస్తాగానీ మీరు గొడ్ల పట్టుకొని ఎలబారండి" అని మళ్ళీ పరసలోకి వెళ్ళిపోయాడు.

బీశేరయ్యా, గంగచంద్ర గొడ్లను తోలుకొని పరస వెలుపలికి రాసాగారు.

"దీన్ని మంచి గంగెద్దుగా తీర్చిదిద్దతా. నా సర్వశక్తులూ వడ్డి బాగా మేపతా" అనుకుంటూ గంగచంద్ర వెంట నడవసాగాడు బీశేరయ్య.




## అభ్యాసం కూసువిద్య

**అ**ది ఆ ఊర్లో రాశిల్లు.

గోడవారంటే నాటి వున్న గొర్తు కొయ్యలకు వరుసగా పశువుల్ని కట్టివేసి వున్న కొట్టం... దానికి దక్షిణంగా మరో కొట్టం... దానికి వెనక పూరిల్లు...

గొడ్ల కొట్టంలో గోడ పక్కగా మూరెడు వెడల్పుతో, బెత్తెడు లోతుగా గాడి ఏర్పాటు చేయబడివుంది. ఆ గాటిలో రాత్రివేసిన చొప్ప దంట్లను సగం నమిలి సగం అలాగే వదిలేశాయి గొడ్లు. కొట్టం పశువుల గంజరం, పేడతో వాసన కొడుతోంది. అందులోని పశువులు తమ శరీరాలకు వాలుతున్న ఈగల్ని, దోమల్ని తోకలతో తోలుకుంటూ నిలబడున్నాయి. పక్కనున్న కొట్టంలో, పూరింట్లో బీశేరయ్య కుటుంబం జీవిస్తోంది. పూరింటికి ఉత్తరంగా, గొడ్ల కొట్టానికి వెనుక వున్న బండ్ల పందిరి



శ్రీమంతుడి ఇల్లాలైనా,
అంతులేని వైభోగం ఉన్నా,
ఏకాకితనం ఆమెనెలా కృంగదీసింది?
కోటి ఆశలతో చేసుకున్న పెళ్లి
పంజరంలా ఎలా మారిపోయింది?
ఓ ఒంటరి యువతి
జీవన పోరాటాన్ని ఆసక్తికరంగా
అక్షరీకరించిన
మాచిరాజు కామేశ్వరరావు
నవల
దిశానిర్దేశం

అక్టోబరు చతుర లో మీకోసం...

కింద గంగెద్దు పడుకోనుంది. ఆరోజు తొలికోడి కూసీ కూయకనే బీశేరయ్య లేసి, కన్నయ్య, అతని భార్య పడుకునే చుట్టింటి తలుపు తట్టి "చిన్నోడా లేరా. పోదాం" అన్నాడు.

"ఆ వస్తాండన్నా..." లోపల్నుంచే సమాధానం చెప్పాడు కనకయ్య. అప్పటికే నిద్ర లేచి కొట్టంలో ఓ మూల వున్న పాత నుల కమంచంమీద కూర్చొని వక్కాకు నములు కుంటూ వున్నాడు ఆ యింటి పెద్ద గంగెద్దల కోటయ్య.

కొట్టంలో పడమటి వైపున దీగూడులో ఆముదపు దీపం వెలుగుతోంది. దానికి దక్షిణం వైపున్న గోడ కొమ్మున ఒక డోలు, దానికివతలున్న కొమ్ముకు మూడు సన్నాయిలు వ్రేలాడుతున్నాయి... ఒక మూల వ్రేలాడదీసిన కమ్మీకి తగిలించివున్న కపిల బానను దించి, భుజానికి తగిలించుకొని, అక్కడే వున్న సలంకపారను చేతబట్టుకొని ఎడ్ల కొట్టం ముందరికొచ్చాడు బీశేరయ్య.

అప్పటికే నిద్రలేచి వచ్చిన కన్నయ్య కపిల మోకును భుజానేసుకొని కపిల గొడ్లను తోలుకుంటూ కొట్టంలో నుంచీ వెలుపలికి వచ్చి 'ఇంక రాన్నా' అంటూ ముందుకు నడవసాగాడు.

పల్లెలో అప్పుడే కోళ్ళు కూస్తున్నాయి. అరగంటలో యిద్దరూ ఊరికి ఉత్తరానున్న కపిలబావి దగ్గరికి చేరుకున్నారు.

కన్నయ్య బారిలో ఎద్దుల్ని పూన్చి కాడి మాను మెడలపైన పెట్టి పలుపులు తగిలించాడు. ఆ తర్వాత పట్టీలు బిగించాడు. ఆ చీకట్లోనే, దోనెలో వున్న బండి, పుల్లిరుసు దీశాడు బీశేరయ్య.

కపిల బండిని చేతుల్లోకి తీసుకుని, తన్ను గొయ్యపైన ఒక కాలుపెట్టి, చెవు కట్టెల మధ్య బండినుంచీ, కందిన పూసి

వున్న బండి కట్టెను దూర్చి బండి తగిలించాడు. ఆ తర్వాత దోనికి మొగదల, నీళ్ల కుమ్మరిల్లేచోట వున్న చెవు కట్టెల మధ్య పుల్లిరుసు తగిలించాడు. ఆ పైన ఎద్దుల మెడలపైన పూన్చి వున్న కాడిమాను దగ్గరనుంచీ మోకును తెచ్చి, దాని కొసను బండిగాడిలోనుంచీ బావివైపుకు లాగి, కపిల బానగుండులోనుంచీ తీసి జారిపోకుండా జిల్లపెట్టాడు. అలాగే తొండం తాడును లాగి బాన కొసకున్న రింగు పట్టీలో దూర్చి జిల్లపెట్టి వదిలాడు.

కన్నయ్య ఎడ్ల పగ్గాలను కాడిమాను మీదుగా తీసి, రెంటినీ కలిపి ముడివేసి మోకుకు కుడిపక్కన నిలబడి, బారిలో వెనక్కీ ముందుకూ నడుస్తూ కపిల తోలసాగాడు.

కపిల బానలోనుంచీ దోనెలోకి కుమ్మరిల్లి కాలవగుండా మళ్ళకు పారుతున్న నీళ్ళను గమనిస్తూ గెనింపైన కూర్చోనున్నాడు బీశేరయ్య. చూస్తుండగానే తూర్పున తేనె రేగింది. ఆపైన తూర్పు కొండల్లోంచీ పొద్దు పొడుచుకొచ్చింది.

"చిన్నోడా, నువ్వు కపిల తోల్తావుండు. నేను బొయ్యి కోడెల్ని తోలకొస్తా. వాటికి కపిల నేర్పుదాం" కానగపుల్లతో పళ్ళు తోముకుంటూ వచ్చి అన్నాడు బీశేరయ్య.

"సరేన్నా. వచ్చేటప్పుడు చిన్న గడ్డపార, చేంతాడులు రెండు, జలువు బుర్రలు రెండు, నాలుగు గూటాలు పట్టకరా... మన దెగ్గిర లేకపోయినా ఆ కతారోళ్ళ యింట్లోనో ఏన్నో వాగసాట అడిగి తీసకరా" అన్నాడు కన్నయ్య.

కపిల నీళ్ళ కాలువలో నోరు, ముఖమూ కడుక్కొని, తలగుడ్డతో తేమ తుడుచుకుంటూ ఇంటి ముఖం పట్టాడు బీశేరయ్య.

"అన్న రావణ ఆలకింపుము విన్నవించెద నాయకా
చిత్రకూట అడవిలోన జరిగిన సంగతీ"

చెక్కభజనలో నేర్చుకున్న శూర్పణఖ వృత్తాంత గేయాన్ని ఆలపిస్తూ, కపిల తోలసాగాడు కనకయ్య.

ఇంటికి వెళ్ళిన బీశేరయ్య అరగంటలోనే కోడెలతో తిరిగొచ్చాడు. వాటిని అక్కడే వున్న ఒక చెట్టుకు కట్టివేసి వచ్చి, వచ్చేటప్పుడు మోసుకొచ్చిన చిన్న గునపంతో దొరువుపైన, తన్ను గూటాల పక్కగా గుంతలు తవ్వాడు. ఆ గుంతల్లో నడుములెత్తున్న చేతిలావు వెదురు గూటాలు నాటాడు. కపిల ఆపించి బారిలో ఆపక్కా, ఈ పక్కా రెండు గుంతలు తవ్వి అక్కడా గూటాలు నాటాడు. కన్నయ్య కపిలబానను దోనెలోకి లాగి పెట్టి, ఎద్దుల్ని విప్పి గట్టుపైన కట్టేసివచ్చాడు. అంతలోపల బీశేరయ్య కాడిమానుకున్న పలుపులకు జలువు బుర్రల్ని తొడిగాడు. పొడువాటి చేదతాళ్ళను తీసికొని జలువు బుర్రల్లో దూర్చి వాటిని గూటాలకు ఆ చివరా ఈ చివరా కట్టాడు. కనకయ్య కోడెల్ని విప్పుకొని వచ్చి బారిలో నిలబెట్టి వాటి అర్రులపైన కాడిమానుంచి పలుపులు, పట్టీలు బిగించాడు. బారికి ఇటువైపు, అటువైపునున్న తాళ్ళు జలువు బుర్రల్లోకి దూర్చి వుండడంవల్లా అవి జారుతూ కోడెలు బారిలో వెనక్కి ముందుకు సజావుగా కదిలే అవకాశాన్ని కలిగిస్తున్నాయి. తాళ్ళు గొడ్లు బారి వెలుపలికి పోకుండా వుండడానికి ఉపయుక్తమౌతున్నాయి. బీశేరయ్య బారిలో కోడెల ముందర నిలబడి కాడిమాను పట్టుకొని, అవి సక్రమంగా వెనక్కి ముందుకు కదలడానికి సహకరిస్తుంటే కనకయ్య మొదట వట్టి బానతోనే బారిలో రెండు మూడు సార్లు కోడెల్ని తిప్పి మెల్లమెల్లగా, బానలోకి కొద్దికొద్దిగా నీళ్ళు నింపుకొని కపిల తోలుతూ కోడెలకు కపిలమరుపుతున్నాడు. మొదట కొంతసేపు అవి అటూ

ఇటూ గింజుకున్నా క్రమంగా కపిలకు అల వాటు పడసాగాయి. కొద్దిరోజుల్లోనే అవీ కపిలకు అలవాటు పడిపోయాయి. అలాగే మడక దున్నడం, ఎద్దులబండి తోలడం వంటి పనులు కూడా వాటికి నేర్పించారు. కాలం సజావుగా సాగిపో తోంది.




పసితనంలో పసిడి విద్య

"ఆవలిడండమ్మో ఆవలిడండీ"

ఒకరోజు ఉదయాన ఆ ఊరి ఆవులు మేపే మాలకదిరప్ప, ఊతకర్ర భుజాన పెట్టుకొని వీధిలో అరుచుకుంటూ పోతు న్నాడు.

ఊర్లో రైతులు సేద్యం గొడ్లు తప్ప మిగి లిన ఆవుల్ని, దూడల్ని, తలుగులు విప్పి, వీధిలోకి తోలేశారు.

అప్పటికే ఆయన భార్య వలసమ్మ, ఆరో తరగతి చదువుతున్న కొడుకు శ్యామయ్య ఊరి ముందర గొడ్లను నిలేసుకోనున్నారు. ఆవులన్నీ అలవాటు ప్రకారం ఊరిముంద రున్న వంకలోకి చేరుకుంటున్నాయి. అన్ని గొడ్లు చేరింతర్వాత సుబ్బయ్య అన్నింటినీ అలాగే అడవివైపు తోలుకొని పోతే, భార్యా కొడుకు సంగటి గంపెత్తుకొని ఊరిమింద పడ్డారు.

ఆవుల్ని మేపినందుకు ఆవులున్న రైతులు సంవత్సరానికిచ్చే 'మేర' గాక రోజూ ఒక ముద్ద సంగటి, అంతకూర వాళ్ళకు వేయడం ఒక నియమం. బీశే రయ్య భార్య భాగ్యమ్మ ఇంట్లోవున్న రెండా వుల్ని తోలేసొచ్చి ఇంటి పనిలో మునిగిపో యింది. తోడికోడలు కనకమ్మ ఆమెకు సహకరిస్తోంది.

కోటయ్య సిక్కెం భుజాన వేసుకుని, ఊతకర్ర చేతబట్టుకొని గొర్రెల మంద దగ్గ రకు బయలుదేరాడు.

అప్పటికే కొందరు, మందలో చేర కుండా, ఇళ్ళ దగ్గరే దొడ్డికట్టి మేపుకుం టున్న గొర్రెల్ని, మేకల్ని మేతకు తోలుకు పోతున్నారు. ఆ జీవాలతో వీధి క్రిక్కిరిసి వుంది. వీధి పొడవునా వాటి పిచ్చికలు పడుతున్నాయి. ఆ వీధంతా గొర్రెల వాసన, అవి పోతుంటే రేగినదుమ్ము ఇళ్ళ లోకి గాలితోబాటు వ్యాపిస్తోంది.

ఇదేదీ పట్టనట్టుగా పెరట్లో గంగెద్దును పట్టుకొని, మేళం ఊదుతూ తర్ఫీదిస్తు న్నాడు బీశేరయ్య. తర్ఫీదు పూర్తయిన తర్వాత, దాన్ని పందిరి కింద కట్టివేసి, దాని ముందరంత పచ్చిగడ్డి పడేసి, దేశపు దూడను విప్పుకొని వచ్చి గంగెద్దు ఫీట్లను నేర్పడం మొదలెట్టాడు.

పనులన్నీ అయిపోయింతర్వాత ఆరు నెలలపాటు గంగెద్దుని చుట్టుపక్కల ఊర్లల్లో ఆడిస్తూ సంపాదించడం కూడా వాళ్ళ కులవృత్తిలో ఒక భాగం. అలా దేశంపైన ఎద్దు ప్రదర్శనకు బయలుదేరడా నికి యింకా రెండు మాసాలుంది. అంత లోపల, పరసలో పట్టుకొచ్చిన ఆ దూడను కూడా మంచి గంగెద్దుగా తీర్చిదిద్దాలని అతని తాపత్రయం... దానికోసం ప్రత్యే కంగా మేత, పందిరి కింద తావు ఏర్పాటు చేశాడు.

"నాయనా... మేళం నా దెగ్గిరియ్యి... నేను ఊదతా... నువ్వు దూడకు నేర్పిం చేవి నేర్పించు" అంటూ అప్పుడే అక్కడికి వచ్చాడు బీశేరయ్య కొడుకు పన్నెండేళ్ళ

మునస్వామి.

ఆ మాటతో సన్నాయి ఆతనికిచ్చాడు బీశేరయ్య. పట్టుకొచ్చి వారం రోజులై వుండడంతో దూడ బీశేరయ్యకు బాగా అల వాటుపడింది.

బీశేరయ్య కాళ్లు వెనక్కి మడచి, మడిమె లపైన కూర్చొని, దూడ గంగడోలును నిమురుతూ.... 'ఒరేలచ్చుమన్నా... అద్దో ఆడుండేది నీ అన్న. దాని పేరు రాముడు. నీ పేరు లచ్చుమన్నా. మీరి ద్దరూ అన్నదమ్ములన్నమాట. వొరే లచ్చు మన్నా. యిప్పుడు నువ్వు నేను చెప్పినట్టు వింటున్నావు. రా... నా తొడలపైన నీ కాళ్ళు పెట్టు రా..." మెల్లగా దాని పొట్ట కింద వేళ్ళతో నిమురుతూ రాగయుక్తంగా అంటూ దాన్ని మచ్చిక చేస్తున్నాడు. బీశే రయ్య వేళ్ళ స్పర్శకు దూడ గాలి బిగబట్టి పొట్ట ఉగ్గబట్టసాగింది. మునస్వామి వాయిస్తున్న సన్నాయిలోని పాట దానికి అర్థం అవుతున్నట్టే అనిపించింది.

బీశేరయ్య వేళ్ళ స్పర్శ, ఆప్యాయత, సన్నాయిలోని పాట దానికి సగిచ్చినట్టు అనిపించి తన్మయత్వంగా బీశేరయ్య చెప్పి నట్టే వినసాగింది.

దూడ రెండు కాళ్ళను ఆతని తొడపైన పెట్టింది. ఆ తర్వాత నాలుగు కాళ్ళు పెట్టింది.

"పెళ్లి వారమండీ. మగపెళ్లి వార మండి" అంటూ మునస్వామి సన్నాయిలో పాట వాయిస్తుంటే, బీశేరయ్య దాని చెవులు పట్టుకొని ఊపుతూ "లచ్చుమన్నా పాట విను... తల ఊపు" అంటున్నాడు.

అలా అన్ని ఫీట్లు నేర్పించసాగాడు.

చివరన "బంగారు దూడ. చెప్పినట్టు యింటావుంది. ఇదీ పెద్దదయితే నా తమ్ముడికి సరిపోతుంది" అనుకుంటూ లేచి వెళ్లి దూడను పందిరి కింద కట్టేసి వచ్చి రాత్రి గంగెద్దుల కోసం ప్రత్యేకంగా నానబెట్టి రోట్లోవేసి నూరి బకెట్టులో పెట్టు

## కొత్తగాలి...

**హంసలా బతకాలి**
**పాలనుండి నీటిని వేరుచేస్తూ**
**సమాజాన్నుంచి**
**హింసను వేరుచేస్తూ**

—అనూరాధరామకృష్ణ, నెల్లూరు

కొనున్న ఉలవపాలు తెచ్చి, రెండు దబ రాల్లో పోసి, వాటిపైన అంతనున్నటి వరి పొట్టు చల్లి వాటిముందు పెట్టాడు బీశే రయ్య.

అవి ఆబగా ఉలవపాలను నోటితో పీల్చుకుని చప్పరిస్తూ మింగుతున్నాయి.

"గంగెద్దులంటే ఎట్టుండాల. నూరు గొడ్లల్లో తోలినా, యిది గంగెద్దు అని గుర్తు పట్టేట్టుగా వుండాల. వళ్ళు కండలు తిరిగుండాల. గోపురం మూరెడెత్తు బలి సిండాల..." అనుకుంటూ దూడ గోపు రాన్ని రెండు చేతులతో సుతారంగా మర్ధిం చసాగాడు. అలా చేస్తే దాని గోపురం బాగా పెరుగుతుందని అతని నమ్మకం.

దబరాలో ఉలవపాలను సగం పీల్చి పైకి చూసింది దూడ.

అది లేగదూడ. చూడముచ్చటగా వుంది. ఆలనా పాలనా బాగుండడంతో దాని శరీరం కాస్తా తేటబడుతోంది.

బీశేరయ్య వంగిదాని ముఖంపైన ముద్దు పెట్టుకొని "తినరా లచ్చుమన్నా, తిను. నా వరాల కొండా తిను. తిని యిప్పటినుంచే అన్ని విద్దెలు నేర్చుకో. నువ్వు గొప్ప గంగెద్దు కావాల. ఊరూర తిరిగి గొప్ప ఎద్దు అని పేరు తెచ్చుకో వాల"

తన బిడ్డకు బుద్ధి మాటలు చెబుతు

న్నట్టు చెబుతూ, దాని వీపుని ఆప్యా యంగా స్పృశిస్తూ నిలబడ్డాడు... అది దబరాలో మూతి పెట్టడం కూడా మరిచి పోయి ఆరాధనగా ఆతని ముఖంలోకే చూస్తూండి పోయింది.




## ఎత్తలేని ఎరువుల బండి

బీశేరయ్య బాయి అప్పటికే అడుగంటింది.

ఆతనికున్నది ముక్కాలెకరా మడి. రెండు ఎకరాల మెట్టచేను. మెట్టచేన్లో వేరు సెనగ వేశాడు. కానీ ముక్కాలెకరా మడిలో అర్దెకరా బుచ్చిరెడ్డి పాళెం వడ్లు సగం, పిచ్చొడ్లు సగం నాటుకున్నాడు. మిగిలిన రెండు గుంటల్లో మిరపతోట నాటాడు. అది పూతిడుస్తూవుంది. వరి మడి పొట్ట కర్రపైనుంది. ఇంకా ఎలా లేదన్నా నెలపైనే నీళ్ళు పారాల. కానీ అప్పుడే బావిలో నీళ్ళు అయిపోతున్నాయి.

"ఇప్పుడట్ల వాగ పదును వాన బడితే సాలు. పంటెల్లి పోతుంది. వాన బడక పోతే సంసారం గతెట్లా? " అని రోజూ ఆలోచిస్తూనే వున్నాడు బీశేరయ్య.

ఆ రోజూ అదే ఆలోచిస్తూ మడి గెనింలో పెరిగిన గరిక కోసుకుంటు న్నాడు.

"ఏమయ్యా గంగెద్దలాయనా. ఎట్టుండావు? " అన్నమాట వినిపించి తల పైకెత్తి చూశాడు.

ఆలోచనల్లో పడి తను గమనించలేదు గానీ దళాలకాడు చిన్నబ్బ బారెడు పొడవున్న కోలకట్టె చేతబట్టుకుని గెనిమింటే వచ్చి పలుకరించాడు. తలకు, భుజాన టర్కిష్ టవల్, మడత పెట్టి తోమించిన తెల్లచొక్కా, తెల్లటి లుంగీ, చేతివాచీ, వేలికి ఉంగరం... జబర్దస్తీగా వున్నాడు మనిషి.

"ఏమిట్లొస్తివి సిన్నబ్బా" కోసిన గడ్డిని తట్టకువేస్తూ పలుకరించాడు బీశేరయ్య.

"చూద్దామనే వస్తి, అదిసరే. మనం పుంగనూరు పరసలో పట్టుకొచ్చిన దేశపు దూడ ఎట్టుందబ్బా" గెనింపైన నిలబడి అన్నాడు.

"బాగానే వుండాది గానీ నువ్వేమి యిట్టొస్తివి" గడ్డి తట్టను నెత్తికెత్తి పెట్టు కుంటూ అడిగాడు బీశేరయ్య.

"నిన్నొగసూరి సూసి పోదామనే వస్తి"

"అంతా వట్టిమాట. ఈడేడన్నా ఎద్దల బేరం తగిలుంటుంది. అందుకే వచ్చింటావు..." గెనింపైన నడుస్తూ అన్నాడు.

"నీ దెగ్గిర దాపరికమేముంది గానీ మీ ఊర్లోనే మేజారోళ్ళింట్లో ఎడ్ల బేరం వుంది. వాళ్ళు అమ్మి పెట్టమన్నారు. పులిసెర్లలో వొగాయనడిగినాడు. ఆ విషయం చెబుదామనే యలబారినా"

యిద్దరూ మాట్లాడుకుంటూ మడికయ్యలు దాటుకొని కటవల మార్గాన ఊరివైపు నడవసాగారు...

అక్కడ బీశేరయ్య శెనగచేన్లో ఊరి దేవరెద్దు మేస్తూ కనిపించింది. అది చూసి గబగబ గడ్డి తట్టదించి, వెళ్ళి "సామీ.. మేము పేదోళ్ళం. నా భూమిలో భోంచేసింది సాలు. యింకపో సామి" అంటూ చేతులు జోడించి వేడుకున్నాడు.

ఆతని అభ్యర్థన అర్థమైనట్లు మోకాళ్ళ వరకు కనిపిస్తున్న కొమ్ముల్ని పైకెత్తి ఆతన్ని చూసి దూరంగా వెళ్ళిపోయింది దేవరెద్దు.

"నీ మాటలు అర్థమైనట్లే వెళ్ళిపోయింది ఎద్దు" అన్నాడు చిన్నబ్బ.

"అవునయ్యా, అది మా ఊరి వేలుపు... అది చేన్లపైన బడి మేస్తావుంటాది. ఎవరూ ఏమీ అనరు..." అని మళ్ళీ తట్ట నెత్తుకొని ఊరివైపు రెండడుగులు వేశాడు. కొంతదూరంలో వున్న బండి బాటలో ఎవరో ఎద్దుల బండి తోలుకొని వస్తున్నారు. నొగలపైన కూర్చొని వున్న వ్యక్తి "హేయ్... పదా నడు" అంటూ అరుస్తూ బండి తోలుతున్నాడు. దూరం నుంచీ ఆ బండిని చూసిన బీశేరయ్య ఆ ఎద్దుల్ని, మనిషిని గుర్తు పట్టాడు.

"య్యోవ్ సామీ! బండి తోలుకోనొస్తా వుండేది పేరావాండ్లపల్లెలో గంగచంద్ర గదా"

"అవునయ్యా, పుంగనూరు పరసలో నీ దూడతో బాటుగా పట్టిచ్చిన ఎద్దులే గదా అవీ. పోదాం పదా పలుకరిద్దాం"

ఇద్దరూ పోతున్న పల్లెదార్లో గాకుండా అటువైపు నడిచారు.

వాళ్లు చూస్తుండంగానే బండి ఆగిపోయింది. గంగచంద్ర అరుస్తూనే "పద పదా" అంటూ చేతనున్న జాటీతో ఎద్దుల్ని కొడుతున్నాడు. అయినా అవి కదల్లేదు. బండిలో వున్న కోలకట్టె తీసుకొని బాదాడు. రక్తం కారేటట్లుగా వాటి ముడ్లను పొడిచాడు. అయినా అవి కదల్లేదు. పైగా ఆ దెబ్బలకు తట్టుకోలేక వల పటెద్దు మొండికేసుకొని నేలపైన పడుకున్నది.

"ఎద్దు అణికేసుకునింది. బిన్నే పదాం పద" అంటూ వేగంగా నడుస్తూ, అక్కడికి చేరుకున్నారు బీశేరయ్య, చిన్నబ్బ.

"ఆఁ... రాసామీ... రా... నువ్వు పట్టిచ్చిన ఎద్దులే సామే యివీ. సూపులకు ఎంత సింగారంగా వుండాయో పనికి అంత దొంగగా వుండాయి. ఇది తప్పిస్తే అది అణికె (మొండికి) యేసుకుంటుంది.

# ద్విపాత్రాభినయం



**డాక్టర్ వి.ఆర్.రాసాని**

తిరుపతి ఎస్వీ ఆర్ట్స్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడిగా పనిచేస్తున్న నేను ఇటు కథకుడిగా, అటు నటుడిగా కూడా ద్విపాత్రాభినయం చేస్తున్నాను. తెలుగు సాహిత్యమంటే మక్కువ ఎక్కువ. ఇప్పటికి 14 పుస్తకాలు ప్రచురణకు నోచుకున్నాయి. వాటిలో మూడు నాటికలు, రెండు నాటకాలు, అయిదు నవలలు, రెండు పరిశోధనాగ్రంథాలున్నాయి. ఎనిమిది కథావార్షికలకు సంపాదకత్వ బాధ్యతలను నిర్వర్తించాను. కాగా, 100పైగా కథలు, 400 వ్యాసాలు, గేయాలు, కవితలు వివిధపత్రికల్లో వచ్చాయి. ఆకాశవాణిద్వారా, దూరదర్శన్‌లో కొన్ని నాటకాలు వచ్చాయి. కొన్ని నవలలు, కథలు ఇతర భాషల్లోకి అనువాదమయ్యాయి. గతంలో 'చతుర'లో వచ్చిన 'ముద్ర' నవల 'జోగితె' పేరుతో, 'విపుల'లో వచ్చిన 'పయనం' కథ 'పయన' పేరుతో కన్నడంలోకి అనువాదమయ్యాయి. చిత్తూరు జిల్లాలోని ఓ కుగ్రామంలో జన్మించిన నేను పరిశోధన చేసే విద్యార్థులకు వృత్తిరీత్యా గైడ్‌గా వ్యవహరిస్తున్నాను.

**చిరునామా:**
డాక్టర్ వి.ఆర్. రాసాని
ఇంటి నెం:16-ఇ/17, బాలాజీ రెసిడెన్సీ,
మునిరెడ్డినగర్, తిరుపతి వెస్ట్-2
సెల్: 9848443610

## కొత్తగాలి...

**చెమటోడ్చేది**
**రైతొక్కడేనా?**
**ఆకాశం కూడా**
**అవని ఆకలి తీర్చడానికి**

*-కన్నెగంటి అనసూయ, హైదరాబాద్*

అది తప్పిస్తే యిదేసుకుంటుంది. యాగ లేక సస్తావుండాను. వీటిని కోసి బండ కెయ్యా" నిష్ఠూరంగా అన్నాడు వాళ్లను చూస్తూనే గంగచంద్ర.

"దానికి నేనేం జేసేదిరా. నీకు నచ్చినా యన్నావు. బేరం కుదిర్చినా అంతే. అంత కుమించి నేనేమన్నా కలగన్నానా..." అన్నాడు చిన్నబ్బ.

"నా అదృష్టం అట్టుంటే నువ్వేం జేస్తావులే" అంటూ పడుకున్న ఎద్దు వీపున పిడికిలితో గుద్ది "నిన్ను నక్కలకియ్య, లెయ్యే" అన్నాడు.

అది కదల్లేదు.

డొక్కలో తన్నాడు.

అది కదల్లేదు.

చేతనున్న కోలకట్టెతో వీపంతా పొడిచాడు.

అది లేవలేదు.

అతను పొడిచినచోట రక్తం మరకలు కనిపించసాగాయి.

కోలకట్టెతో వీపు వాయగొట్టాడు. ఆ దెబ్బలకు వాతలు వేసి రక్తం కమ్మిందేగానీ అది మెదల్లేదు.

కొట్టేకొద్దీ... క్రొర్ క్రొర్‌మంటూ తన బాధను వ్యక్తం చేసిందేగానీ ప్రతి చర్య చూపలేదు.

అది గమనించిన బీశేరయ్యా "దుడ్డు పెట్టి కొనుక్కొచ్చిన గొడ్లను కొట్టద్దయ్యా" అని నెత్తినున్న గడ్డి తట్టను దించి పక్కన బెట్టి వచ్చి దాని మెడపైనున్న కాడిమాను పలుపు విప్పి, తాడుతో లాగి 'లెయ్యి. లెయ్యి' అన్నాడు.

దాంతో అది పైకి లేచి, హుషారుగా లేచి, గడ్డితట్టవైపు పోయి నోటితో పిడికెడు గడ్డిని కరచుకుంది. "నీ పాసుల గోల. గొడ్డుకు కడుపునిండా గడ్డేస్తే బాగా పనిచేస్తుంది. సూడు ఎంత ఆత్రంగా గడ్డి తింటా వుందో... ఈసారి కట్టతో వేయ్" అంటూ పగ్గం పట్టిచ్చాడు.

"ఇట్ల ఎన్నిసార్లు చేసినాన్నా.... ఇవి దొంగ గొడ్లు. బాగా దొంగ మరిగిపోయిండాయి. అణికేసుకోని పడున్నాయంటే కొట్టినా లెయ్యవు. కోసినా లెయ్యవు. గెడ్డి తినేదానికి మాత్రం ఏం రోగంలా"

తిట్టుకుంటూ నేలపైన పడివున్న కాడిమాను కొసను ఎత్తి నిలబడి ఎద్దును మళ్లీ పూన్చి, కాడిమాను దాని అర్రుపైన పెట్టి పలుపు బిగించి, వంగి కుడిపక్కనుంచీ పోయి ఎగిరి నొగలనైన కూర్చొని అదిలించాడు. ఈసారి ఎద్దులు హుషారుగా ముందుకు కదిలాయి.

బీశేరయ్య తట్టనెత్తుకొని బండి వెంటన డిచాడు.

"మడికి ఎరువు తోల్తా వుండాన్నా, ఏం చేసేది. వట్టిబండికి బాగానే పోతాయి. బరువు బండంటే అణికేసుకుంటాయి. ముండగొడ్లు ఏం జేసేది? ఊర్లో బగిశీనంగా వుండాదన్నా" చెబుతూనే బండి తోలుతున్నాడు.

బండివైపు చూశాడు చిన్నబ్బ.

బండిలో వున్న దొల్లనిండా ఎరువుంది.

"దొల్లనిండా పోసినావే. అవి లాగలేనప్పుడు... యింకొంచెం ఎరువు తక్కువేస్తే ఏమయ్యా ...? " అన్నాడు.

"యిదెంతన్నా... పది తట్టలు... సగం దొల్లకేసినా... అంతే"

అలా కొంతదూరం నడిచారో లేదో

కాస్తా మిట్టొచ్చింది. ఈసారి దాపటెద్దు లాగలేనట్లు మోరవంచేసి అలాగే నిలబడి పోయింది. చిన్నబ్బ పరిస్థితిని అర్థం చేసుకుని గబగబా రెండు రాళ్లు తీసుకొచ్చి చక్రాల కిందవేశాడు. పల్లానికి వెనక్కిపోకుండా జాగ్రత్త పడ్డాడు చిన్నబ్బ.

"తుc... దీనెమ్మా... యాగలేక సస్తా వుండానయ్యా సామి" అంటూ దానితో కనుమెలికలు తిప్పుతూ కోలకట్టెతో రెండిగ్గాడు. దాంతో అది వణుకుతూ నేలపైన పడుకుంది... కోలకట్టెతో పొడిచి, కొట్టి నానా రబస చేశాడు. అయినా అది లెయ్యలేదు. కిందికి దిగి దాని తోకను పళ్ల మధ్యన వేసి కొరికాడు. కానీ అది కదల్లేదు. ఇట్లా కాదని జేబులో పొట్లం కట్టి తెచ్చుకున్న కారం పొడిని తీసి దానికంట్లో చల్లాడు.

మంటకు అది అంబా అని అరిచిందే గానీ పైకి లెయ్యలేదు. గంగచంద్రకు కోపం ఉబ్బికెక్కింది. బీపీ పెరిగిపోయింది.

"నీ పాపంగాలా. కండ్లు పోతాయయ్యా దానికి. ఊరికే వుండు" అన్నాడు బీశేరయ్య.

"దాన్నట్లా హింస పెట్టొద్దులేవయ్యా. నేను కావాలంటే అమ్మి పెట్టి వేరేటిని కొనిస్తాగానీ" అనునయంగా అన్నాడు చిన్నబ్బ.

"ఆc... నువ్వు అమ్మిస్తావులే... ఎందుకియ్యవు. నీకు కమిసనొస్తుంది గదా" దెబ్బతిన్న పాములా కస్సుమన్నాడు.

దాంతో నోరు మూసుకున్నాడు చిన్నబ్బ.

"దీనెమ్మ దీన్నిట్లా గాదు" అని అటూ ఇటూ చూశాడు. పక్కనే ఒక గెనింపైన ఏపుగా పెరిగి పండిపోయివున్న పొరక ఊసలు అతని కంట పడ్డాయి. గబగబా వెళ్లి ఆ ఊసల్లోనుంచీ, దప్పనం లావుతో వున్న మూరెడు పొడవు ఈనపుల్లనొకదాన్ని విరచి శుభ్రంగా దాని ఆకులు తీసేసి తెచ్చి 'నీయమ్మ. లెయ్యవా...' అంటూ ఆ పుల్లని ఆసనంలోకి దూర్చి గుచ్చాడు.

బీశేరయ్య అరుస్తూనే వున్నాడు.

చిన్నబ్బ నిచ్చలకపోయి చూస్తున్నాడు. ఆవేళ అతనికి గంగచంద్ర ఎర్రటోపీ వేసుకున్న పోలీసులా అనిపించాడు.

ఆ బాధను భరించలేక గబుక్కున పైకి లేచింది ఎద్దు.

"నీయమ్మా మాయదారి గొడ్డు. అట్టారా దారికి" విజయగర్వంతో పైకిలేచి "య్యోవ్... ఈ మొండి గొడ్లు ఏ మొండి తురకోన్నికైనా సరే, ఇచ్చేద్దాంగానీ... బేరం సూడు. కొత్తవి కొందాం"

నొగలపైన ఎగిరి కూర్చొని అదిలిస్తూ బండిని ముందుకు దూకించాడు.




## కాలించిన కొంతేగాలం కొడుకు

**తో**డికోడళ్లిద్దరూ రోట్లో సజ్జలు పోసి దంచి, తవుడు చెరిగి, నూకలు ఎసట్లో పోసింతర్వాత భాగ్యమ్మ మజ్జిగ కొయ్యకు కవ్వం తగిలించి ఒక కడవలో పెరుగు పోసి, సర్రుసర్రున చిలుకతోంది.

కనకయ్య అప్పటికే బాయికాడ పని చూసుకుని వచ్చి సగం ఉడికిన సజ్జ అంబలి ఒక అబక గిన్నెలోకి తోడుకొని అందులో అన్ని మజ్జిగ పోసుకుని ఉప్పు వేసి కలిపి తాగుతున్నాడు.

కొట్టంలో గోడ కొమ్ముకు తగిలించి వున్న చిన్న సన్నాయిని తీసుకుని 'పీపీ' అని పీకను నోటితో ఊది, సన్నాయికి అమర్చి మేళం ఊదుతూ కూర్చున్నాడు బీశేరయ్య పెద్ద కొడుకు మునస్వామి.

బీశేరయ్య గంగెద్దుకు నానబెట్టిన సెనగ పిండి పిట్టు తినిపిస్తూ పెరట్లో కూర్చోను న్నాడు...

రాత్రంతా మంద కావలి కాసి ఇంటి కొస్తూ వస్తూ, కాలిరిగిన ఒక గొర్రెను మెడపైన వేసుకుని ముందర కాళ్లు పట్టు కొని మోసుకుంటూ వచ్చి కొట్టంలో దించి 'బీశేర మామా" అంటూ అరిచాడు నుసక డు.

'ఎవరూ' అంటూ అక్కడినుంచే అరి చాడు బీశేరయ్య.

"నేను మామ నుసకయ్యని"

"ఏమిరా నుసకా? "

పిట్టున్న డాక్షాను అలాగే ఎద్దుముందర వదిలేసి లేచి వచ్చి "ఏమైందిరా" అన్నాడు గొర్రెను చూస్తూ...

"మొన్న కంపల్లెదెగ్గిర మందతోలింటిమి. శంకర్రెడ్డోళ్ల రాగి మడిలో పడిందంట. రాల్లో ఏసినట్టుండారు. కాలిరిగింది. మామ తేలేక అగసాట్లు పడతావుంటే నేనే మోసుకొస్తి"

అసలు విషయం చెప్పి తన యింటికి వెళ్లిపోయాడు నుసకడు.

విరిగిన కాలుని పైకెత్తుకొని బే...బే అని అరుస్తున్న గొర్రెమెడను ఒక చేత్తో పట్టుకొని, మరో చేత్తో కాలు పరిశీలిస్తూ "గొర్రె కాలిరిచేదానికి వాళ్లకెట్ల మనసొప్పింది నాకొడుకులకు" తిట్టసాగాడు బీశే రయ్య.

విరిగిన కాలు లోపలి ఎముక రెండుగా చీలిన ట్టుంది. అటు ఇటు కదు ల్తోంది.

"ఇట్టయితే యింక గొర్రెలు మేపినట్టే" కంబడి భుజాన వేసుకుని రొప్పుతూ వచ్చి గోడకాను కొని కూలబడ్డాడు కోటయ్య.

"కాలు రెండుగా యిరిగి నట్టుండాది నాయినా" గొర్రెను వదిలేసి పైకి లేస్తూ అన్నాడు బీశే రయ్య.

"గొర్లోళ్లను జూస్తే అందరికీ అదవే (చులకనే). మడిగెనింమీద మేస్త్రా రాగి కర్రల్లో అట్ట మూతి పెట్టిందో లేదో కొంపలు మునిగిపోయినట్టు వచ్చి రాళ్లతో బీరిబీరి యేసినాడు నాకొడుకు. అన్నే యంగా కాలిరగ్గొట్టినాడు. వాడేమి రామ రామంటా నూరేండ్లేమైనా రాజ్జిమేలు తాడా? "

తిట్టుకుంటూ, కంబడిలో దాచుకొని వచ్చిన బందారాకును తీసి నేలపైన పెట్టాడు కోటయ్య.

"ఎవుర్నాయనా గొర్రె కాలిరగేసిందీ? "

## సినిం్రతీ చతురోక్తులు

ఈనెల చతురోక్తులలో భాగంగా చిన్నారులకు సంబంధించిన హాస్యగుళికలు కొన్ని...

### అమ్మ మింగేసింది

తమ ఇంట్లోకి కొత్తగా అడుగుపెట్టబోయే చిట్టి చెల్లెలు లేదా తమ్ముడి గురించి బుజ్జి తమ ఎల్ కేజీ టీచర్‌తో చాలారోజులుగా చెబుతోంది. ఓ రోజు కడుపులో ఉన్న పాప కదలికల్ని గ్రహించేలా తల్లి బుజ్జిని ఒడిలో పడుకోబెట్టుకుని కడుపుకు తల, చేతులు ఆనించి చూపించింది. ఆ తర్వాత నుంచి తమ టీచర్‌తో దానిగురించి బుజ్జి మాట్లాడటం మానేసింది. విషయం ఏంటని టీచర్ అడిగింది. 'ఆ కొత్తపాపని మా అమ్మ కడుపులోకి మింగేసింది' అంది బుజ్జి అమాయకంగా.



"యింకెవురు? వోడే శంకరెడ్డి కొడుకు. కేశవరెడ్డి"

"వాళ్ల గొడ్లనేమైనా అంటే ఊరికే వుందురా నా కొడుకులు. మొన్న వాళ్ల దేవరదున్న మన చేన్లో బడి మేస్తావు న్నింది.

ఒగ మంటి పెళ్లదీసి అదిలిస్తా దాని పైన యేసినా. ఆ మాత్రానికే నామీద కొట్లాడకొచ్చినాడు. అట్టాంటోడు మన గొర్రె నెట్లయిరగేశ"

"అంతేరా నాయనా. వున్నోడు ఏంజేసినా చెల్లుబాటయిపోతుందని వాళ్ల ధీమా... సరేగానీ రెండు ఎదురు దబ్బలుంటే సూడు. కట్టు కడదాం..."

బందారాకును మట్టసంగా పెట్టి కొడవలి తీసుకొని వచ్చి ఎముకల తుండుపైనపెట్టి ఒక అడుగు పొడవుతో... కొసలు కత్తిరించి సిద్ధం చేశాడు. అంతే పొడవుతో కొన్ని ఎదురుదబ్బలు చీల్చి తీసుకువచ్చాడు బీశేరయ్య. ఇద్దరూ కలిసి విరిగిన గొర్రె కాలు చుట్టూ బందారాకు పేర్చి దబ్బలేసి, సన్నని నులకదారంతో బాగా బిగించి కట్టు కట్టారు.

"ఇంక వారందినాలు యింటి దెగ్గిరే మేపండి. బాగయిపోతుంది" గొర్రెను వదిలేసి అన్నాడు కోటయ్య.

"ఊర్లో వాళ్లేంజేసినా అడిగేవోళ్లు లేరని ఇట్లా మిడిమేళంగా తెగబడతావుండారు నాకొడుకులు.. తు..." అనుకుంటూ మళ్లీ పెరట్లోకి వెళ్లపోయాడు బీశేరయ్య.

కట్టు కట్టిన గొర్రె అరుస్తూ కుంటికాలు ఎగేసుకుంటూ పెరట్లోకి నడిచింది.

అంతవరకూ మేళం వాయించడం అభ్యాసం చేస్తున్న మునస్వామి తిరిగి సన్నాయి ఊదడంలో మునిగిపోయాడు.

గొర్రె కాలు విరగ్గొట్టింది కేశవరెడ్డేనన్న నిజం తెలుసుకున్న కనకయ్య వీధిలోకొచ్చి, లుంగీ ఎగచెక్కి తిట్లదండకం మొదలు పెట్టాడు.

వీధిలో బండపైన కూర్చొని కొడుకుతో కబుర్లాడుతున్న శంకరరెడ్డి గుండె మండిపోయింది. ఆ మాటలు యిక వినలేక బండపైనుంచీ పైకిలేచి, తుండుగుడ్డను విదిలించి భుజాన వేసుకుని కోపంతో పళ్ళు కొరుకుతూ అతన్నే చూస్తూండిపోయాడు శంకరరెడ్డి కొడుకు కేశవరెడ్డి.




## గొడ్లు మేపేచోట
## దొడ్లు తోసే గుణం

"అమ్మణ్ణీ! అన్నమైందా?"

అప్పుడే యింట్లోకి అడుగుపెట్టిన కనకయ్య చెల్లెలు నరసమ్మనడిగాడు.

"ఇప్పుడే అయింది. యేమన్నా?"

ఉడికిన అలసంద గింజల పులుసులో తిరగమోత పెడుతూ చెప్పింది నరసమ్మ.

"గొడ్లను మేతకు పట్టకపోవాలగదా" నట్టింట్లోకొస్తూ అడిగాడు కనకయ్య.

"వొగ్గెడి వుండు. యిప్పుడే తిరగమోత పెడతాండ. కూర కళాపెళా ఉడికితే సాలు. దించేస్తా".

"మీ వదినేదీ..."

"పెరళ్ళోకి పోయినట్టుండాది".

"సరే. కోడెదూడల్ను నేను పట్టకపోతా గానీ, సేద్దెపు గొడ్లను మీ వదిన్ను పట్టుకోని సేన్లకల్లా తిప్పుకోని రమ్మను. అన్న, గంగెద్దును, దేశిపు దూడను సూకుంటాడు.

నువ్వు అంత తినేసి కాలిరిగిండే గొర్రెను అట్ల సేనికల్లా తిప్పకరా... ఇంగ రెండు దినాలట్ల మేపితే... కాలు కట్టుకుంటుంది" అని మళ్ళీ వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఆతనలా వెళ్ళగానే కోటయ్య, బీశేరయ్య యిద్దరూ యింటిముందరికొచ్చారు. కనకమ్మ అప్పుడే పెరడులోనుంచీ వచ్చి, గొడ్ల కొట్టంలోకి వెళ్ళింది.

"ఏమిరా పెద్దోడా. ఈ బిడ్డె సక్కంగా సెక్కబొమ్మ మాదిరుండాది. సుక్కల్లో సందమామ మాదిరుండాదని సిన్నోడికిచ్చి చేస్తిమి. యీ బిడ్డె ఏం పాపం చేసిందని పిల్లోళ్ళ అచ్చటా ముచ్చటా నోసుకోలా" గోడపైనున్న టైరు చెప్పుల్ని తీసి నేలపై నేసి తొడుక్కుంటూ అన్నాడు కోటయ్య.

"ఆయమ్మి కడుపులోను వొాగ కాయ కాస్తే సరిపోవును. అయినా వొయిసు అప్పుడే ఏమైపోయిండాదిలే. పుడతారు గానీ..." అన్నాడు బీశేరయ్య.

"ఇప్పటికి నాలుగేండ్లయిపాయ పెండ్లయ్యి. ఊర్లో అందరూ గొడ్రాలు, గొడ్రాలు అంటా వుండారు. యినలేకపోతా వుండా".

"సరే, నువ్వుపదా. గొర్రెలమంద యల్డోలి శ్యానాసేపయింది. రాముడోళ్ళ నాయనకు చెప్పినా... మా నాయన కొంచెం ఆలస్యంగా వస్తాడని. ఆయన ఏంజేసినాడో ఏమొ".

"నేను గూడా చెప్పినాలే. మనవి గూడా మల్లేసుకోని వుంటాడుగానీ..." కొట్టం సందులోకి వెళ్ళి దుడ్డుకర్ర తీసుకొని వచ్చాడు.

బీశేరయ్య పందిరివైపు నడిచి, ఉదయాన కోసుకొచ్చిన పచ్చి గడ్డిని తీసి గంగెద్దు, దేశిపుదూడ ముందర వేసివచ్చాడు.

చిక్కెం సంకన బెట్టుకొని, దుడ్డుకర్రను ఊతపొడుచుకుంటూ కోటయ్య గొర్రెలకాడికి బయలుదేరాడు.

కనకమ్మ కొట్టంలో నుంచీ సేద్యపు గొడ్ల పగ్గాలు విప్పుకొని వీధిలోకొస్తూ "అమ్మణ్ణీ. నరసా... నేను ఎద్దుల్ని తోలుకోనిపోతా వుండా. మీయన్నను కోడెల్ని తోలుకొని పొమ్మను" అని అరిసి చెప్పింది.

"అట్లే వదినా" ఇంట్లో నుంచీ సమాధానం చెప్పింది నరసమ్మ. కనకమ్మ ఎద్దుల్ని పట్టుకొని వీధిలోకొచ్చేసరికి కఠారి రాముడు తన ఎద్దుల్ని విప్పుకొని ఊరి ముందరికొచ్చాడు.

"ఏమమ్మా. యీరోజు ఎక్కడపోతావు ఎద్దుల్ని తోలుకొని" నవ్వుతూ పలుకరించాడు.

"అయ్యో... అన్నీ చెప్పాలేమొ మొగోనికి" రుసరుసలాడుతూ ఎద్దుల్ని అదిలిస్తూ ముందుకు వెళ్ళింది.

"నేను నెట్టుబండకల్లా పోతావుండా" ఆమె వెంట ఎద్దుల్ని పోనిస్తూ అన్నాడు.

"ఆс... అడివిలోకెందుకో" ముసిముసిగా నవ్వుతూ అడిగింది. "అడవిగదా. అక్కడైతే ఎవ్వరూ వుండరనీ..." నర్మగర్భితంగా అన్నాడు రాముడు.

"ఓయబ్బో... భలే తెలివే నీకు"

ఇద్దరి గొడ్లు నెట్టుబండవైపున్న చేన్లవైపు వేగంగా నడవసాగాయి.

ఆ సమయంలోనే కనకయ్య అన్నంతిని కోడెల్ని విప్పుకొని పొలాలవైపు బయలుదేరాడు.

అయితే పెద్ద కోడె తల వంచుకొని నడవసాగింది. వళ్ళంతా మబ్బేసుకొనివుంది. తాడులాగితే చాలు. 'ఆс...' అని నాలుక సాపుతోంది.

ఏమైందో ఆతనికి అర్థం కాలేదు. ఊరి ముందర నిలబెట్టి దాని గోపురాన్ని చేత్తో నొక్కాడు. అది విలవిలలాడింది.

"దీనికి మెడలు పడినట్టుంది.

సాయంత్రం నెటికె తీయాల్సిందే" అను కుంటూ మెల్లగా తోలుకొని వెళ్ళాడు.

తమ చేన్ల గెనాలలో, బావుల గడ్డలపై మేపుకుంటూ, మధ్యలో పెద్ద చెరువులో నీళ్లు తాపుకొని ఇంటికొచ్చేసరికి సాయంత్రం నాలుగైంది కనకయ్యకు.

పెద్ద కోడె సరిగానే మేయలేదు. దాని డొక్కలు లోతుగానే ఉన్నాయి. జతకోడె మాత్రం బాగా మేసి ఉండడం వల్లా దాని డొక్కలు పైకి లేచి ఉన్నాయి.

కోడెల్ని కొట్టంలో కట్టేసి వీధిలోకొచ్చాడు.

గూకా చెంగడు తమ ఇండ్లవైపు నడుస్తూ కనిపించాడు.

అతనికి పశువులకు సంబంధించిన బాధలు, వ్యాధులు బాగా తెలుసు. అప్పుడప్పుడూ వాటికి మందులు కూడా యిస్తంటాడు.

"వారే గూకా, యేం పనిమిందుండావురా" అడిగాడు కనకయ్య.

"ఏమీలేదబ్బా" ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

"సరేగానీ... మా పెద్ద కోడెకు నెటికి తీయాల... తీరుబాటుగా ఉండావేమోననీ..."

"తీరుబడేలే"

"అయితే కోడెను తీసుకొస్తున్నా?"

"తీసకరాపో... దాంతోబాటు రెండు చెయితాళ్ళు, రెండు ఎలనీళ్ల గాయలు తీసకరా... ఊరి ముందర చింతచెట్టు కాడికిరా"

'అట్లే'నని కనకయ్య వెళ్ళి రెండు క్షణాల్లో కోడెతోబాటు అన్నీ తెచ్చాడు.

అప్పుడే ఎద్దుల్ని మేపుకొని ఇంటికొచ్చి, ఎద్దుల్ని కట్టేసి వీధిలోకొచ్చాడు రాముడు...

"వరే రాముడూ... మా కోడెకు నెటికి తీయాల. కొంచెం రారా..." అన్నాడు కనకయ్య.

ఆ మాటతో 'వస్తా పదా' అంటూ అతనూ కనకయ్య వెంట నడిచాడు.

అందరూ కలిసి చింతమాను మొదలుకు తల ఆన్చి చెయ్యి తాడుతో నిగ్గదీసి గట్టిగా కట్టేశారు. గూకా చెంగడు కొడవలితో కొబ్బరి బోండాలు కొట్టి, అందులోని నీళ్ళను గోపురానికేసి పోస్తూ... బాగా మర్దన చేయసాగాడు. అదయింతర్వాత మరో పెద్ద తాడును దాని మెడకేసి ఇటువైపు, అటువైపు తీసి, ఇద్దరు వెనక కాళ్ల కింద తాడు తీసి దాని శరీరాన్ని వెనక్కి లాగుతుంటే, మరొకరు దాని తలను చింత మానికేసి గట్టిగా నొక్కి పట్టుకొన్నారు.

అప్పుడే తన యింటిముందరికొచ్చి నిలబడిన కేశవరెడ్డి ఆ దృశ్యాన్ని చూస్తూ "కోడెకు నెటికె తీస్తున్నారు కొడుకులు" కసిగా అనుకోసాగాడు.




**పశువుని మించిన పశువులు**

**పొ**ద్దున బావికాడికి వెళ్ళిన బీశేరయ్య అక్కడి పనులన్నీ ముగించుకొని యింటికొచ్చేసరికి ఎద్దుల్ని మేతకు తోలుకు వెళ్ళే టైమైంది. అప్పటికే ఎండ తీవ్రంగా కాస్తోంది. ఊర్లో ఆవులన్నింటినీ తోలుకొని ఆవలోడు ఎప్పుడో అడవిలోకెళ్ళాడు.

ఇండ్ల దగ్గరే ఉన్న సేద్యపు గొడ్లను కూడా మేతకు తోలుకు వెళుతున్నారు కొందరు. బీశేరయ్య సెనగ్గింజల ఊరిమిం

డేసుకొని ఒక ముద్ద సంగటి తిని, గంగెద్దును, దూడను మేపుకురావాలన్న తలంపుతో పందిరికాడి కొచ్చాడు.

ఆతన్ని చూడగానే గంగెద్దు మోర పైకెత్తి చూసి అంబా అంటూ అరిచింది.

వెళ్ళి దాని ముఖాన్ని రెండు చేతుల్తో అబ్బిలించి పట్టుకొని దాని ముఖాన ఒక ముద్దు పెట్టి దూడ కోసం చూశాడు.

అది అక్కడ లేదు.

ఆతని గుండె జల్లుమంది.

"రాత్రి నేను బాగానే కట్టేసినానే. గుర్తు బాగానే ఉండాది. ఏమైందబ్బా." అనుకుంటూ పెరటి దారింటీ వెళ్ళి వెనక చేలల్లో చూశాడు. ఎక్కడా కనిపించ లేదు.

"అయ్యో... అన్ని పరసలు తిరిగి రెండు వేలు బెట్టి తెస్తినే. అదీ గంగెద్దుగా తయారుచేసి తమ్మునికియ్యాలని అప్పుజేసి మరీ పట్టుకొస్తినే. యిప్పుడది ఏమైంది సామీ" నోట్లోనే గొణుక్కున్నాడు.

"మన దేశపు దూడను కేశవరెడ్డి కొట్టుకుంటూ పట్టుకొస్తా ఉండాడు" అరుచుకుంటూ వచ్చి చెప్పాడు బీశేరయ్య పెద్ద కొడుకు మునస్వామి.

"అయ్యో. ఏం జరిగిందో" అనుకొని, "దూడ వీళ్ళకెట్ల దొరికిందిరా? " అన్నాడు వీధిలోకి అంగలేస్తూ.

"రేత్తిరి తాడు ఇడిపించుకొని పోయినట్టుండాది. మన యింటికి ఎనకనే గదా వోళ్ల చేన్లుండేది" తండ్రిని అనుసరించాడు మునస్వామి.

బీశేరయ్య వీధిలో కొచ్చేసరికి పెద్దగా కేకలు వినిపించాయి.

"నీయమ్మా గంగెద్దల నా కొడుకుల్లారా.



గొడ్లను చేన్లల్లో వదిలేస్తే ఎట్లరా? " అరుస్తున్నాడు కేశవరెడ్డి.

వయసులో తనకంటే చాలా చిన్నవాడైన కేశవరెడ్డి అలా తిట్టేటప్పటికి బీశేరయ్య మనసు చివుక్కుమంది.

"జీవాలు మేపేవాళ్ళు ఇట్టాంటి వాటికి రోసపడితే జరిగేనా" అనుకుంటూ రెండడుగులు ముందుకేసి,

"ఏదో కొత్త గొడ్డు. తాడు తెంపుకొనొచ్చింది. అంత మాత్రానికి ఎందుకబ్బా అట్లా తిడతావు" అనునయంగా అనబోయాడు బీశేరయ్య.

ఆతని మెతకతనం చూసి ఇంకా రెచ్చిపోయాడు కేశవరెడ్డి.

"మీయబ్బ గంటని వదిలేస్తివా ఏందిరా

చేన్లోకి. అనవరించుకోను పురసత్తా లేనో డివి గొడ్లను ఎందుకురా మేపతా ఉండావు" అశ్లీలంగా తిట్టసాగాడు.

ఆతని మాటలు విని ఒకరొకరే అక్కడ గుంపుగా చేరిపోసాగారు. యజమానిని చూసిన నెర్లుతో దూడ బలంగా లాగి



ముందుకు దూకింది. ఆ ఊపుకి కేశవరెడ్డి నిలవరించుకోలేక పగ్గాన్ని వదిలేశాడు. అది నేరుగా ఇంట్లోకి దూరి, దాని వెనుక వున్న పందిరి కిందికి వెళ్ళిపోయింది.

కేశవరెడ్డి తిడుతూనే వున్నాడు.

అప్పటికే చుట్టూ చేరిన జనాన్ని చూసి యింకా రెచ్చిపోయాడు. తను పుట్టిపెరిగి నప్పటినుంచీ విన్న బూతులన్నీ తిట్టసాగాడు.

ఇక ఓర్చుకోలేకపోయాడు బీశేరయ్య. మాటల్తోనే ఎదురుదాడికి దిగాడు. తిట్టిన తిట్లకు సరికి సరి అన్నట్లు యింకా పేట్రేగిపోతూనే వున్నాడు కేశవరెడ్డి.

"అరగాసు గొడ్డు చేన్లో పడిందానికి యిన్నిన్ని మాటలంటావా... పోరా... ఏం జేసుకుంటావో.. నీ వల్లా అయింది చేసుకోపో..." అన్నాడు తనూ రెచ్చిపోతూ...

"చూస్తారా... నీ అంతూ, నీ గొడ్ల అంతూ రెండు చూస్త్రారా..." మీసం మెలేశాడు కేశవరెడ్డి. తన కులదర్పమంతా అతని మాటల్లో ప్రతిబింబిస్తోంది.

అప్పుడే పొలం పనిచూసుకుని యింటి కొచ్చిన కనకయ్యకు పరిస్థితి అంతా అర్థమైపోయింది. తమని, తమ యింట్లో ఆడవాళ్ళని సైతం తిట్టిపోస్తున్న కేశవరెడ్డిని చూసేసరికి అతని కోపం నసాలానికంటింది.

"ఏం చేస్తావురా. యభిశారి నా కొడకా.

నువ్వు యింకా యింటి ముందరకొచ్చి బొక్క తెరసినావంటే మూతిపండ్లు రాలగొడతా. పోరా నా కొడకా" లుంగీ ఎగదీసి పైపై కెళ్ళాడు కనకయ్య.

"ఇక ఊరుకోకపోతే వీడు కొట్టేట్టుగానే వుండాడు. అదే జరిగితే ఈ ఊర్లో నాకింక బరముండదు" అనుకుని తోకముడిచాడు కేశవరెడ్డి. అయినా తన దర్పం తగ్గినట్లు అనిపించకుండా "యిప్పటికొస్తే వచ్చింది. యింకముంద యిట్ల జరిగిందో... అప్పుడు మీ గొర్రెకు పట్టిన గతే మీ దూడకూ పడుతుంది, అంతే" అన్నాడు.

ఆ మాటతో యింకా రెచ్చిపోయాడు కనకయ్య.

"లమ్మిడీకొడకా... గొడ్లను, నోర్లేని జీవాలను కొట్టేదిగూడ వొక మగతనమేనా- యిప్పుడు రా...రా... నీకాలిరచతా..." మీదిమీదికి పోయి, రొమ్ముమీద చేయివేసి వెనక్కి తోశాడు.

ఆ తోపుకి నిలవరించుకోలేక వెల్లకిలా పడిపోయాడు కేశవరెడ్డి. చుట్టూ వున్న జనాలు పకపకా నవ్వారు...

"అలనాడు దుర్యోధనుడికి మయసభలో అవమానం జరిగితే ఈనాడు నట్టనడి వీధిలో నాకు అవమానం జరిగింది, ఛ..." అనుకున్నాడు కేశవరెడ్డి. చుట్టూ చూశాడు. ఎక్కడా కనకయ్యగానీ, బీశేరయ్యగానీ ఎవ్వరూ కనిపించలేదు. వాళ్ళు అక్కడినుంచి ఎప్పుడో వెళ్లిపోయారు. ఇక చేసేదేమీలేక పైకి లేచి దుమ్ము దులుపుకొని అవమానభారంతో ఇంటిముఖం పట్టాడు కేశవరెడ్డి.

ఇంటికి తిరిగివచ్చిన బీశేరయ్య దూడకు ఎట్టుందోననుకంటూ పందిరికాడికి పోయాడు.

"అన్నేకారి నా బట్ట. వాన్నెత్తక పొయ్యి ఎద్దల సమాధి దగ్గర పూడ్చా. వాని వంశం నిర్వంశం గానాని... వాని చేతుల రిగిపోనానీ... నోరూ వాయీ లేని గొడ్డును ఎట్ట కొట్నాడో సూడు" నోటికొచ్చినట్టు తిడుతూ దూడ వీపును చేత్తో నిమురుతూ కనిపించింది భాగ్యమ్మ.

బీశేరయ్య దగ్గరకు వెళ్ళి దూడను చూశాడు.

దాని వల్లంతా వాతలు తేలివుంది. దెబ్బల్తో దాని శరీరమంతా మబ్బేసుకోసాగింది. ఆ పరిస్థితిలో దూడను చూసేసరికి దుఃఖం ముంచుకొచ్చేసింది బీశేరయ్యకు.

"ఎందుకు పొయినావురా లచ్చుమన్నా... మనింట్లో నీకు ఏమి తక్కువైందిరా..." తను ముఖాన్ని దాని ముఖాన పెట్టి వలవలా ఏడ్చాడు.

పొద్దున దోశలకోసం నానబెట్టిన బియ్యం కొన్ని మూకుట్లోకి తీసి అందులో ఒక బెల్లం ముక్క వేసి తీసుకొచ్చి భర్త చేతికిచ్చింది భాగ్యమ్మ.

బీశేరయ్య కళ్ళు తుడుచుకుని ఆ నానబియ్యం దానికి తినిపిస్తూ కూర్చున్నాడు.

ఆవేళ తమ సొంత బిడ్డను కొట్టినట్టే భావించి బీశేరయ్య ఇంటిల్లిపాదీ బాధపడుతూ కూర్చున్నారు.




### అనగ అనగా రాగమతిశయిల్లు

**ఇం**ట్లో ఎవరి పని మీద వాళ్ళున్నారు. కనకమ్మ కొట్టంలో రాగులరాయిని

ముందేసి రాగులిసురుతోంది. రాగుల రాయి మధ్యనున్న అచ్చుకిరువైపులా రాగులు కింది రాయిలోకి జారి, పైరాయి విసురుకు పిండి పిండై, కింది రాయి చుట్టూ తెల్లటిపిండి రూపంలో పడుతున్నాయి.

కనకమ్మ చేతిలో రాగులరాయి గరగరాని తిరుగుతుంటే ఆమె మెదడులో ఆలోచనలూ గిర్రున తిరుగుతున్నాయి.

"ఈ ఊర్లో నాతోబాటు పెండ్లయిన వాళ్ళకందరికీ యిద్దరు ముగ్గురు బిడ్డలు పుట్రి. నాకే సంతు కలగలా. ఆడికీ ఈ ఊరి ఎద్దుదేవుడికి మొక్కుకోని కడుపు కింద దూరినా. తిరుమలకొండకు బొయ్యి సామికి మొక్క, సుక్కల పర్వతం దెగ్గిరుండే చెట్లకు గుడ్డలో రాళ్ళుగట్టి ఊపినా, కడకు గుర్రంకొండ దెగ్గిరుండే సంతానదేవత బాలరెడ్డమ్మకు కూడా మొక్కినా, తిరగని దేవళంలా.. మునగని తీర్థంలా. అయినా సంతు కలగలా. నా కడుపులోను ఒక చిన్న నలుసు పుట్టింటే ఈ ఊర్లో నా మొగుడూ ధైర్నంగా తలెత్తుకోని తిరుగు. నేనూ గొడ్రాలనే మచ్చ పోగొట్టుకుందు. నా అచ్చటా ముచ్చటా తీరు. పాపిష్టి దేముడు నాకా అదృష్టం లేకుండాజేశ. యింకిట్లగాదు. ఎట్టయినా సరే... బిడ్డను కనాల్సిందే..." తీవ్రంగా ఆలోచిస్తోంది కనకమ్మ.

ఆలోచించేకొద్దీ కతారి రాముడు నర్మగర్భితంగా మాట్లాడే మాటలు, కాంక్షగా చూసే చూపులు ఆమెకు పదేపదే గుర్తుకు రాసాగాయి.

మొన్నటికి మొన్న నెట్టుబండవైపు గొడ్లను తోలుకు పోయినప్పుడు "ఓమ్మీ. నువ్వు భలే సొగుసుగా వుండావు. నీ ఈ సొగుసంతా పిల్లా జల్లా లేకుండా ఎన్నిదినాలని చూసుకుంటావు. గొడ్డుకు యింట్లో గెడ్డి లేకపోతే దొంగతనంగా సేన్లోనన్నబడి ఆకలి దీర్చుకోవాల. ఎందుకు సెప్తావుండానో అర్థం చేసుకో" అన్నాడు.

రాముడన్న మాటకు తనకు అర్థం తెలీదనా? తెలుసు... అయినా యింత బతుకే బతికీ ఇంట్లో కూడు కాదని పరాయి కూటికోసం ఎట్ల ఆశపడేది

ఇలాంటి ఆలోచనల మధ్య చేటలో రాగులు ఎప్పుడైపోయాయో అయిపోయాయి. పిండిని ఒక గుడ్డలో వేసి తీసుకెళ్ళి ఒక డబ్బాలో పోసి వచ్చింది. ఆ తర్వాత నర్సమ్మ వచ్చి రాగులరాయిని అక్కడినుంచి తీసి యథాస్థానంలో ఉంచింది. ఆరోజు గొడ్లకూ పచ్చిగడ్డి లేదు. గంగెద్దుకు, దూడకు వరిగెడ్డి వేయాలనుకుంది కనకమ్మ.

దక్షిణం వైపున గోడకవతల వున్న బండ్ల పందిరిపైన వరిగడ్డి వుంది... దానికవతల ఊర్లోవాళ్ళ సజ్జచొప్పవాములు, శెనిగతండు వాములు వున్నాయి.

బీశేరయ్య పందిరి పక్కనే కతారోళ్ళ వామి వుంది. కనకమ్మ నిచ్చెన భుజానేసుకుని అక్కడికి వెళ్ళేటప్పటికి రాముడు ఒక తట్టను ముందర పెట్టుకొని వంగి, శెనిగ తండును పీకుతున్నాడు. కనకమ్మ పందిరికి నిచ్చెన వేసి పందిరిపైకెక్కింది.

"ఏమ్మీ కనకా... నేను చెప్పింది ఏమాలోచిస్తివి" కన్నుగీటి మరీ అన్నాడు రాముడు.

కనకమ్మకు వళ్ళు మండింది. అయినా మౌనంగా... రెండు వరిగడ్డి కట్టల్ని వాములో నుంచి పీకి కింద పడేసింది.

"ఏమో... నాకు తోచింది చెప్పినా..." తను ఆశించిన స్పందన కనకమ్మ నుంచీ కనిపించకపోవడంతో నసుగుతూ అన్నాడు.

మౌనంగా నిచ్చెన దిగి, వరిగడ్డి కట్టల్ని ఒకచేత్తో ఎత్తి భుజాన పెట్టుకుని మరో చేత్తో నిచ్చెనను తీసి చేతబట్టుకొని ఒక్క

సారి రాముడివైపు చూసి సన్నగా నవ్వి బిరబిర వెళ్లిపోయింది.

అంతమాత్రం సంకేతం చాలు అర్థం చేసుకోవడానికి రాముడికి. ఆతనూ పెళ్ళయినవాడే. భార్య మంచిదే. ఒక బిడ్డ కూడా. అయినా ఊర్లో ఆడవాళ్ళతో జారాట్లాడ్డం, అవకాశం వస్తే వాళ్ళ పొందుకోరి ముగ్గులోకి లాగడం అతనికున్న బలహీనత.

ఆతని వామికి ఒకపక్క బీశేరయ్య వామి. మరోపక్క ఊర్లో వాళ్ళ వామెలు వుండడంతో... వాళ్ళను ఊర్లోవాళ్ళు చూసే అవకాశం తక్కువ. అందుకే ఎవరూ చూడలేదుకదా అనుకుంటూ అతనూ పందిరి దిగి... తండు తట్టను నెత్తికెత్తుకొని ఇంటి ముఖం పట్టాడు.

## 9

### కోతి పుండు

**కూ**లిపనులు చేసే మడ్డి మనుషుల మధ్య, చిక్కగా గంజిపెట్టి చక్కగా తోమిన తెల్లటి బట్టలు తొడుక్కున్న ప్రజానాయకుడిలా, పూరిగుడిసెల మధ్య, పోయిన దీపావళికి పూసిన సున్నంతో తెల్లగా మెరిసిపోతూ కనిపిస్తోంది సామెర్ల శంకర్రెడ్డిల్లు.

ఇంటి చుట్టూ ప్రహరీ వుందిగానీ ముందువైపు గేటు లేదు. అది పాతకాలపు గూడమిద్దె. దానికి ఉత్తరం దిక్కున గొడ్ల కొట్టం. దక్షిణం వైపున బండ్ల పందిరి. ఆ పందిరి కింద అయిదు ఎనుములు పడుకోనున్నాయి. వాటి మధ్యలో గొలుసుతో కట్టి వేయబడివుంది దేవరదున్న.

దాన్ని మే మాసంలో వచ్చే యల్లమ్మ గ్రామదేవతకు జరిగే జాతరలో బలివ్వడానికి మేపుతున్నారు. అందుకే దాన్ని దేవరదున్నగా వ్యవహరిస్తున్నారు.



ఇంటి ముందరున్న వసారాలో వాలుకుర్చీలో వెల్లికిలా ఆనుకొని సిగెరెట్టు దమ్ము లాగుతూ, కాలుమీద కాలేసుకుని గాల్లోకి పొగ వదుల్తూ దర్జాగా కూర్చోనున్నాడు శంకర్రెడ్డి.

"అరగాసు గంగెద్దల్నా కొడుకు అంతంత మాటలంటాడా. నా కొడుకునే వీధిలో కిందతోసి అవమానం చేస్తాడా... చూస్తా, ఆ నాకొడుకు అంతు చూస్తా..."

తీవ్రంగా ఆలోచిస్తున్నాడతను.

"నాయినా... మర్చిపోలేకుండా వుండా. నిద్దరబోయినా అదే బాధ, మేల్కొన్నా అదే



బాధ"

అప్పుడే యింట్లోనుంచీ వసారాలో కొచ్చిన కేశవరెడ్డి అన్నాడు... ఆ మాట నడం ఎన్నోసారో అతనికే తెలీదు.

"పైరులో బడిన దొంగ గొడ్డును వొగ దెబ్బ కొట్టకుండా వుంటామా... వొగ మాట అనకుండా వుంటామా. ఏం జూసు కోని ఆ నా కొడుక్కి అంత పొగరు. ఎండ కాలంమొస్తే ఎండిపోయే వోటుబాయిని జూసుకోనా... ఎకరా నేల జూసుకోనా. లేకపోతే పీపీ అంటా మేళం ఊదితే డూడూ అంటూ తలుపే ఆ గంగెద్దును జూసుకోనా... ఏం జూసుకోని ఆ మిడిసి పాటు"

శంకర్రెడ్డీ ఈ మాటను ఎన్నోసార్లు అనుకున్నాడు. కొడుకుకి జరిగిన అవ మానం తల్చుకుంటుంటే ఆతనికి గుండెను ఎవరో కోసినట్టనిపిస్తోంది. తరతరాలుగా ఆ ఊరికి సర్పంచ్‌గిరీ వెలగబెడుతూ ఈ గ్రామంలోనే తమకు ఎదురులేదనుకున్న అతనికి అదొక అశనిపాతంలా తోచింది.

వీన్ని యిట్లే వదిలేస్తే ఎట్లా. వీన్ని

జూసుకోని రేపు యింకొగడు, ఆ మరు దినం మరొగడు మనల్ని కేవళంగా మాట్లాడరా యేందీ" అనుకుంటూ తన గుండెను తనే గాయం చేసుకోసాగాడు. తలచుకునేకొద్దీ పదిలమైన తన కోట ఏవో బీటలు బారుతున్న భావన కలుగుతోంది.

"సరే వాడు ఎద్దునాడిపించుకుంటూ, జీవాలు మేపుకుంటా బతికేవాడు. ఎప్పటి కైనా మన చేతికి చిక్కకుండా పోడు. అప్పుడు చెప్తా వాడి సంగతి... నువ్వ ఊరికే వుండ్రా" అంటూ కొడుక్కి భరోసా యిచ్చాడు.

"ఈ గెడివునుంచే వోన్ని పనిబట్టే యోచన్లు చేయాల్సిందే. అవకాశముండే ప్రతిసాట ఒక ఆట ఆడిపించాల్సిందే..." అనుకుంటూ బీశేరయ్య కుటుంబాన్ని సాధించడానికి తగిన పథకాల నన్వేషిస్తూ వుండిపోయాడు శంకర్రెడ్డి.

10



## దేవుడి కోసం దండోరా

ఆ మరునాడు.... ఉదయాన... పెరట్లో కూర్చొని కనకయ్య డోలు వాయి స్తున్నాడు.

మేళం ఊదడం అభ్యాసం చేస్తున్నాడు మునస్వామి. అతను మంగళంపేట హైస్కూల్లో ఏడవ తరగతి చదువుతు న్నాడు. ఆ రోజు ఏ పనులు లేవు...

వాళ్ల కపిల తోలి పండించిన మడి చివ రన బావిలో నీళ్ళయిపోవడంతో... తడారి... దిగుబడి సరిగా రాలేదు...

ఇక వున్నది సజ్జ చేను... సజ్జచేన్లు బాగానే వున్నాయి. చేన్లు పొట్టకర్రలపైను న్నాయి.

"అబ్బోడా... రా... రా... నీకు ఇస్కూ లుకు టైమైంది. అంత అంబిలి దాగిపోదు వుగానీ"

భాగ్యమ్మ కొడుకును పిలిచింది.

మునస్వామి వాయిస్తున్న సన్నాయికి గుడ్డముసుగు తొడిగి, తెచ్చి కొట్టంలో గోడ కొమ్మకు తగిలించి, చుట్టింట్లోకి వెళ్ళాడు.

అప్పుడే వీధిలో కణేల్ కణేల్‌మని డప్పు శబ్దం వినిపించింది. 'ఏదో దండోరా కొడతావుండారు. ఏమైవుంటుందబ్బా' అనుకుంటూ డోలు కొట్టడం ఆపి, దానికీ గుడ్డతొడిగి గోడ కొమ్మకు తగిలించి వీధి లోకొచ్చాడు కనకయ్య.

తలారి వెంకటేసు పలక కొడుతూ వీ లెంటే వస్తున్నాడు. "ఏమిరా దండోరా ఎంకటేశు" అడిగాడు.

"ఏమి లేదబ్బా... రేపు శనివారం మన ఘంటావాళ్ల పల్లెలో దేవరెద్దుల 'వేలుపు' జరగతాది. మోపెత్తుతారు. ఆ సందర్భ రంగా దేవరెద్దు ఊరూరు తిరిగాది. ఈ రోజు కమ్మపల్లెలో తిరగతా వుండాది. రేపు ఈ వూరికొస్తాది. అందువల్ల యావ జ్జనానికీ తెలియజేయడమేమనగా... రేపు ఇల్లూ వాకిలీ అలుక్కోని, కాయా కర్పూరం తెచ్చుకోని, నాణ్యాలు ఏర్పాటు చేసుకోం డొహో" అని పెద్ద గొంతులో చెప్పి మళ్ళీ డప్పు కొడుతూ వీధెంటే యెలబారిపో యాడు వెంకటేశు.

"వేలుపు అంటే ఏంది సినాయనా.." సద్దినీళ్ళు తాగి పుస్తకాలసంచీ భూజానేసు కోని వచ్చిన మునస్వామి అడిగాడు.

"వేలుపంటే ఏమి సిన్నకతా.... దేశంలో యాడుండే దేవరెద్దులు వచ్చేస్తాయి... అన్నీ కొలువుతీరతాయి. ఆ కొలువులో

ఎద్దు దాసరిని ఎన్నుకుంటారు. గురువెద్దునూ ఎన్నుకుంటారు. అబ్బో అది పెద్ద యేడికలే... సూడాల్సిందే... ఆ రోజుకి దేవరెద్దుల పటాటోపం సెప్పనలివిగాదు" చెప్పాడు కనకయ్య.

"నేను ఇస్కూలుకు పోయొస్తా" అని పుస్తకాల సంచీని భుజాన ఎగేసుకుంటూ వెళ్ళిపోయాడు మునస్వామి.

అతనికంటే రెండేండ్లు చిన్నవాడైన బాలయ్య మంగళంపేట ఎలిమెంట్రీ స్కూల్లో నాలుగు చదువుతున్నాడు. అతనూ అప్పుడే పుస్తకాలు చేతబట్టుకొని "వొరే అన్నా...నేనొస్తావుండా వుండు" అని అరుచుకుంటూ వచ్చి వీధిలోకి పరిగెత్తాడు. అప్పటికే ఆ ఊర్లోనుంచీ బడికి వెళ్ళే మరో యిద్దరు పిల్లలు స్కూలుకు బయల్దేరుతూ కనిపించారు...

"నాకూ వొగ మొలక పుట్టింటే... వోడూ ఈళ్ళమాదిరిగానే ఇస్కూలుకు పోతావుండుగదా" వాళ్ళనే చూస్తూ మనసులోనే మదన పడసాగాడు కనకయ్య...




**కోపెత్తిన కోపతాపాలు**

ఆ మరునాడు మంగళవారం...

సాయంత్రం వేళకు... అందరూ తమ తమ ఇళ్ళముందర కల్లాపి చల్లి ముగ్గులేసి, గడపలకు ఎర్రమన్ను పూసి, కాయా కర్పూరం తెచ్చుకుని వచ్చే దేవరెద్దుకోసరం సిద్ధంగా వున్నారు.

ఆ ఊర్లో అయిదిండ్లోళ్ళు రెడ్లున్నారు. ముప్పయ్యింట్లోళ్ళు కురవోళ్ళు, నాలగిండ్లోళ్ళు కంసలోళ్ళు, పదిండ్లోళ్ళు వడ్లోళు, పద్దైదు ఇండ్లోళ్ళు బలిజోళ్లు ఉన్నారు. దాని కూతవేటు దూరంలో కాస్త ఎడంగా ఇరవై ఇండ్లోళ్ళు గొల్లలు వున్నారు... ఈ గొల్లోళ్ళదే దేవరెద్దు...

ఆ ఊరిపైన అధికారం ఎప్పుడూ ఆ ఊర్లో కొద్ది కుటుంబాలే వున్న రెడ్లదే. అందునా శంకర్రెడ్డి కుటింబీకులదే. వాళ్ళు ఏది మాట్లాడితే అది న్యాయం... కారణం ఆ వూర్లో అందరికంటే కాస్తా ఎక్కువగా భూములున్నది వాళ్ళకే... మిగిలిన వాళ్ళకు కొందరికి వాళ్ళతో వీసమెత్తు అటూ ఇటూగా భూమి పుట్రా వున్నవాళ్ళున్నా, రెడ్లకున్న గౌరవం మిగిలిన వాళ్ళకు లేదు.

ఉత్తర దక్షిణంగా వ్యాపించివున్న ప్రధాన వీధిలో కురవలు, రెడ్లు వున్నారు. వెనక వున్న వీధిలో మిగిలిన కులంవాళ్ళు వున్నారు.

ఆ ఊర్లో ఏది మొదలెట్టినా పడమటి వైపున, దక్షిణ దిక్కునున్న మొదటి ఇల్లయిన రాశింటితోనే ఆరంభించడం ఆనవాయితీ... పండగ పబ్బాలకు ఒక పంపకం వేయాలన్నా, ఒక వేటను కోసి భాగాలు వేసి మాంసం పంచాలన్నా, ఒక దేవుడి ఊరేగింపు బయలుదేరాలన్నా మొదట ఆరంభించేది రాశింటితోనే. ఇది ఆ ఊరిలో ఎన్నో తరాలనుంచీ వస్తున్న ఆచారం.

ఆ రాశింటి స్థానంలో వున్నది గంగెద్దుల కోటయ్య ఇల్లే. అందుకే బీశేరయ్య వాళ్ళను రాశింటోళ్లు అని కూడా అంటారు.

ఆ రోజు సంధ్యవేళకి దేవరెద్దు ఊర్లోకొచ్చేసింది. రాశింటికవతలున్న వీధి గంగమ్మ గుడిముందర దేవరెద్దు ఆగి

## కొత్తగాలి... 

**ఆకాశం**
**ఆశ్చర్యపోయింది**
**తనని దాటుకుపోతున్న**
**ధరలను చూసి**

–'సుందరి', విశాఖపట్టణం

వుంది.

దాని శరీరానికి ఎర్రటి పట్టువస్త్రాల ముసుగు వేసివున్నారు. గుడిముందర నడుమలెత్తున్న గరుడస్తంభం వెలుగు తోంది. చాకలి నూనె దుత్త చేతికి తగిలించుకుని దివిటీని పట్టుకోనున్నాడు.

ఓ యిద్దరు గజం పొడవుతో వ్రేలాడుతున్న నెమలికుచ్చుల పిల్లంగట్టెల్ని ఊదుతుంటే, వాళ్ళ మధ్యన నిలబడి మరో యిద్దరు వెడల్పాటి తాళాలు వాయిస్తూ, నర్తిస్తూ ఉన్నారు. ఒక వ్యక్తి వీపున తవటం తగిలించుకొని నిలబడివున్నాడు. మరో వ్యక్తి మూరెడు పొడవున్న చర్మపు ముక్కలతో తవటంపైన కొడుతూ దబదబాని శబ్దం చేస్తున్నాడు. మరోప్రక్క మాదిగలు డప్పులు కొడుతూ కొమ్ములు ఊదుతున్నారు. పంబలవాడు వాళ్ళతో శ్రుతి కలుపుతున్నాడు. మరో యిద్దరు వ్యక్తులు పొడవాటి వెదురు కొయ్యలకు అమర్చిన తెల్లటి పట్టు గొడుగుల్ని లేపి పట్టుకొనున్నారు.

దేవరెద్దు బాగా ముసలిదైపోయి వుంది. దాని కొమ్ములు నేరుగా పైకిగాకుండా చేతి లావుతో వంపు తిరిగి పొట్టేలి కొమ్ముల్లా కిందివైపుకు పెరిగి, ముందరి కాళ్ళకు సగంవరకు పెరిగివున్నాయి. అలా కొమ్ములు కిందికి పెరగడం దేవరెద్దు మహత్యమని భావిస్తారు. అది తిరుమల వెంకన్న ప్రతిరూపంగా భావింపబడుతోంది.

ఊర్లోజనం అప్పటికే అక్కడ గుంపు చేరిపోయి ఎద్దును చూడడానికి ఎగబడుతున్నారు. కొందరు వీధిలో ఇండ్లముందరున్న బండ్లపైన కూడా కూర్చొని ఆ వేడుకను చూస్తున్నారు.

రాశింటికివతలున్న కఠారి రాముడి ఇంటిముందర గోడవార పరచివున్న బండపైన కనకయ్య, వడ్డిగూకా చెంగడు వంటి యువకులు కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

"ఈ దేవరెద్దులు మన గ్రామంలోనేనా యింకా యాడైనా వున్నాయా? " గూకా చెంగడు అడిగాడు.

"కల్లూరు దెగ్గిర చిన్న గిరుండాదిగదా. అక్కడందరూ పాలేకిరోళ్ళుండారు గదా. వాళ్ళకు వొగ ఎద్దుండాదబ్బా. వాళ్ళు దాన్ని కదిరి నరసింహస్వామికి ప్రతిరూపంగా భావించుకుంటారు" చెప్పాడు కనకయ్య.

"బందార్లపల్లెలో కాపోళ్ళకు ఎద్దుండాది. ఊటొంకలో బలిజోళ్ళకు దేవరెద్దుండాది. యింకా బోడేవోండ్ల పల్లెదెగ్గిరుండే కోటపల్లెలో, ఆ పక్క కె.వి.పల్లెకవతలుండే జిల్లేళ్ళ మందలో ఎద్దులుండాయి. యింకా శ్యానాచోట్ల ఎద్దులుండాయంట్లే..." తన బలమైన కండరాలను చూసుకుంటూ అన్నాడు కఠారి రాముడు.

"మనిసి పశువుల్ని ఎన్ని రకాలుగా కొలుస్తారబ్బా. ఆవునయితే గంగమ్మగా, గౌరీదేవిగా, సీతమ్మగా కొలుస్తారు. కొందరు తిరుమలస్వామి పేరుతో ఎద్దుల్ని వదల్తారు, కొందరు గంగెద్దుల పేరుతో రామలక్ష్మణులుగా, బసవన్నగా కొలుస్తారు..." అన్నాడు చెంగడు.

"దున్నపోతుని పోతులయ్య పేరుతో పెంచి గంగమ్మకు బలిగూడా యిస్తారు గదా? " అన్నాడు కనకయ్య.

"యింకా దేశంపైన ఎన్నెన్ని రకాలుగా సూసుకుంటావుండారో" రాముడు అన్నాడు.

దేవరెద్దు దగ్గిర... ఎద్దు దాసరి కర్పూరం వెలిగించి గంట వాయించి ఎద్దుకు హారతి పట్టాడు. ఆ తర్వాత కొత్త మూకుడులో వున్న బండారు తీసి అంద రికీ బొట్లు పెట్టి "ఇంక రాశింటినుంచీ ఆరంభించి, ఇంటింటికీ స్వామిని తీసక పోండబ్బా" అన్నాడు.

"స్వామి ఎద్దుదాసరి సామీ... నువ్వు ముందు నడు సామీ..." అన్నారెవరో.

అందరూ ఒక్కసారి 'గోయిందా, గోయిందా' అంటూ అరిచారు. ఎద్దు రాశిం టివైపు కదిలింది.

ఇంతలో "ఆగండి" అంటూ ముందుకు వచ్చాడు శంకర్రెడ్డి. "ఏమైందబ్బా?" ఎద్దును ఆపి అడిగాడు ఎద్దుదాసరి ఘంటానాగరాజు.

"ప్రతిసారీ రాశింటినుంచే ఆరంబిం చాల్నా. నేను ఈ ఊరికి సర్పంచిని. కాబట్టి ఈసారి స్వామికి మొదటిపూజ మా యింటినుంచీ అందాల్సిందే" ఆజ్ఞాపిం చాడు శంకర్రెడ్డి.

ఆ మాటతో అక్కడున్నవారు వాదనకు దిగారు.

"ఏ ఊర్లోనైనా మొదులుగా రాశింటి పూజనే అందుకునేది ఆచారంగదా. ఇన్ని దినాలు అట్టనే వచ్చింది. యిప్పుడు కాదంటే ఎట్లా?"

"ఏ ఊర్లో సంగతో నాకనవసరం. ఈ ఊర్లో సంగతి సెప్తావుండా. ముందు మా యింటికి ఎద్దు రావాల. మా పూజ అందు కోవాల"

దేవరెద్దును ఎవ్వరూ ఎద్దని పిలవరు. కేవలం ఎద్దుగా భావించరు కూడా. అందు వల్లా అందరూ ఎద్దును స్వామీ అంటారు. చివరికి ఎద్దు దాసరిని సైతం స్వామిగానే సంబోధిస్తారు. అలాంటిది శంకర్రెడ్డి దేవ రెద్దును 'ఎద్దు' అని సంబోధించినందుకు కొందరు నొచ్చుకున్నారు.

"ఆచారంగాదని సామి ముందుగా మీ యింటికొస్తే మిగిలినోళ్ళు ఊరికే వుంటారా?"

"ఈ ఊరికి పెద్దని, సర్పంచిని. నన్నెది రించేవాడెవుడు?"

"య్యోవ్... రెడ్డీ. ఎట్లా పోతావుండేది అట్లపోనీ... ఎందుకు దానికి అడ్డుపుల్ల యేస్తావు?" ఓ తలనెరిసిన వ్యక్తి అన్నాడు.

"అదేం కుదరదు. స్వామి ముందుగా ఈసారి మా యింటికి రావాల్సిందే. లేకుంటే తిరుక్కోని పోవాల్సిందే" తండ్రిని సమర్థిస్తూ అన్నాడు కేశవరెడ్డి.

"ఏమి వీడు. ఇంత గావిడింపు (దబా యింపు) సమాచారంగా వుండాడే"

"శుభమాని సామి ఊర్లోకొస్తే యీ అనాచారం ఏందీ... ఊరికే ఉండ డయ్యా... ఊరికి మంచిది కాదు"

దేవరెద్దు దగ్గర వాదనలు, సర్దుబాటు మాటలు సాగుతూనే వున్నాయి.

బండలమీద కూర్చుని వున్న వ్యక్తులు ఆసక్తిగా చూస్తున్నారు.

"ఈ రెడ్లూ, నాయుళ్లు అంతేరా నాయనా. వాళ్ళు చెప్పింది జరగాల్సిందే అంటారు. వాళ్ళ మాట కిందబడగూడదు. సహించలేరు" నిట్టూరుస్తూ అన్నాడు రాముడు.

"అవునబ్బా రాజ్యమెప్పుడూ వోళ్ళ సేతు ల్లోనేగదా వుంటాది" నసిగాడు అప్పుడే వాళ్ళ దగ్గరకొచ్చిన నుసకడు.

"బ్యామ్మలు ఢిల్లీలో కూసోని దేశం యాల్తావుండారు. ఈడయిట్లా" గూకా చెంగడు అన్నాడు.

"యీడ వొగ పార్టీ వస్తే రెడ్లూ, యింగొగ పార్టీ వస్తే నాయుళ్ళు... హైద

రాబాద్‌లో కూసోని యాల్తా వుండారు" కనకయ్య చెప్పాడు.

"ఊర్లోగూడా వోళ్లే మేటిగా వుండాలను కుంటారు. ఏమన్నా అంటే వోళ్ళను వే దిస్తారు" కాడా చెంగడన్నాడు.

"మిగిల్నోళ్ళ పెత్తనం ఎప్పుడబ్బా వచ్చేది? " అంతవరకూ మౌనంగా వున్న నుసకడందుకున్నాడు.

"మిగిల్నోళ్ళు వొగిటయ్యేది లేదు. వాళ్ళకు దేశింపెత్తనం వచ్చేదీ లేదు పో"

"అవునబ్బా... మిగిలిన కులాలోళ్ళు వొగిటయ్యిందాకా యింతే"

వీళ్ళ చర్చకు అంతరాయం కలిగిస్తూ దేవరెద్దు దగ్గర పెద్ద రభస జరిగింది.

"ముందు మా యిండ్లకల్లా రావాల్సిందే. పట్టుపట్టాడు శంకర్రెడ్డి.

వాళ్ళ వాళ్లంతా అతన్నే సమర్థించారు.

అదే జరిగితే ఇన్నిరోజుల రాశింటి ఆచారం పోతుందనీ, అది జరిగితే తమ కున్న అంతంత మాత్రం గుర్తింపు కూడా చేజారిపోతుందనీ రాశింటోళ్లను సమర్థి స్తున్న వాళ్ళు అంటున్నారు.

ఆ రభసలో బీశేరయ్య గట్టిగా మాట్లా డుతున్నాడు.

"ఎబ్బుట్నుంచో పెద్దోళ్ళు యేర్పాటుజే సిన ఈ ఆశారం కాదంటే యెట్లా? " చేతులు గాల్లోకి తిప్పుతూ వాదిస్తున్నాడు బీశేరయ్య.

"అది వీలు పడదయ్యా" కేశవరెడ్డి అడ్డు కుంటున్నాడు.

"ఎందుకు? " మరెవరో ప్రశ్నించారు.

"యిన్ని దినాలూ అడిగేవోళ్ళులే. అట్ట సాగిపోతా వున్నింది. ముందుట్నుంచీ మా వంశపోళ్ళే ఈ ఊరికి సర్పంచిలుగా, మెంబర్లుగా పెద్దరికం తీసుకున్నారు. వోళ్లు అడగలే. యిప్పుడు నా హయాంలో నేనడగతావుండా. ఇంగనుంచీ ప్రతిదీ మా యింటినించీ ఆరంభించాల్సిందే" పట్టిన పట్టు వదలనన్నట్లు మాట్లాడుతున్నాడు శంకర్రెడ్డి.

వాళ్ళు అలా ఎందుకు మాట్లాడుతు న్నారో మిత్రులతో కలిసి వున్న కనక య్యకు అర్థమైపోయింది.

'మా గొర్రెను కాలు యిరిగేసినందుకు, మా కోడె దూడను కొట్టినందుకు వాళ్ళను తిట్టినాం. కేశవరెడ్డిని ఎదురొమ్ముమింద సెయ్యిబెట్టి తోసినా. ఆ కోపం ఈ మాదిరి సూపెడతావుండారు' అనుకుంటూ పైకి లేచి వచ్చి, ఆ రభసలో దూరి, అన్నకు అండగా నిలబడ్డాడు కనకయ్య.

ఆ రంపులో ఒకర్నొకరు తిట్టుకోసా గారు. గబ్బుగా అరుచుకోసాగారు. ఇక దెబ్బలాటకు దిగే పరిస్థితిలో ఊర్లో పెద్దలు రంగంలోకి దిగారు. అందరికీ సర్ది చెప్పారు. రభస చల్లారింది. కానీ శంక ర్రెడ్డి తన పంతమే నెగ్గాలని ఉడుంపట్టు పట్టాడు. కొట్లాట ఎందుకులే అని బీశేర య్యకు, అతని తమ్మునికి, వాళ్ళని సమర్థి స్తున్నవాళ్ళకు సర్ది చెప్పారు.

"ఎవరో ఒకరు సర్దుకోకపోతే ఎట్లా? ఊరన్నాకా కొన్ని పట్టు విడుపులుండాలి. సర్దుబాట్లూ వుండాల. నువ్వన్నా సర్దుకో వాల బీశేరయ్యా" అన్నాడో వృద్ధుడు.

"ఏం వాళ్ళను సర్దుకోమను" కోపంగా అన్నాడు కనకయ్య.

"వాళ్ళ సంగతి తెలిసిందే గదా. మనమే సర్దుకొనిపోవాల"

"గూదకంటే మెత్తనని... అప్పటికి మేమేనా యెదవలం"

"అట్లంటే యెట్లబ్బా. జీవాలుండేవోళ్ళం. యితరుల భూముల్లోకి పోకుండా జీవనం గడస్తాదా మనకు? "

"కడాకు అదనైపోయిండేది మేమే..."

"సూడబ్బా... వదిగున్నోడు ఎప్పుడూ అధవ (చులకన) కాడు. ఎప్పటికైనా వాడికి మంచే జరగతాది"

ఊర్లో వాళ్ళ మాటలకు కాదనలేకపోయారు వీళ్ళు.. చివరికి సరేననక తప్పలేదు.

ఫలితంగా దేవరెద్దు... రాశింటి ముందరి నుంచి శంకర్రెడ్డి ఇంటివైపుకు బయలుదేరింది.

శంకర్రెడ్డి, ఆయన వర్గం విజయగర్వంతో ఉత్సాహంగా గోవిందా గోవిందా అంటూ గోవిందలు కొట్టసాగారు.

శంకర్రెడ్డి యింట్లో దేవరెద్దుకు ఫలహారం, పూజాపునస్కారాలు బాగానే అందాయి. అది వాళ్ల నట్టింట్లో నిలబడి గంజరం పోసింది.

"దేవరెద్దు ఎవరింట్లో గంజరం పోస్తుందో ఆ యింటికి మంచే జరుగుతుంది" అన్నారు జనం.

"పేడేస్తే యింకా మంచిది" అన్నాడు ఎద్దు దాసరి.

శంకర్రెడ్డి యింటి తర్వాత ఆ వరుసలో వున్న మిగిలిన యిండ్లన్నీ తిరిగింది దేవరెద్దు. అవి అయింతర్వాత బోయల ఇండ్లు, కంసలోళ్ల యిండ్లు తిరిగింది. అదే విధంగా చాకలి ఇండ్లు అయింతర్వాత... చివర వుండడంతో కడాన రాశింటి కొచ్చింది. అప్పటికి తెల్లవారిజాము కావస్తోంది. డప్పులవాళ్లు, పంబలవాడు అప్పటికే బాగా అలసిపోయివున్నారు. తవటం, గొడుగులు మోసేవాళ్లు ఆపసోపాలు పడుతున్నారు. పిల్లంకట్టెలవాళ్ల నృత్యం ఎప్పుడో ఆగిపోయివుంది.

దేవరెద్దు అందరి ఇండ్లలోను, నానబియ్యం, నానబెట్టిన సజ్జలు, అరటి పండ్లు, ఇతర ఫలహారాలు తిని కడుపుబ్బరంతో కదలలేని స్థితిలో వుంది. రాత్రంతా ఎద్దు వెంటవున్న జనం చాలామంది తమతమ యిండ్లకు ఎప్పుడో వెళ్లిపోయారు. ఎద్దు వెంట పట్టుమని పదిమంది కూడా లేరు..

రాత్రంతా ఎద్దు దేవుడి కోసం ఎదురు చూసిన బీశేరయ్య కుటుంబ సభ్యులు, ఏ అర్ధరాత్రో నిద్రపోయి, తమ యింటికి ఎద్దు వస్తోందని తెలిసి మేల్కొన్నారు. పడమటి దిక్కున ఆకాశంలో గొర్తుకోళ్లు ఎప్పుడో మునిగిపోయి వున్నాయి. ఊర్లో తొలికోడి కొక్కరకో అని కూసింది. అప్పటికే నిద్ర లేచిన కొందరు ఇల్లాండ్రు రోట్లో సజ్జలు పోసి ధన్‌ధన్‌మని దంచుతున్న రోకటి పోట్ల శబ్దం వినిపిస్తోంది.

ఎద్దు దాసరి నాగరాజు "సామీ యింట్లో కిరా" అంటూ ఎద్దుమెడకున్న పగ్గం తాడును లాగుతున్నాడు. ఉన్నకొద్ది మందయినా "గోయిందా, గోయిందా" అంటూ నీరసంగానైనాసరే అరుస్తున్నారు. పంబల శబ్దం టంకుటంకుమని ఆ ప్రాంతపు నిశ్శబ్దాన్ని బద్దలు కొడుతోంది. చాకలి ఓబన్న నూనెదుత్తలో అరకొరగా మిగిలివున్న

## రీజనింగ్



**ఓ** రోజు కిచెన్‌లో వంట చేస్తున్న అమ్మను టిల్లు గమనిస్తున్నాడు. అమ్మ తలలో కొన్ని వెంట్రుకలు నెరిసి ఉండడం చూసి టిల్లు 'అమ్మా, నీకు తలలో తెల్లవెంట్రుకలు ఎందుకొచ్చాయి?' అడిగాడు. దానికామె, ప్రతిసారీ నువ్వు తప్పుచేసి నన్ను బాధపెట్టినప్పుడు ఒక్కొక్క తెల్లవెంట్రుక వస్తుంది' అంది. వెంటనే టిల్లు, 'అలా గయితే నాయనమ్మకు తలంతా తెల్లవెంట్రుకలే ఎందుకొచ్చాయమ్మా?' అన్నాడు.

అముదపు నూనెను గరిటెలోపోసి దివిటీ మంటను ఎగదోస్తున్నాడు.

అయినా ఎద్దు కదల్లేదు. ఇలా ఎద్దు మొండికెయ్యడం అది ఏ పదోసారో... అలా యింట్లోకి పోకపోతే ఆ యింటి వ్యక్తులపైన దేవరెద్దుకు కోపం వున్నట్లు లేదా వాళ్లు తీర్చాల్సిన మొక్కేదో మిగిలి పోయివుంటుందని భావిస్తారు.

"స్వామీ... ఎద్దు దాసరిసామీ... దేవుడు మా యింట్లోకి ఎట్లయినాసరే. రావాల. కాసింతసేపు పండుకోవాల. మాయింటి పలారం ఆరగించాల" ఎద్దు దాసరిని వేడుకుంటున్నాడు కోటయ్య.

"సామీ... ఎంకటేస్సుడా. నీ మొక్కు ఏదయినా వుంటే తీర్చుకుంటాం సామీ... రా... యింట్లో కొచ్చిపో.. సాలు" బీశే రయ్య ఎద్దును వేడుకుంటున్నాడు. అయినా అది కదల్లేదు.

అక్కడున్నవాళ్లందరూ వేడుకున్నా అది వినలేదు. ఊరంతా తిరిగి తిరిగి అప్పటికే దాని కాళ్లు నొప్పి పుడుతున్నట్టుంది. అందుకే అది ఒకడుగు అట్ల కదిలించ లేదు.

ఆవేళకు భళ్లున తెల్లారిపోయింది. తూర్పున పటమెగిరింది. ఆ వెలుతుర్లో దూరంగా వుండే చెట్లు చేమలు కనిపించ సాగాయి.

"పొద్దు మొలస్తావుండాదిగానీ... యింకెంతసేపున్నా అంతేలే. ఎద్దుదేవుడు బాగా అలసిపోయిండాడు. ఇంక చాల్లేబ్బా" అంటున్నాడు ఎద్దు దాసరి.

బీశేరయ్య కుటుంబం నిరుత్సాహపడి పోయింది. ఎద్దు తమ ఇంట్లోకి అడుగు పెట్టలేదంటే ఏదో కీడు జరగబోతుందని కోటయ్య అంగలార్చాడు.

పంబలవాడు, ఎద్దుదాసరి కడసారి ప్రయత్నం చేసి విఫలమయ్యారు.

అది పేడ వేసింది. ఆ పేడ పుర్రు పేడ. రాత్రి తిన్న నానబియ్యపు గింజల్తో కూడుకొన్న పుర్రుపేడ వేసింది.

"అబ్బా... కనీసం మీ ముగింట్లో పేడన్నా యేసిందిలేబ్బా. మంచిదే గానీ... యింక పదండి" అన్నాడు పంబ లవాడు.

"పదస్వామీ. ఇంక మన గుడికి పోదాం" అంటూ పగ్గాన్ని వెనక్కి లాగాడు దాసరి.. ఎద్దు మెల్లగా వెనక్కి తిరిగింది. ఎద్దుదాసరి ఆరోజుకి మెరవణి ముగిసినట్టుగా... పక్కనే వున్న వీధి గంగమ్మ ముందర ఎద్దుని నిలిపి హారతి పట్టాడు. చివరిసారిగా అందరూ గోవింద నామస్మరణ చేశారు.

పంబలవాడు వేగంగా పంబల వాయిస్తూ "య్యోవ్ సామీ... దాసరి సామీ.. ఎద్దుకు దిష్టి తియ్యి" అన్నాడు.

ఆ మాటతో ఒక బొచ్చు పీకేసిన టెంకాయ తెచ్చి ఎద్దుకు దిగదీసి యేట్టెం కాయ వేశాడు. అది నేలకు తగిలి ముక్క లైపోయి ఆ ముక్కలు నాలుగు దిక్కు లకు పోయి పడ్డాయి.

ఎద్దు తిరిగి ఘంటా వాళ్లపల్లెకు బయ లుదేరింది.

బీశేరయ్య కుటుంబీకులు నిరుత్సా హంగా ఇంట్లోకి వెళ్లిపోయారు. చివరన కఠారి రాముడు ఇంట్లోకి వెళుతున్న కన కమ్మ వైపు చూసి నవ్వాడు.

కనకమ్మా ముసిముసిగా నవ్వుతూ తలవంచుకొని యింట్లోకి పోయింది...

దూరంగా తన యింటి ముందర నిల బడి విజయగర్వంతో వాళ్లనే చూస్తూ నవ్వుకోసాగాడు కేశవరెడ్డి. అప్రయ త్నంగా వెనక్కి తిరిగి చూసిన బీశేరయ్య చూపుల్లో అతను పడనేపడ్డాడు. ఇంకా రెచ్చిపోయి నవ్వాడు శంకర్రెడ్డి. ఆ చూపు బీశేరయ్య గుండెకు బాణంలా తగి లింది.




నట్టింట్లో నొసటిరాత

ఆ మరునాడు... ఉదయం... పొద్దు పుట్టి బారెడెక్కింది.

భాగ్యమ్మ తలస్నానం చేసి... తల గుడ్డను వెంటుకులతో బాటు చుట్టి, పెరట్లో వున్న గంజరపు దుత్తనెత్తుకొని గొడ్ల కొట్టంలోకి వెళ్లింది.

కనకమ్మ వంటపనిలో నిమగ్నమై ఉంది. నరసమ్మ కూరకోసం రోట్లో బడరో కలివేసి కారం నూరుతోంది...

కోటయ్య ఓ మూల కూర్చొని ఎప్పుడో నాలుగేళ్ళప్పుడు చనిపోయిన తన భార్యను తలచుకుని... ఆలోచన్లలో ముని గివున్నాడు.

"నా భార్యా యింతే... తెల్లవారే... లేచి... అన్ని పనులు చేసేది. శుక్రవారం వచ్చిందంటే చాలు... తలస్నానం చేసి ఇల్లంతా పంచితం చల్లేది. ఏమని అంటే ఆవు పంచితం అమృతంతో సమానమ నేది. అది ఇంట్లో చల్లడం వల్లా... దోషాలు తొలగిపోతాయనేది. ఇల్లు శుద్ధి పడేది అనేది. పంచితం వాసనకు, పర డలు (బొద్దింకలు), సాలీళ్ళు, బల్లులు వంటివి చస్తాయనేది. బహిష్టు అయితే యింట్లో కొచ్చేదికాదు. మూడురోజులూ స్నానంచేసి వెలుపలే పడుకునేది. ఎంత చలయినా సరే.. మా కాలం మనుషులు వేరు... ఈ కాలంవాళ్లకు అంటూ లేదు.. ముట్టూ లేదు"

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు!

"ఏంనాయనా... సజ్జచేన్లు కూడా ఇంక వారంలో కోత కొచ్చేస్తాయి. చేన్లు కోసి గూడేసేస్తే... బాగా మగ్గినాకా... గూళ్లు కోసుకోవాల" అప్పుడే యింట్లో కొచ్చిన బీశే రయ్య అన్నాడు.

"అవున్రా పెద్దోడా... ఇప్పట్నుంచే కొడ వండ్లూ అవీ సరిచేసుకోవాల గదా"

"నిన్ననే కక్కలకొడవండ్లును కక్కు కోసం కంసలోళ్ళ బొజ్జన్న దెగ్గిరయిచ్చేసొ చ్చినా..."

"ముందు ఆ పని జూసుకో నాయనా"

ఆ మాటతో... చుట్టింటికప్పువైపు చూసి, తలుపుపైగా కాస్తా పైకి ఎక్కి అట కపైనున్న చితకలతట్ట దించుకొని... బయటికొచ్చాడు! గొడ్లకొట్టంలోకి వెళ్లిన భాగ్యమ్మ సీతమ్మ దగ్గర నిలబడ్డది. అది గంగెద్దలాటలో సీతమ్మగా శిక్షణ పొందిన ఆవు. అందుకే దాన్ని సీతమ్మ అని ఇంటి ల్లపాదీ ముద్దుగా పిల్చుకుంటారు. దానికి కుడివైపున వీపునుంచీ ఒకటిన్నర అడుగు పొడవుతో ఒక చిన్నకాలు పెరిగివుంది. దానికి చివర చిన్న గిట్టలు కూడా వున్నాయి. భాగ్యమ్మ ఆ గిట్టల్ని రెండు చేతుల్తో స్పృశించి కళ్లకద్దుకొంది.

"సీతమ్మా... అంత పంచితం బొయ్యి. యింట్లో సల్లుకోవాల అంది" అది ఎంతో కరుణతో చూస్తున్నట్లు తల ఎత్తి ఆమెవైపు ఒక్కసారి చూసి మళ్లీ తలదించేసుకొని, రాత్రంతా తిని వదిలేసిన గాట్లోని చొప్ప దంట్లలో మూతిపెట్టి కెలుకుతూ వుండిపో యింది.

ఆ తర్వాత పెద్దావువైపు చూసింది. అది నింపాదిగా పడుకుని తన్మయత్వంగా నోరాడిస్తూ నెమరు వేసుకుంటూ వుంది. దానికి పుట్టిందే సీతమ్మ...

"పెద్దమ్మా... నువ్వన్నా పోస్తావా?" అంది భాగ్యమ్మ.

అది ఆ మాట వినబడనట్లే వుండిపోయింది.

ఇక లాభం లేదనుకొని సీతమ్మ తోక కింద చేయిపెట్టి సాదుపట్టింది. కొంతసేపటికి సీతమ్మ శరీరాన్ని ఉగ్గబట్టి గంజరం పోయసాగింది. భాగ్యమ్మ జాగ్రత్తగా గంజరాన్ని దుత్తలోకి పట్టుకొని, ఆ దుత్తలోని పంచితాన్ని ఇల్లంతా చల్లి, దుత్తను పెరట్లో పెట్టడానికి ఇంటి వెనక్కి వచ్చింది.

"వొరే లచ్చుమన్నా... రారా... ఆడుకుందాం..." అన్న మాటలు వినిపించి గొడ్ల పందిరివైపు చూసింది భాగ్యమ్మ.

అక్కడ బాలయ్య దేశపు దూడతాడు విప్పి, పక్కకు తీసుకువస్తున్నాడు.

భాగ్యమ్మ నవ్వుకుంటూ "ఈ గొడ్లు కూడా ఈ యింటికి బిడ్డలే.. అందుకే దూడతో ఆడుకుంటున్నాడు బాలయ్య. మునసామి పుట్టినప్పుడు కదా ఆ గంగెద్దు పుట్టింది. దానిపైన మునసామికి ఎంత ప్రేమో. ఆ మాదిరి, పెద్ద కోడెపైనా, ఈ దేశిపు దూడపైన చిన్నోనికి అంతప్రేమ" అనుకుంటూ మట్టితొట్లో వున్న నీటితో చేయి కడుక్కోసాగింది బాలమ్మ.

"వరే... పెద్దకోడే... ఏమిరా... నీతో ఆడుకోలేదనా అట్ల చూస్తావుండావు" తనవైపే చూస్తున్న పెద్దకోడె వైపు నడిచి దాని ముఖాన ఒక ముద్దు పెట్టి "వీడు చిన్నోడు గదా. వాడితో ఎవురాడుకుంటారు. వీన్ని ఆడించింతర్వాత నీతో ఆడుకుంటాలే" అని, అక్కడే ఒకచోట దేశిపు దూడను వదిలాడు బాలయ్య. కొంతదూరంలో నిలబడి, "వరే లచ్చుమన్నా... రా...రా... నాతో జట్టుకట్టేట్టుంటే నా దగ్గిరికి రా. వచ్చి నా మూతిలో మూతిపెట్టి ముద్దియ్యి" అన్నాడు.

అది కదల్లేదు.

"ఏమిరా... నామాట వినవు" బుంగమూతి పెట్టి అన్నాడు.

"వొరే సిన్నబ్బా... దానికి కొత్త కదరా... మొర్సుకోవద్దుగానీ... మెల్లిగా నేర్పించుకో..." అంటూ పెరట్లోనుంచీ వెళ్ళిపోయింది భాగ్యమ్మ.

బాలయ్య ఆ తర్వాత దాని చెవులు పట్టుకొని అటూ ఇటూ తలూపి 'నేను చెప్పినట్టు విను... ఇట్ల తల అడ్డంగా ఊపితే లేదు, ఇట్ల నిలువుగా ఊపితే అవును' అని దానికి నేర్పించసాగాడు!

అలా కొంతసేపు దాంతో ఆడడం పూర్తి చేసి పెద్ద కోడెను విప్పుకొని వచ్చి "లచ్చుమన్నా, వీడు చూడు నాతో ఎట్లా ఆడుకుంటాడో చూడు. చూసి నేర్చుకో" అంటూ కోడెను అక్కడ వదిలిపెట్టి దూరంగా నిలబడ్డాడు.

"వొరె పసికోడె (తెల్లటి కోడె) మనం కబడీ ఆడుదామా" అన్నాడు. పసికోడె సరేనన్నట్లు తల ఊపింది.

బాలయ్య 'భళిచుప్లాం గుడుగుడు' అంటూ దాని ముందరికి వెళ్ళి దాని వెనక భాగాన్ని తాకాలని ప్రయత్నం చేయసాగాడతను. కానీ ఆ కోడే వెనక్కి వెనక్కి కదుల్తూ, అతని ప్రయత్నాన్ని అడ్డుకోసాగింది. కొంతసేపటి తర్వాత అతను మళ్ళీ వెనక్కి వచ్చి 'ఇంక నువ్వురా' అన్నాడు.

అది కదల్లేదు.

"రే... పసికోడే... రా... రా" అంటూ చప్పట్లు కొట్టాడు. అతనలా చప్పట్లు కొడుతూ పిలుస్తుంటే అది మెల్లగా కదలి, బుస్ బుస్మంటూ గాలిని వదుల్తూ, అతని ముందరికొచ్చి చెవులను టపటమని ముఖానికేసి కొట్టుకుంటూ నిలబడ్డది.

"వావ్... భలే" అంటూ వెళ్ళి దాని కౌగిలించుకొని ముద్దు పెట్టుకున్నాడు.

దూరంనుంచీ చిలకల తట్టలో విరిగిన ఇనప సామాన్లను పరిశీలిస్తూ అదంతా గమనిస్తున్న బీశేరయ్య చిన్నగా నవ్వుకొని "గంగెద్దులోళ్ళకు పశువులూ కుటుంబ

సభ్యులే. అందుకే అది బాలయ్యతో ఆడుకుంటా వుంది. వాడు అది చిన్నగా వున్నప్పట్నుంచీ ఇట్టనే గదా దాంతో ఆడుకుంటున్నాడు. అది గంగెద్దుకు తమ్ముడైతే, దానికి తమ్ముడు వీడు" అనుకుంటూ వుండిపోయాడు

ఇంతలో దేశవుకోడె చెంగున ఎగిరి దూకుతూ చుట్టింట్లోకి వెళ్ళింది.

"రే లచ్చుంగా... బయటికిపో. పనుల కడ్డం" అంది భాగ్యమ్మ. అయినా అది పోలేదు. భాగ్యమ్మ పైటను అది నోటితో పట్టుకొని గడ్డి చప్పరించినట్టు చప్పరించింది.

"ఏంగావాల్రా నీకు? " దానివైపు ముదిగారంగా చూసి పైటను వెనక్కి లాక్కుంది.

"ఏమిరో... గంగెద్దలోడా" కొట్టంలో నుంచీ వస్తూ పిలిచాడు ఆ ఊరి రైతు చెంగారెడ్డి.

"ఏమన్నా" అంది భాగ్యమ్మ.

"సద్దచేన్లు కొయ్యాల. ఇద్దరు మనుషులు కూలికొస్తారేమోనని పిల్చుదానికొస్తి... ఏమన్నా వచ్చే ఉద్దేశం వుండాదా? " అడిగాడతను. కోడెను కొట్టంలో కట్టేసి దూడకోసం యింట్లోకి వెళ్ళాడు బాలయ్య. అప్పటికే దూడ నట్టింట్లో పడుకుంది. దాన్ని చూడనే చూశాడు చెంగారెడ్డి.

"ఏమోన్నా మా యజమానుడిని అడగాల... అక్కడుండాడు సూడు" అంటూ చితకల తట్టను తెస్తున్న బీశేరయ్యను చూపించింది.

"ఏం బీశేరయ్యా, చేను కోసేదానికొస్తారా? " అడిగాడు.

"వస్తాంగానీ... మేం ఎన్నుతొక్కించేటప్పుడు మీ యద్దలబండియ్యాన్నా. బండకు ఎన్నుతోలాల, గుబ్బు తోలకరావాలగదా" అన్నాడు బీశేరయ్య,

"దానికేముందిలేబ్బా... మేం తొక్కించేదినం కాకుండా వుంటే చాలు, యిస్తాలే"

"సరే... ఇద్దరు మనుషులు లెక్కేసుకోపో"

"రేపు పొద్దన్నే అన్ని సద్దినీల్లు తాగేసి వచ్చేయండి. మద్దేనమూ పైటేల మేమే అన్నమేస్తాం"

"సరేలేన్నా" చితకలతట్ట, అటకలో పెట్టి వస్తూ అన్నాడు.

"అది సరే... ఆ దూడేంది నట్టింట్లో పొనుకునింది? " ఆసక్తిగా ఇంట్లోకి చూస్తూ అడిగాడు చెంగారెడ్డి.

అంతవరకూ నట్టింట్లో పడుకోనున్న దూడను బీశేరయ్య గమనించలేదు. అప్పుడు చూసి "ఓపినంత దుడ్డుపోసి, పరసలన్నీ తారాడి తెచ్చినా... యిప్పుడిది వీడి కంట్లో బడిందా... వీడు ఆ శంకర్రెడ్డిగాడి మనిషి... యింకేమౌతుందో ఏమో. నట్టింట్లో కోడె పడుకుంటే... యింకీ ఈ కోడె మనకు దక్కకుండా పోతుందేమో" పరిపరివిధాల ఆలోచిస్తూ... "లేదులేన్నా మాసిన్నోడు పట్టుకొచ్చినాడు. అదే వచ్చి పడుకోలా? " అన్నాడు.

"సరేబ్బా వస్తా" అంటూ వెళ్ళిపోయాడు చెంగారెడ్డి.

"మీకు బుద్ధిలేదా... దూడ నట్టింట్లో పొనుకోనుండేది వాడు చూసినాడు... దాన్ని బయటకన్నా తోలకూడదా. వీడు ఆ శంకర్రెడ్డివోడు. దీన్ని మనకు కానీకుండా

## కొత్తగాలి...

**అమ్మంటే**
**గుడిలో దీపం**
**బడిలోపాఠం**

**-పల్లి యాదయ్యయాదవ్,**
*గుండాల, నల్లగొండజిల్లా*

చేస్తారో ఏమో. పైగా రేపే కొలుపు... ఛత్" ఇంట్లో వాళ్ళపైన విసుక్కున్నాడు బీశేరయ్య. బాలయ్య దూడను లేపి పట్టు కొచ్చి పందిట్లో కూసానికి కట్టేశాడు.

"నట్టింట్లో దూడపొనుకుంటే ఏమౌ తుంది?" అనుకుంటూ అక్కడే వుండిపో యాడు బాలయ్య.




## వేడుక చేసే వేల్పులబీడు

ఆ రోజు శనివారం... దేవరెద్దుల వేలుపు దినం...

... ఉదయాన... బీశేరయ్య నివాస మున్న ఊరికి కూతవేటు దూరంలో వున్న ఘంటావారి పల్లెలో సందడిగా వుంది. నిజానికది ఘంటావాళ్ల పల్లెగా పిలవబడు తున్నా, ఆ ఊర్లో ఒక భాగమే. కాకపోతే చివరి ఇల్లయిన బీశేరయ్య ఇంటికవత లున్న గడ్డివాముల కవతల ఒక చిన్న వంక ఆ ఊరినీ ఈ ఊరినీ వేరుచేస్తోం దంతే... రాశింటి వెనక వున్న చింత చెట్టెక్కి గట్టిగా పిలిస్తే, ఆ ఊరి చివరింటికి తప్పక వినిపిస్తుంది. అందుకే... ఆ రెండు ఊర్లలోను ఆ రోజు సందడిగానే వుంది.

అన్ని యిండ్లముందర కళ్ళాపి చల్లి ముగ్గులు వేయబడ్డాయి... అందరూ ఉద యానే లేచి అన్ని పనులు మానుకొని యిండ్ల దగ్గరే వుండి తల స్నానాలు చేశారు.. ఎంతో భక్తిగా ఎద్దుస్వామి వేడు కల్లో పాల్గొనాలనే ఉత్సాహంలో మునిగివు న్నారు.

ఆ రోజు సాయంత్రం వేళకు... ఎక్క డున్న దేవరెద్దులూ... ఆ ఊరికుత్తరాన ఎద్దుల సమాధులున్న... బీడులోకి చేరు కుంటాయి. ఆ రోజు ఎద్దుదాసర్లని, గురు వెద్దుని ఎన్నుకుంటారు... ఆ గ్రామమంతా ఆ రోజు వేడుకే... చుట్టుపక్కలున్న జన మంతా ఆ వేలుపు చూడడానికి వచ్చి చేరి పోతారు.

ఘంటావారిపల్లె ఎద్దు... గత వేలుపుల గురువెద్దుగా ఎన్నుకోవడం వల్లా వేలుపు ఉత్సవాలు ఈసారికిక్కడ జరుగుతు న్నాయి... గురువెద్దు ఏ ఊర్లో వుంటే ఆ ఊరిలో మిగిలిన దేవరెద్దులన్నీ, అక్కడ జరిపే వేలుపోత్సవాల్లో పాల్గొంటాయి.

ఘంటావారి వీధి నుంచీ ఎద్దుస్వామి, ఆ ఊరిగుండానే వేల్పుల బీడుకు చేరుకో వాలి... ఎద్దుమోపు ఎత్తుకోవడాని... దారి పొడుగునా బట్టలు పరుస్తాడు ఊరి చాకలి... మరో చాకలి దివిటీ సిద్ధం చేసు కుంటాడు.

ఉత్సవం ప్రారంభమైంది.

దేవరెద్దును కట్టివేసే ఇల్లు... బాగా శుభ్రంగా... రకరకాల రంగు కాగితాలతో, పువ్వులతో, పచ్చని తోరణాలతో అలంకరిం చబడి వుంది. ఆ ఇంటి ముందర నిలబడి ఊరి మాదిగలు డప్పులు వాయిస్తూ, కొమ్ములు ఊదుతున్నారు... పంబలవాళ్ళు పంబలలు వాయిస్తుంటే తవటం వీరణాలను వాయిస్తున్నారు కొందరు.

నెమలికుచ్చులు వ్రేలాడదీసిన పిల్లనగ్రో వుల కోపెత్తారు మరికొందరు... ఇద్దరు పట్టుభత్రిలు పట్టుకొని నిలబడ్డారు...

కోపెత్తిన పిల్లనగ్రోవుల వాళ్ళు "బాలుడా బయ్యన్నా ఉయ్యాలో, నీ ఎద్దు బేరం జెప్పు వుయ్యాలో..." అన్న జానపద గీతం

ఆలపిస్తున్నారు. కొందరు కోలాటం వేస్తుంటే, మరికొందరు చెక్కభజన వేస్తున్నారు.

దేవరెద్దుకు పట్టు ముసుగులు వేసారు...

ముఖానికి, కాళ్ళకు పసుపు పూసి కుంకుం బొట్లు పెట్టాడు ఎద్దు దాసరి నాగరాజు...

ఆ రోజుతో నాగరాజు ఎద్దు దాసరి కొలువు పూర్తవుతుంది. వేలుపులో కొత్త దాసరి ఎన్నుకోబడుతాడు. అందుకే నాగరాజు చాలా ఉత్సాహంగా వున్నాడు. ఎంతో భక్తితోను ఉన్నాడు. పొద్దుటి నుంచీ ఉపవాసమే...

నాగరాజు ఎద్దుస్వామిని గుడిగా పిలవబడే ఆ యింటి నుంచీ వెలుపలికి తీసుకొచ్చాడు...

చాకలి ఓబన్న ఉతికిన చీర నేలపైన పరిచాడు...

జనం ఒక్కుమ్మడిగా ముందుకు దూకారు.

ఎద్దును కాలు కిందపెట్టనియ్యడం లేదు... మెల్లగా దాని శరీరాన్ని ఎత్తి పట్టి... చాకలి పరచిన చీరపైన నడిపించసాగారు...

ఎద్దు కదిలింది. కోలాహలం మిన్నుముట్టింది. గోవింద నామస్మరణంతో ఆ ప్రాంతం దద్దరిల్లింది.

సర్పంచి శంకర్రెడ్డి ముందు నిలబడి అందరికీ సూచనలిస్తున్నాడు. చాకలి ఓబన్న మార్చి మార్చి గుడ్డలు పరుస్తుంటే... ప్రజలు పట్టిమోపెత్తి సహకరిస్తుంటే... ఎద్దు, వేల్పుల బీడువైపు నడవసాగింది. అదొక విశాలమైన బైలు ప్రదేశం... దానికొక వైపున ఒక చిన్న రాళ్ళగుట్ట... ఆ గుట్టకు మొగదల... రెండు సమాధులున్నాయి.

ఆ సమాధులకు ఒక పాతకాలం నాటి మర్రిచెట్టు నీడనిస్తోంది... దేవరెద్దు నేరుగా అక్కడికి కదిలింది.

డప్పులవాళ్ళు పలకలు కొడుతూనే వున్నారు. పంబలలు మోగుతూనే వున్నాయి. తవటం దణం దణం అంటూ వినిపిస్తోంది. కొమ్ములు భూంభూం అంటూ ఉరుముతున్నాయి...

ఎద్దుదాసరి నాగరాజు సమాధుల దగ్గరికి రాగానే ఎద్దునాపాడు. జనమంతా అక్కడ మూగిపోయారు.

"అందరూ సూడండి. ఇవి... ఇంతకు ముందు మన గ్రామంలో పుట్టి మనల్ను కాపాడుకొచ్చిన దేవరెద్దుల సమాధులు... ఎన్నో తరాలనించీ ఎన్నో ఎద్దుస్వాములు... ఇక్కడే సమాధి అయ్యాయి. రెంటికి మాత్రమే సమాధి కట్టారు... ఈ సమాధుల కవతల... మన వేల్పుల్ని, మన పూర్వీకులు యిక్కడ సమాధి చేశారు... ఈ స్వామిని వీటి చుట్టూ తిప్పి, ఇక్కడ పూడ్చిన ఎద్దు స్వాముల్ని గెవనానికి తెచ్చుకోవాల... యింకరండి" అంటూ వాటి ప్రాముఖ్యత గురించి చెప్పి, నాగరాజు దేవరెద్దును, ఆ మర్రిచెట్టు చుట్టూ మూడు చుట్లు తిప్పి, ఆ తరవాత వేల్పుల బీట్లో, చాకలి ఓబన్న పరచిన గుడ్డలపైన వదిలేశాడు. ఆ ఎద్దు ఆయాసపడుతూ తన పొడుగాటి కొమ్ముల్ని ఊపుకుంటూ వెళ్ళి ఆ గుడ్డలపైన పడుకుంది.

"కన్నెస్వాముల్ని... పిలవండి"

ఎద్దుతోబాటు అక్కడికి చేరుకున్న శంకర్రెడ్డి అన్నాడు. గొల్ల సుబ్బయ్యా ఒక ఆరుమంది పన్నెండు నుంచీ పదహారేళ్ళలోపు మగపిల్లల్ని పిల్చుకొచ్చాడు. వాళ్ళల్లో బాలయ్యా కూడా వున్నాడు.

"వీళ్ళని తీసకెళ్ళి ఆ పక్కనుండే బాయిలో మునిగించి తడి బట్టల్తో తీసకరావల్ల... తీసకొచ్చి ఎద్దుదేవర ముందర కూర్చోబెట్టి పంబల వాయిస్తే, ఆ దేవుడు

ఎవరికో ఒకరికి, వళ్ళు మీదికొస్తాడు... అడిగింది చెప్తాడు..." అన్నాడు సుబ్బయ్య.

"సరే. అయితే నువ్వు వాళ్ళను బాయి కాడికి తీసకపోయి రాపో... అంతలోపల నేను ఫలం, తాంబూలం సిద్ధం చేస్తాను" అన్నాడు శంకర్రెడ్డి, వెనకనే వున్న చెంగా రెడ్డి.

సుబ్బయ్య వాళ్ళను తీసుకెళ్ళి పక్కనున్న కపిలబావిలో స్నానం చేయించి, తీసుకు వచ్చి ఎద్దుముందర వరుసగా కూర్చోబెట్టాడు. అలా కూర్చొన్న వాళ్ళ అరచేతుల్లో ఆకూ వక్కా, ఒక అరటి పండు చొప్పున పెట్టి 'వరే... యింక మీరు కండ్లు మూసుకోండి.... వెంకటేస్సుని మారు రూపమైన మన ఎద్దుసామి ని మనసులోనే నింపుకోండి... కొంతసేపటికి ఎవురికో ఒకరికి సామి పూనతాడు" అన్నాడు చెంగారెడ్డి.

చుట్టుపక్కల గ్రామాల్లో నివశించే రైతులు ఆ వేడుకని చూడ్డానికి పిల్లా జల్లల్తో సహా చేరిపోయి వున్నారు.

వాయిద్యాల హోరు హెచ్చింది.

కోలాటగాళ్ళ కోపులు, పిల్లంగట్టెలవాళ్ళ కోపులు, చెక్కభజనల వాళ్ళ పాటలు మిన్నుముట్టాయి.

"సామీ... ఎంకటేస్సుడా... రా... ఈ కన్నెసాముల మిందికి ఎవురికో వొగరి మిందికి రా... రా" దాసరి నాగరాజు దేవరెద్దును వేడుకుంటున్నాడు... పంబలవాళ్లు కల్లుతాగి వచ్చారేమో మరీ రెచ్చిపోయి వాయిస్తున్నారు.

సరిగ్గా అదే సమయంలో రాముడు, గూకా చెంగడు, కనకయ్య మాట్లాడుకుంటూ బయలుదేరారు.

"వొరే.. మనదేవరెద్దు ముసిల్దయిపోయింది గదా. యిది చచ్చిపోయింతర్వాత... యింకో దేవరెద్దును యాడినించీ తెస్తార్రా మనూరోళ్ళు"

"యాడనించో తేరురా... ఈ పక్కనే

## కొత్తగాలి...

**పిల్లస్కూలు మానేసింది**
**కడుపునొప్పో**
**తలనొప్పో కాదు**
**టీవి జ్వరం**

*—యలమర్తి అనూరాధ, పెనుగొండ*

యాడనో వొగసాట, ఎద్దుస్వామే తన వారసున్ని పుట్టించుకుంటుందట"

"అవును... యింతకుముందు కూడా అంతేగదా... యింతకుముందు ఈ ఊర్లో యింకా పెద్దఎద్దుండే. అది సచ్చిపోయినప్పుడు నేను చిన్నపిల్లోణ్ణి. నాకు యింకా బాగా గుర్తు... ఆ ఎద్దు యింక వారానికి సచ్చిపోతుందనంగా ఈ ఎద్దు ఘంటా వాళ్ళ యింట్లో పుట్టింది"

"అది సరే... కాబోయే దేవరెద్దును ఎట్ల కనుకుండేది? "

"వొగరు కనుక్కునే పని లేదురా... ఆ దూడ పుట్టగానే, తల్లి ఆవు మట్టు నాకి శుభ్రంచేస్తాది గదా. అట్ల మట్టు ఆరకనే ఆ దూడ పాలు గూడా తాక్కుండా నేరుగా బొయ్యి నట్టింట్లో పొనుకుంటుందట. తరిమినా గూడా పోదంట. అదే దేవరదూడ"

"యింకొన్నిచోట్ల... కొంచెం పెద్దదయినాకా దూడ యిండ్లల్లో పొనుకుంటుందట... అప్పుడు దాన్ని దేవరెద్దుగా గుర్తుపట్టాల"

"నిజమే... ఏ ఊర్లో పుట్టున్నా... అది ఎక్కడైతే దేవరెద్దుగా బతకాల్నో అక్కడికి ఏదో వొగయిదంగా చేరుకుంటుందంట"

"మరి దేవరెద్దంటే ఏమి సామాన్యమా... ఆ పరమాత్ముడు ఎద్దుగా పుట్టి, అందరి దెగ్గిరా పూజలందుకుంటా ఊర్ని

కాపాడుకొచ్చే యిలవేల్పుగదా"

ఇలా మాట్లాడుకుంటూ వేల్పుల బీడుకు చేరుకున్నారు. వరపడి కూర్చోనున్న కన్నె స్వాములు అలాగే కూర్చోనున్నారు. ఇంకా ఎవరి వంటిపైకి దేవుడు ఆవహించినట్టు లేదు.

"ఇంక ఎంతసేపున్నె అంతేగానీ లేపం డబ్బా పిల్లోళ్ళను" అంటున్నారెవరో...

ఆ మాటతో అందర్నీ లేపి ఒక్కొక్కరినే ఎద్దుకింద ఈ పక్కనుంచీ ఆ పక్కకు కాళ్ళ సందున, కడుపుకింద దూరిపోండని చెప్పి నాగరాజు దూరపించాడు.

సరిగ్గా అప్పుడే ఆ బీడుకు ఉత్తరం పక్క నున్న కమ్మపల్లెకు పోయేదారిలో పెద్దఎత్తున టపాసులు పేలాయి. తారాజువ్వలు ఆకాశానికెగిశాయి.

"కోబిలే... కోబిలే" అంటూ కేకలు వినిపించసాగాయి.

"వొరే.. ఎర్రావాండ్ల పల్లెనుంచీ ఊదే మాణిక్యం మాదిగోళ్ళ దేవరెద్దు వస్తావుండాది" ఎవరో అక్కడున్న జనాలనుంచీ అరిచారు.

ఆ మాటతో కొందరు పలకలవాళ్ళను ఎదురుకోలు పోండని పంపించాడు నాగరాజు.

అంతవరకూ అక్కడ వాయిస్తున్న పలకలవాళ్ళు, కొందరు అటువైపుకు పరుగులు తీశారు...

అప్పటికి సరిగ్గా సాయంత్రమైంది.

అంతవరకూ ఆ వేడుక చూసిన చాలా మంది పల్లె జనంతో బాటుగా... సూర్యుడు గూట్లో పడిపోయాడు.

"ఒరేయ్... పెట్రోమాక్స్ లైట్లు సిద్ధం చెయ్యండి" అరిచాడు శంకర్రెడ్డి.

మంగళంపేటనుంచీ బాడుగకు తెచ్చిన పెట్రోమాక్స్ లైట్లు... ఒక్కొక్కటే వెలగసాగాయి.




ఉర్రి ఉర్రి ఉరికి చూడు

మరునాడు ఉదయానకంతా మరో రెండు దేవరెద్దులు వచ్చాయి. అందులో ఒకటి పీలేరు దగ్గరుండే అరవోళ్ళ పల్లె నుంచీ వచ్చింది. అది పాలఏకిరి కులస్తులది. మరొకటి చిత్తూరు దగ్గరున్న బొమ్మ సముద్రం నుంచీ వచ్చింది. అది పల్లెరెడ్లు నిలుపుకున్న దేవరెద్దు.

మూడురోజులు జరిగే వేల్పుల ఉత్సవంలో అది రెండోరోజు.

ఆరోజు గురువెద్దును ఎన్నుకునేరోజు.

ఊర్లో జనం... వేల్పులబీడు దగ్గరే వున్నారు.

ఉదయమంతా పనులు చూసుకుని మధ్యాహ్నం నుంచీ అక్కడ చేరిపోతున్నారు...

బీశేరయ్య గంగెద్దు ముందర, దేశిపు దూడ ముందర అంత పచ్చిగడ్డి పడేసి "ఓమ్మి... గొడ్లకు అంత తండో, వరిగెడ్డో ఏదో ఒకటి వేయండి" అని కేకేసి... వేల్పుల బీడుకు బయలుదేరాడు.

కనకయ్య, మునస్వామి, బాలయ్యలు ఎప్పుడో వెళ్ళిపోయివున్నారు.

"ఓన్నో... వొగమాట" ఇంట్లో నుంచీ వీధిలోకి వచ్చిన బీశేరయ్యను పలకరించాడు కఠారి రాముడు.

"ఏమిరా రాముడూ" వెలుతున్నవాడల్లా ఆగి అడిగాడు బీశేరయ్య.

"మా ఆవు ఫలమైందన్నా... మీ పెద్ద కోడే బాగుందికదా. గుబిలి కోడె

మాదిర్తో... దాన్ని తీసకపోయి దాటిద్దా మని... తోలకపోయేదా? " వచ్చినపని చెప్పాడు రాముడు.

"యాడబ్బా... ఆవుల్ని కట్టించేదానికి మేము గొడ్లనియ్యంగదా" అన్నాడు బీశేరయ్య.

అప్పుడే ఒక చెక్కుడు పారను, తట్టను ఎత్తుకొని వచ్చి "నేను గొడ్లకు అంత పచ్చి గెడ్డి చెక్కోనొస్తా..." అంటూ బీశేరయ్యకు చెప్పి చక్కా వీధింటి వెళ్ళిపోయింది బాగ్యమ్మ.

"యేమన్నా గొమ్మునుండిపోతివి? "

"యాఁడ్రా... వొగసారి గనుక కోడెదూడలు ఆవుల దాటుకు మరిగినాయంటే మళ్ళ మన మాటింటాయా? "

"నేనేమి గెంగెద్దునియ్యమనలేదన్నా... మీ కోడె దూడనియ్యమన్నా. అంతే... ఎంతసేపన్నా... వొగ్గెంట, అంతే..."

"అదిగాదురా... ఇట్ల ఆవలమిందికి గొడ్డునిస్తాపోతే అది తుస్సు పిఁర్రలు పడిపోయి... ఆపైన ఏ పనికేమి వంగతాది"

"లేదులేన్నా... అంతమాత్రం కంటికి నదురుగా కనిపించే గొడ్డు ఊర్లో యాడిదన్నా. అందుకే వస్తి"

"సరే. నేను వేల్పుల బీడుకు పోతావుండా గానీ... తోలకపోయి మళ్ళా ఆడనే కట్టెయ్యి" అని చక్కగా వెళ్ళిపోయాడు.

అప్పటికే రాముడి తండ్రి ముత్తయ్య ఆవును పట్టుకొచ్చి వీధిలో నిలబడ్డాడు.

రాముడు నేరుగా కొట్టంలో దూరి ఇంటి పెరట్లోకి వెళ్ళాడు. గంగిరెద్దు నెమరేసుకుంటూ కనిపించింది... అలాగే వచ్చి గొడ్లకొట్టంలోకి తొంగి చూశాడు... ఆవులు లేవుగానీ సేద్యపుగొడ్లు, రెండు కోడెదూడలు నిల్చుకోనున్నాయి... అతని మనసులో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది. నేరుగా చుట్టింట్లోకి వెళ్ళాడు.. చుట్టింట్లో కనకమ్మ ఒకటే వుంది...

"ఏమ్మి కనకా... యింట్లో ఎవురూ లేనట్టుండాది" అన్నాడు ఆమెనే చూస్తూ...

"ఏమయ్యో... నేరుగా యింట్లో కొచ్చేస్తివి... మావోళ్ళు జూస్తే యింకేమన్నా వుండాదా? " కాస్తా భయపడుతూ అంది.

"ఎవరూ లేరులే..." అంటూ నేరుగా వెళ్ళి ఆమె బుగ్గపైన చిటికేశాడు. "ఆఁ... తియ్యి... భలే మొగోడివి గానీ..." దూరంగా జరిగింది కనకమ్మ.

"నేనింత కేరతావున్నా... · దూరదూరంగా పోతావే" ఆమె కళ్ళలోకే చూస్తూ అన్నాడు.

"అయినా యిప్పుడు మా యింటికెందు కొచ్చినట్టు"

"మా ఆవు ఫలమైంది... మీ కోడెను తీసకపోదామనివస్తి... మీ బావనడిగినానులే..." వచ్చిన పని చెప్పాడు.

"సరే. నాకు దారిడిసి పెట్టు... గొడ్లకు గెడ్డెయ్యాల..." చిరుకోపం నటిస్తూ అంది.

"గెడ్డి తెచ్చేదేడ. ఆడనేగదా"

"ఆఁ... ఆడనేలే... అంతమాత్రం తెలుసుకోలేదు మొగోడు సరే. పదాపదా. ఎవరన్నా చూస్తే బాగుండదు" బలవంతంగా యింటి బయటికి నెట్టేసింది.

"అంతమాత్రం సందిడిసినావు సాల్లే..." ఆమె అన్న మాటలకు పరోక్షంగానే బదులిస్తూ గొడ్లకొట్టంలోకి వెళ్ళి పెద్దకోడెను విప్పుకొని వీధిలోకొచ్చాడు.

వీధిలో వున్న కుర్రకారు కొందరు అక్కడికొచ్చి నిలబడ్డారు...

ముత్తయ్య కోడెదూడ ఆవు దగ్గరికి రాగానే 'ఉర్ర్.. ఉర్ర్రి' అని నోటితో శబ్దం చేస్తూ కోడెను రెచ్చగొట్టాడు.

అది మెల్లగా అక్కడున్న ఎర్రావు దగ్గరికి కెళ్ళిదాని మూతిలో మూతి పెట్టి ఏదో సంభాషించినట్టు పళ్ళు చూపిస్తూ బుసకొట్టింది.

రాముడు... "ఎనిక్కిరాయే... ఉర్రి..

ఉర్ర్రి" అంటూ అరిచాడు. అక్కడ చేరిన యువకులు 'ఉర్రి' అని అరవసాగారు.

సరిగ్గా అప్పుడే కనకమ్మ వాళ్ళను దాటు కొని మెల్లగా ఊరి చివరున్న వాములవైపు నడిచింది.

రాముడు, అమెను చూసి మెల్లగా నవ్వాడు. ఆమే మెల్లగా నవ్వుకుంటూ ముందుకు వెళ్ళిపోయింది. అమె అటు వామెలవైపుకు వెళ్లిపోగానే రాముడు "నాయనా... నువ్వు చూస్తావుండు. నేను మళ్ళా వస్తా... కోడెను మూడుసార్లు దాటించు వచ్చేస్తా" అని తానూ తననెవ రైనా గమనిస్తున్నారేమెనని అటూ ఇటూ చూసుకుంటూ వామెలవైపుకు నడిచాడు.

ఉదయం పందిరికేసిన నిచ్చెన అలాగే వుంది,... మెల్లగా కనకమ్మ దాన్ని రెండు చేతుల్తో ఒక్కసారి సరిచూసింది.

"ఓమ్మి... కనకా గెడ్డికొస్తివా? " కాంక్షగా చూస్తూ అన్నాడు ఆతని మాట లకు, చూపులకు ఒక్కసారి కనకమ్మ గుండె జల్లుమంది. అనుకోకుండా ఆమె మనసులో చిన్నపిల్లల బొమ్మ ప్రత్యక్షమ య్యింది. పేరంటానికి వెళ్ళినప్పుడు ఆడ వాళ్ళు అన్న 'గొడ్రాలు' అన్నమాటా చెవుల్లో ప్రతిధ్వనించింది.

"ఏమయ్యా నేనొచ్చినప్పుడే నువ్వు గెడ్డికొ స్తావు. నీకింకేం పనిలే" అంది.

"నువ్వన్న మాటలకు అర్థం తెలీనంత దద్దమ్మను కానుగానీ... రా..." అంటూ చేయి పట్టుకున్నాడు.

"వదిలయ్యా... ఎవురన్నా చూస్తే నా సంసారం బండలైపోవును" చేయి విదిలిం చుకుంది.

"ఎవ్వురూ రారులే... అందురూ వేల్పుల బీడుకు పోయినారు. ఉన్న ముసలీము తకా, పిల్లోళ్ళు ఈదిలో కట్టు సింగారం జూస్తా వుండారు" అంటూ వాటే సుకొని, తమ వరిగెడ్డివా మెవున్న పందిరిపైకి ఆమెను తీసుకుపోయాడు. చుట్టూ ఎత్తుగా గడ్డివా ములే... ప్రపంచమే కని పించడంలేదు.

"ఇక్కడ ఎవరికీ కనిపిం చదు. ఎవ్వరూ రారు" ధైర్యం చెప్పాడు.

వీధిలో... కనకమ్మ వాళ్ళ కోడె... మోపుగా ఒక్కసారి ఆవును దాటింది.

"ఛత్... సరిగా పడలే" అన్నాడు ముత్తయ్య...

మళ్ళీ ఉర్ర్ ఉర్రి అంటూ దాన్ని ప్రోత్స హించాడు...

ఆవు... కాస్తా గంజరం పోసింది... కోడె ఆ గంజరంలో మూతి పెట్టి నాలుక బయటకి సాచి కుర్రకుర్రమని శబ్దం చేసి ముందరి కాళ్ళు పైకెత్తి ఆవుపైనేసింది. ఆవు దాని ధాటికి ముడుచుకుపోయినట్టు శరీరాన్ని ఉగ్గబట్టింది.

## ఏం తెలివి?

**'కం**చెకు ఇటువైపు 12 గొర్రెలు ఉన్నాయి. అందులో ఆరు ఆవలికి గెంతి వెళ్లిపోతే ఇంకెన్ని ఉంటాయి?' అడిగింది టీచర్ రాజును.

'ఇంకేమీ ఉండవు' చెప్పాడు రాజు.

'నీకు బొత్తిగా లెక్కలు రావు' అంది టీచర్ కాస్త కోపంగా.

'టీచర్ మీకు గొర్రెల గురించి తెలీదు. ఒక్కటి వెళితే అన్నీ వెళతాయి' అన్నాడు రాజు.



"అబ్బా... భలే దాటిందిరా కోడే" ఎవరో అరిచారు. సరిగ్గా అప్పుడే గడ్డి పందిరిపైనా రాముడు కనకమ్మను ఆక్ర మించుకుంటూ. "ఆడ మా ఆవును మీ కోడేదాటతా వుండాది. ఇప్పుడు ఇక్కడ దానికి విరుద్ధంగా ఉండలేదా" అన్నాడు మత్తుగా...

ఆతని మాటలేవీ వినిపించుకోకుండా కనకమ్మ ఆతని చేతిలో పువ్వులా నలిగిపో యింది.

కొంతసేపటి తర్వాత...

బట్టలు సర్దుకొని పైకి లేచింది కన కమ్మ...

"య్యోవ్... రెండు వరిగెడ్డి కట్టలుతీసి, మా పందిరిపైనెయ్యి" అంది. రాముడు లుంగీ సర్దుకొని రెండు వరిగడ్డి కట్టలుపీకి, వాళ్ళపందిరిపైకి విసరివేశాడు.

కనకమ్మ మరో రెండు కట్టల్ని వామెలో నుంచీ లాగి కిందపడేసి పందిరి దిగి, ఆ కట్టల్ని భుజానేసుకొని చక్కా యింటిదారి పట్టింది. రాముడు వీధిలో కొచ్చేసరికి... కోడె ఎర్రావుని నాలుగైదుసార్లు దాటే సింది.

"యాడికి బొయింటివిరా రామా... పో... కోడెను తీసుకపోయి వాళ్ల కొట్టంలో కట్టేసొచ్చెయ్" అని ఆవును తోలుకుని తమ ఇంటివైపునడిచాడు ముత్తయ్య.

రాముడు మౌనంగా కోడెను తోలుకొని రాశింటి వైపు నడిచాడు. సరిగ్గా అప్పుడే మరో వైపునుంచీ పాలపకీరులు చిన్నగిరి నుంచీ మేళతాళాలతో దేవరెద్దును తీసుకు రాసాగారు.

ముందర పంబలవాళ్ళు, పలకలవాళ్ళు తమ వాద్యాలు వాయిస్తూ వస్తుంటే వాళ్ళ వెనక దేవరెద్దుకు ముందు, ఆ ఎద్దును కన్న ఆవు వస్తోంది. దానికీ పట్టువస్త్రాల ముసుగులు వేశారు... దానివెంట దేవ రెద్దు వస్తోంది.

వాళ్ళఎద్దు ఊరేగింపు అందరూ చూస్తుండంగానే వేల్పుల బీడువైపుకు సాగి పోయింది.

ఆ ఎద్దు తర్వాత బందార్లపల్లె నుంచీ కాపోళ్ళు, ఊటొంకనుంచీ బలిజోళ్ళు తమ తమ ఎద్దుల్ని తోలుకొని వేల్పుల బీటికి వచ్చేశారు. అన్ని దేవరెద్దులు చేరేటప్పటికి సాయంత్రమైపోయింది.

అలా ఏడెనిమిది దేవరెద్దులక్కడ కొలువు తీరాయి. ఆ వేడుకల్ని చూడడా నికి చుట్టుపక్కల పల్లెల జనం చేరిపోయి వున్నారు. వేల్పుల బీడులో పదిపదిహేను పెట్రోమాక్స్‌లైట్లు వెలుగుతున్నాయి. వాటి తోబాటు ఆయా ఎద్దుల వెంట వచ్చిన చాకళ్ళు వెలిగే దివిటీలపైన చమురు పోస్తూ నిలబడివున్నారు.

అందరి వాద్యాలతో ఆ ప్రాంతం హోరె త్తిపోతోంది.

"ఏంగంగెద్దలాయనా... శ్యానాదినాలైపా యనే కనిపించి" అప్పుడే ఒకరాతి తిన్నె పైన కూర్చొని వున్న బీశేరయ్యను పలుక రిస్తూ అక్కడికి వచ్చాడు కమ్మపల్లె చిన్నబ్బ.

"యాడబ్బా... తీరుబాటేలే... నువ్వేమో యాడ కనిపించలేదు" అడిగాడు బీశే రయ్య.

"ఎద్దులబేరం బొయింటి. సరేగానీ... మనం పుంగునూరు పరసలో పట్టుకొచ్చిన దేశిపుదూడ యెట్టుంది"

"బాగానే వుండాదబ్బా..."

ఆతని పక్కనే సర్దుకొని కూర్చొంటూ

"అన్ని వేల్పులూ వచ్చేసినట్టేనా?" అని అడిగాడు బీశేరయ్యను.

"అన్నీ వచ్చేసినాయి... జిల్లేళ్ళ మంద ఎద్దురావాల... అది గత అయిదారేండ్లుగా రావడంలా"

"ఎందుకనీ?"

"ఎందుకో తెలీదు..."

అన్నిట్టు గుర్తుకొస్తావుండాది. మొన్న రాయసోటిలో జరిగిన ఎద్దుల పరసకు పోయింటి... అప్పుడు... మా ఊర్లో గంగారపు దామోదర నాయుడోళ్ళకు ఎద్దుల్ని జూస్తా జిల్లేళ్ళమందుకు కూడా పోయింటిమి"

"అయితే ఆడ, దేవరెద్దును చూసి నావా?"

"ఆడ దేవరెద్దుంటే గదా సూసేదానికి?"

"ఏమైంది... ఇప్పుడు ఆ ఊర్లో దేవరెద్దులూ లేవు. ఆ ఆచారమూ లేదు"

"అయ్యో... ఒగప్పుడే జిల్లేళ్ళ మందలో గొప్ప ఎద్దుండె"

"ఉన్నింది నిజమే... అది సచ్చిపొయినాకా... ఆ తర్వాత ఎద్దేలేదు. అదే కడెద్దు"

"అట్టెందుకు జరిగింది?"

"ఏమోలేబ్బా... ఆ ఊర్లో... ఎద్దు సచ్చిపోతే... ఇక్కడ మాదిరే సమాధి చేస్తారు... ఆ చేసేటప్పుడు మాదిగోన్ని పిలిపించి దాని తలనుదీసి అక్కడే వుండే మర్రిసెట్లో పెడతారంట"

"అయ్యో... దేవరెద్దంటే సాక్షాత్తు పరమాత్ముడేగదా. అట్లా తల యెట్ల తీసేస్తారు?" అనుమానంగా ప్రశ్నించాడు బీశేరయ్య.



"అదేబ్బా... వాళ్ళ ఆచారమది. నేను గూడా... ఆ చెట్టును చూసినానులే. ఆ మాదిరి, ఆ చెట్లో పెట్టిండే దేవరెద్దుల పుణికేలు మూడు నాలుగు యింకా అట్టే వుండాయి".

"అందుక్కాబట్టే... ఆ ఊర్లో దేవరెద్దు లేకండా పోయింటుంది పో"

"ఉండచ్చు... ఆ ఊర్లో కొందరు అదే మాటన్నారు."

అక్కడ అంతవరకూ తుపానులా మ్రోగుతున్న వాద్యాల హోరు ఉన్నట్టుండి ఆగిపోయింది. దాంతోబాటు వాళ్ళ సంభాషణా ఆగిపోయింది.

అక్కడ పాండురంగ భజన ప్రారంభమైంది.

"జై విఠలనాధునికే"



గురువు అరిచాడు.

"జై" అన్నారు భజనకాళ్ళు...

"రంగ రారా. పండరినాధా రారా... పండరిభక్తుల మొరాలకించీ వేగా రారా"

గురువు కీర్తన అందుకున్నాడు.

భజనకాండ్రు అదేమడుగును పాడుతూ చేతిలో వున్న ఎర్రజండాల్ని కదిలిస్తూ అడుగేస్తున్నారు.

అలా వాళ్ళ భజన గంటసేపు సాగింది. ఆ భజన తర్వాత దేవరెద్దులు ఒకదాని వెంట ఒకటిగా, సర్కస్‌లో జంతువుల్లా బీడులో వరుసగా తిరగసాగాయి. ప్రజలు గోవిందనామాలు స్మరించసాగారు... మళ్ళీ వాద్యాల హోరు సముద్రఘోషలా విజృంభించింది.

అలా బీడంతా మూడుసార్లు తిరిగింతర్వాత అందరు ఎద్దుదాసర్లు మధ్యలో నిలబడ్డారు... అందులో ఒక దాసరి ఇలా చెప్పసాగాడు.

"మహాజనులారా... ఇక్కడ చేరిన వేల్పుల్ని చూసినారు. మొక్కుకున్నారు. ఈ వేల్పుల్లో బలమైన వేల్పు (ఎద్దు)ను గురువెద్దుగా నిర్ణయిస్తాము" అన్నాడు.

మరో దాసరి ముందుకు వచ్చి "ఇందులో వొగరి ప్రోద్బలం, మద్దతు ఏమీ ఉండదు" అన్నాడు.

మరో ఎద్దుదాసరి ముందుకొచ్చి "ఇది వేల్పుల ఆగ్నేగానీ మరొగటి కాదు" అన్నాడు.

"అన్ని ఎద్దుస్వాములున్న పరిచ్చగా చూసింతర్వాత ఈసారి బలమైన ఎద్దుగా చిన్నగిరోళ్ళ ఎద్దునే గుర్తించినాము. మేమే కాదు. మీరూ గుర్తించే వుంటారు. ఏకిల దొరలు బాగా మేపినారు. అంతేగాకుండా ఆ ఎద్దుసామి అమ్మను గూడా తీసకొచ్చినారు... వీళ్ళను జూసి తల్లిని ఎట్ల గౌరవించాలో జనాలు నేర్చుకోవాల"

ఒక సేవదాసరి సెలవిచ్చాడు!

అందరూ మరోసారి గోవిందలు పెట్టారు.

ఆ తర్వాత నాగరాజు ముందుకొచ్చాడు.

"మహాజనులారా... నేను రెండేండ్లుగా మన ఎద్దుసామికి సేవ దాసరిగా వున్నా... ఈ రోజుతో సామికి సేవ చేసుకునే కాలమైపోయింది. ఎద్దుసామి ముసిల్దయిపోయింది. రెండేండ్లబ్బుడు ఊటొంకలో జరిగిన వేల్పుల కొలువులో మనెద్దునే గురువెద్దుగా ఎన్నుకున్నారు... అప్పుడే నన్ను సేవదాసరిగా మనూర్లో ఎద్దుసామి నిర్ణయించుకునింది. రేపు ఎద్దుకు సేవదాసర్ని ఎన్నకునే యేడికుండాది. అప్పుడే మన ఎద్దుసామి... తన వారసున్ని గూడా మనకు సూపెడుతాది... రేపు గూడా అందరూ ఇదే మాదిరిగా వచ్చి ఆ యేడికను గూడా సూసి తరించండి..." అంటూ జరగబోయే కార్యక్రమాన్ని వివరించాడు.

"యింక మొక్కులు సెల్లించుకునే వోళ్లు సెల్లించుకోవచ్చు" అన్నాడు చిన్నగిరి ఎద్దు సేవదాసరి.

దాంతో పిల్లా జల్లా ఎద్దుల దగ్గరికి పరిగెత్తారు... వాటికి కొబ్బరికాయలు కొట్టేవాళ్లు కొడుతున్నారు. వాటి కడుపుల కిందదూరే వాళ్ళు దూరుతున్నారు...

బీశేరయ్యా చిన్నబ్బా లేచి గురువెద్దుకు మొక్కడానికి బయలుదేరారు.

"రేపు... మనూర్లో మరో దేవరెద్దు పుడతాది..." అని మనసులోనే అనుకుంటూ కసిగా వాళ్ళనే చూడసాగాడు శంకర్రెడ్డి.

చెంగారెడ్డి అతని చెవుల్లో ఏదో గుసగుసలాడుతూ చెవులు కొరకసాగాడు. కొంతసేపటి తర్వాత ఇద్దరూ నర్మగర్భితంగా నవ్వుకోసాగారు.




ఎద్దుదేవుడి ఎన్నిక

**వే**ల్పుల ఉత్సవంలో మూడోరోజు...

వివిధ ప్రాంతాలనుంచీ వచ్చిన దేవరెద్దులు తిరుగుముఖం పట్టాయి. వేల్పులకు వచ్చినందుకు ఆ ఎద్దులకు మంచి గడ్డిని, ఎద్దులవెంట వచ్చినవారికి మంచి భోజనవసతిని ఊరివారు బాగా సమకూర్చారు. అందరూ సంతోషంగా తిరిగి వెళ్ళారు...

ఆ రోజు సాయంత్రానికి అందరూ... తమతమ పనులు ముగించుకుని వేల్పుల బీడుకు చేరిపోయారు.

ఊర్లో వున్న ఆవుల్ని, దూడల్ని కూడా తోలుకొచ్చారు.

పంబల టంకుటంకుమని మ్రోగుతూనే వుంది. కొమ్ములు ఉరుముతూనే వున్నాయి. పలకలు వినిపిస్తూనే వున్నాయి.

వేల్పుల బీడులో గొడ్ల మధ్యన దేవరెద్దు... ఒంటరిగా నిలబడివుంది. సేవదాసరి నాగరాజు దీనవదనంతో నిలబడి చూస్తున్నాడు.

"రెండేండ్లుగా ఈ ఎద్దుస్వామిని కంటికి రెప్పలాగా కాపాడినాను. నా యింటి పశువుల్ని కూడా పట్టించుకోలా... స్వామికి సేవచేసే భాగ్యం దక్కిందనందుకు సంతోషించినా... ఎద్దుని వొగ తండ్రి మాదిరిగా సూసుకున్నా... యిన్నిరోజులూ ఎద్దుతో బాటు... దాని గుడిలోనే పొనుకున్న... ఈనాటితో ఈ ఎద్దుసామికీ నాకూ అనుబంధం తెగిపోతుంది గదా" తీవ్రంగా

ఆలోచిస్తున్నాడు నాగరాజు.

మళ్ళీ ఓ అయిదారుగురు కన్నెసాములు తడిబట్టల్తో ఎద్దుముందర కూర్చొని వున్నారు. వాళ్ళ చేతుల్లో నానబియ్యం, బెల్లం వున్న సత్తుప్లేట్లు పెట్టబడి వున్నాయి.

సర్పంచి శంకర్రెడ్డి, కేశవరెడ్డి, చెంగారెడ్డి కూడా అక్కడే నిలబడి ఆ వేడుకలో పాల్గొంటున్నారు.

"అయ్యలారా... ఎవురుగానీ సద్దు చెయ్యొద్దండి... ఇప్పుడు ఈడసేరిండే గొడ్ల ల్లోనుంచీ ఈ సామి తన వారసున్ని ఈడికి రప్పిస్తుంది... ఆ చిన్నసామి ఈ గొడ్లల్లోనే ఎక్కడో, ఒకసోట వుంటాడు. ఎవురింటి గొడ్డుకో పుట్టుంటాడు... ఫలార మెత్తుకోని ఈడ కూసోనుండే పిల్లోళ్ళ దెగ్గి రికి ఆ చిన్నసామి వస్తాడు... మనం తర మినాసరే... ఆ సామి ఎవురిదెగ్గిర్నో వగరి దెగ్గిర ఫలారం తింటాది. అట్ల తిన్నెదూడే మన చిన్నసామి. ఈ పెద్దసామి తర్వాత ఈ ఊరికి దేవరెద్దు అదే.

అది ఎవురి దగ్గర ఫలారం తింటుందో వోడే ఆ సామికి, ఈ సామికీ సేవదా సరి..." నాగరాజు వివరించాడు.

పంబలవాళ్ళు, జోరు పెంచారు... పల కల శబ్దం మిన్నుముట్టింది. జనం 'కోబిలి కోబిలి' అని అరవసాగారు. పిల్లంకట్టెల కోపు ఊపందుకొంది. అలా ఎంతసే పున్నా... అక్కడ తోలిన గొడ్లల్లో నుంచీ ఏ దూడా ముందుకు రాలేదు. దేవరెద్దూ కదల్లేదు.

అక్కడ కూర్చొని వున్న కన్నెస్వాముల్ని దోమలు కుట్టి కుట్టి చంపుతున్నాయి.

"ఏమన్నా... మనకింక దేవరెద్దు లేన ట్టేనా? " ప్రశ్నించాడు చెంగారెడ్డిని శంక ర్రెడ్డి.

"రావాల్సిన దూడను ఊర్లోనే కట్టేసు కుంటే ఎట్లా వస్తాది? " అన్నాడు చెంగా రెడ్డి.

తన పథకానికి రూపకల్పన చేసు కుంటూ శంకర్రెడ్డి నాగరాజు దగ్గరికి వెళ్ళాడు.

"వొరే నాగరాజు... కాబోయే దేవరెద్దు ఊర్లోనే వుండాదిరా" తన పథకానికి నాందీ వచనంగా అన్నాడు శంకర్రెడ్డి.

"యాడన్నా... ఎవురింట్లో" అడిగాడు నాగరాజు..

శంకర్రెడ్డి నాగరాజు చెవులో ఏదో చెప్పాడు. వాద్యాలహోరులో ఆ మాటలు వినిపించనేలేదు.

"ఓన్నా.. బీశేరన్నా..." గట్టిగా పిలిచాడు నాగరాజు. ఆ పక్కనే జనంలో కూర్చో నున్న బీశేరయ్య చూసి...

"యిదేదో నా కొంపకొచ్చేటిగా వుందే" అనుకుంటూ ఏమిటన్నట్లు చేత్తో సంజ్ఞ చేశాడు.

"ఇలారా" అని పిలిచాడు నాగరాజు.

లేచి వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు బీశేరయ్య.

"కాబోయే దేవరెద్దు దూడ... నట్టింట్లో బొయ్యి కూర్చోవడం చేస్తుంది. మీ యింట్లో దూడ అట్ల మీనట్టింట్లే కూసోనున్నిందంటనే" అడిగాడు నాగ రాజు.

ఆ మాట వినగానే గుండె గుబెళ్ళు మంది బీశేరయ్యకు. "లేదు సామీ.. మా యిండ్లల్లో గొడ్లన్నీ అట్టే చేస్తాయి. మేమట్ల తర్పీదు చేస్తాం" చెప్పాడు బీశేరయ్య.

"య్యోవ్... నేను చూసినాగానీ... ముందు ఆ దూడను పట్టకరాపో" అన్నాడు చెంగారెడ్డి.

"కాబోయే దేవరెద్దును అట్ల యింట్లో కట్టేసుకుంటే ఊరికి అరిష్టం... పో... పట్ట కరాపో..." అన్నాడు శంకర్రెడ్డి.

"య్యోవ్ సామీ... నీకేదన్నా పగుంటే నన్నొక దెబ్బకొట్టు. నేనేమీ అనుకోను.. ఇట్లా సెయ్యొద్దు" ఇదంతా శంకర్రెడ్డి

## కొత్తగాలి...

**అదిరిపడితే**
**అబల**
**ఎదురుతిరిగితే**
**సబల**

*–బద్ది నాగేశ్వరరావు,* అనకాపల్లి

కుట్రగా పసిగట్టిన బీశేరయ్య అన్నాడు.

"అయ్యయ్యో... ఇందులో నాదేముందిరా... మీ దూడ మీ నట్టింట్లో పడుకోనుండేది సూసినోళ్ళు సెప్పినారు. అది నేను సెప్పినా అంతే" మాటలకు దొరక్కుండా మాట్లాడాడు శంకర్రెడ్డి.

"లేదబ్బా... ఆ దేశిపు దూడను పట్టకరావాల్సిందే.. అది దేవరెద్దు కాకుంటే... ఇక్కడుండే అన్ని గొడ్లకు మాదిరే గొమ్ము నుండి పోతుంది గదా. భయమెందుకు?" అన్నాడు కేశవరెడ్డి.

"ఆఁ అవును... అదీ నిజమే.. పోన్నా... ఆ దూడను పట్టకరాపో" అన్నాడు నాగరాజు...

ఎద్దుదాసరి మాటకు ఎవరూ ఎదురు చెప్పరు. అదే ఆ ఊరి ఆచారం.

ఇక కాదనలేక వెళ్ళి బీశేరయ్య దేశిపు దూడను పట్టుకొచ్చి వదిలాడు.

అప్పుడు వాద్యాల హోరు ఎక్కువైంది.

ఇంట్లో నానబియ్యం తినే అలవాటున్న ఆ దూడ అలవాటు ప్రకారం నేరుగా వెళ్ళి బాలయ్య చేతుల్లోని ఫలహారం తినడం ప్రారంభించింది. ఆ దృశ్యాన్ని చూసిన జనం 'గోవిందా సామి ఎంకటేస్పుడా' అంటూ గోవిందలు పెట్టారు... బీశేరయ్య బిత్తరపోయి చూశాడు. కేశవరెడ్డి కసిగా చూస్తూ మీసం మేలేశాడు.

బీశేరయ్యకు దుఃఖం ముంచుకొచ్చేసింది. గబగబా వెళ్ళి "హాసే అన్నేకారి గొడ్డా... పో... పో" అంటూ తరిమాడు, కానీ అది పోలేదు. అతను ఎంత తరిమినా తిరిగి వచ్చి బాలయ్య చేతుల్లో నానబియ్యం తినసాగింది. పైగా బాలయ్య నెత్తిని ఆప్యాయంగా నాకసాగింది.

"ఇద్దో... మహాజనులారా మన స్వామి నిదర్శనం చూపించినాడు. తన వారసున్ని మనకు చూపించినాడు. అంతేకాదు సేవదాసరిగా బాలయ్యను నిర్ణయించుకునింది. ఇంకనుంచీ ఈ బాలయ్యే ఈ రెండు ఎద్దు స్వాములకు సేవదాసరి" గట్టిగా అరచి మరీ ప్రకటించాడు నాగరాజు.

బీశేరయ్య నోరెత్తలేకపోయాడు. కనకయ్య కూడా ఏమ్మాట్లాడాలో తెలీక అలాగే చూస్తుండిపోయాడు.

బాలయ్య లేచి దూడను కౌగలించుకొని "ఈ దూడను నేను యిడిసిపెట్టను. యిది నాది... దీన్ని దేవుడని సెప్పి నానుంచీ దూరం సెయ్యకండి" అని వలవలా ఏడవసాగాడు.

"హారేబ్బా... నీ దూడ యాడికీ పోదులే... నీతోనే వుంటాది. ఈ పెద్ద సామి సచ్చిపోయింతర్వాత... అది సామైతాది... అంతే. అంతవరకూ దీన్ని నువ్వే సూసుకోలే..." బుజ్జగిస్తూ అన్నాడు నాగరాజు.

జనం ఒక్కసారిగా ఎద్దు దగ్గరికి పరిగెత్తారు...

దూడను, దూడతోబాటు బాలయ్యను చేతుల్తో పైకెత్తి గోవిందలు కొట్టారు. ఉత్సాహంతో గంతులేశారు. ఆ తర్వాత ఒకరొకరే దేవరెద్దు కడుపుకింద దూరి, దాసరి ఆశీర్వాదం తీసుకొని తమ తమ ఇండ్లకు వెళ్ళిపోయారు.

శంకర్రెడ్డి విజయగర్వంతో బీశేరయ్యను ఒక్క చూపు చూసి "ఇంక రండ్రా" అంటూ కొడుకును, చెంగారెడ్డిని వెంటబెట్టుకొని ఠీవిగా నడుచుకుంటూ ఊరివైపు

వెళ్ళిపోయాడు.

బీశేరయ్య అక్కడే కూలబడిపోయాడు.



## పిడుగ్గొడితే...
## పులైనా పిల్లే

కలారి రాముడు, కనకమ్మ ఏ ముహూర్తాన కలుసుకున్నారోగానీ వాళ్ళ సంబంధం సజావుగా సాగిపోతూనే వుంది. గడ్డివాముల దగ్గర్నో, సజ్జ సేన్లల్లోనో, గొడ్లను తోలుకుపోయినప్పుడు చట్టుబండ దగ్గర్నో ఏదో విధంగా కలుసుకుంటూనే వున్నారు...

కానీ పెద్దకోడె మాత్రం... ఆవుల్ని చూసి రంకెవేస్తుంది. తోటి కోడెల్ని చూసి నేలకేసి కాలుగీరి పోట్లాటకు పిలుస్తోంది. దారం తెంపుకొని వెనక చేన్లల్లోకి పోతోంది. ముఖ్యంగా మేతకు తోలుకుపోయినప్పుడు ఎక్కడ ఆవులుంటే అక్కడికి పిచ్చిపట్టినదానిలా పరుగెడుతుంది. అది చూసిన బీశేరయ్య "దీనికి తొక్కల్లచ్చనం ఎక్కువైపోయింది. దీనికింక పెండ్లి చేయాల్సిందే" అనుకున్నాడు.

ఒకరోజు ఇంట్లో భోజనానికి కూర్చున్నప్పుడు "ఒరేబ్బా. కోడెకు పిడుగ్గొట్టాల. రేపేడికి పోబాకు" అన్నాడు కనకయ్యను చూసి. 'సరేన్నా' అన్నాడు కనకయ్య. ఆ మరునాడు చెంగారెడ్డి యింటికి వెళ్ళి 'పిడుగుకట్టెలు' తెచ్చినాడు. అవి బారెడు పొడ వున్న లావుపాటి దున్నికట్టెలు. వాటికి ఒక వైపున జానెడుకి పైన నులకతాడుతో బిగించి వున్నారు. అవి ఏనాటివో గానీ బాగా నునుపుదేలి తుపాకీకి వున్న గొట్టపు జతలా కనిపిస్తున్నాయి.

ఉదయాన సద్దన్నం తినేసి కోడెను వీధిలోకి పట్టుకొచ్చారు. నుసకడు వాళ్ళకు సాయంగా నిలబడ్డాడు. ఆ దృశ్యం చూడడానికి కూడా కొందరు వీధిలో పోగైపోయారు.

నుసకడు పగ్గం తీసుకుని ముందరికాళ్ళ వెనకవైపు నుంచీ, రొమ్ము మీదుగా ఒక కొసను కడుపు కింద వేసితీసి, పట్టుకొని బిగదీశాడు.

అంతలావు కోడే నాలుక బైటకు సాచి నీలిగి నేలపైకి వంగిపోయింది. కోడె నేలపైకి పడిపోగానే బీశేరయ్య, కనకయ్య వెళ్ళి ముక్కు తాడొకరు పట్టుకొని పైకి లేయకుండా అణగబట్టారు. మరొకరు దాని కడుపుమీద మోకాలు పెట్టి అదిమిపట్టారు.

నుసకడు నోటితో గిరికెవేస్తూ దాని పొట్టపైన చేత్తో తీడి బలమైన దాని బీర్జాలు పట్టుకొని పిడుగుకట్టె దూర్చి పట్టుకొన్నాడు. ఇప్పుడు కోడె బీర్జాలు పిడుగుకట్టె కింద వున్నాయి. పొట్టకు, బీర్జాలకు మధ్యనున్న చర్మం పిడుగుకట్టెలో ఇరుక్కొనుంది.

నుసకడు మెల్లగా బీర్జాలను పిడుగుకట్టెలో వేసి ముక్కలు ముక్కలు చేస్తూ చర్మాన్ని పైకి లాగసాగాడు. ఆ నొప్పికి కోడె నాలుక బైటకు సాచి, వెనక కాళ్ళు ఆడిస్తోంది. దాని కాళ్ళు తగలకుండా పొట్ట వైపున నిలబడి నుసకడు దానికి పిడుగు కొట్టసాగాడు. అలా పిడుగు కట్టెలో దూర్చి బీర్జాలను నలిపి దాని చర్మాన్ని పిడుకట్టెల సందులోనుంచీ రెండుసార్లు పైకిలాగేశాడు.

"అన్నా దీని బీర్జాలు కరిగిపోయి నీర్రై పోయినాయి. యింక రెండు రోజులు అవి వాచిపోయి క్రమంగా తగ్గిపోతాయి. ఆమింద నువ్వు చెప్పినట్టింటాది. ఆవు పక్కకొచ్చినా కన్నెత్తయినా సూడదు పో" అన్నాడు పైకిలేస్తూ.

బీశేరయ్య ముక్కుతాడు వదిలేసి... "హాయ్ హాయ్ లెయ్" అంటూ అదిలించాడు.

అది మెల్లగా లేచి వెనక కాళ్ళను బీర్జాల నొప్పికి వెడల్పుచేసి నడుస్తూంటే... బీశేరయ్య పగ్గం పట్టుకొని కొట్టంలోకి తీసుకుపోయాడు.

"నుసకా... పనిలోపని... ఇంకొగ కోడెను పట్టకొస్తాను. దానికీ అట్ట వట్టగొట్టి పెండ్లి చెయ్యబ్బా" అన్నాడు కనకయ్య.

"అంటే పాపంనాది, మేలు మీదన్న మాట. సరే. పట్టకరా. ఏంజేద్దాం" అన్నాడు నుసకడు.

కనకయ్య వెళ్ళి యింకో కోడెను విప్పుకొచ్చి నిలబెట్టాడు. బీశేరయ్య... పిడుగు కొట్టిన కోడెను లోపల కట్టేసి వచ్చి వాళ్ళతో చేరాడు. ఆ సమయంలోనే కఠారి రాముడు వచ్చి వాళ్ళతో చెయ్యి కలిపాడు.

ఈసారి కఠారి రాముడు కోడె రొమ్ముకు తాడు బిగించి, గొడ్డును నేలపైకి తోసి పిడుగు కట్టెను తీసుకొని, దాని బీర్జాలు నలిపి, దానికీ పిడుగ్గొట్టాడు.

ఆ దృశ్యం చూసిన నుసకడు "వీడి పాసులగోల. ఎంత నేర్పుగా పిడుగ్గొట్నాడు. ఆవలమందికి పోతాయని, అట్లా పోయే కోడెలు మనమాట వినవని వాటికి ఈవిధంగా పిడుగ్గొట్టి పెండ్లి చేస్తాం. అదే ఈ కఠారి రాముడికి బంగారట్ల భార్య వున్నా గుబిలికోడెమాదిరి ఊర్లో ఆడోళ్ళ మింద పడతాడు. గొడ్డుకొగ న్యాయం, మనిషికొగ న్యాయమా. వీడికీ పిడుగ్గొట్టేస్తే బాగుండు. అట్ల జేస్తే కొజ్జావోడు మాదిరి తిరుగును" అనుకోసాగాడు నుసకడు.




## కూటికోసం కోటి విద్యలు

**వే**ల్పుల వేడుక జరిగిన వారానికంతా... దేవరెద్దు చనిపోయింది. ఆ గ్రామమంతా శోకసముద్రంలో మునిగిపోయింది.

ఎద్దు కళేబరాన్ని ప్రజల సందర్శనార్థం... గుడి అనబడే ఎద్దు నివశించే ఇంటి ముందర పడుకోబెట్టారు.

పూలమాలల్తో ఎద్దు శవాన్ని అలంకరించారు.

ఎద్దు శరీరం చిన్నపాటి ఏనుగులా పడి వుంది.

ఆ ఊర్లోనేగాక చుట్టుపక్కల జనమంతా వచ్చి చూసి, దానిపైన అన్నిపూలు జల్లి మొక్కుకొని వెళ్ళిపోతున్నారు.

సేవదాసరి నాగరాజు ఏడుస్తూ దాని పక్కనే కూర్చోనున్నాడు. ఊరిపెద్దలు అక్కడే వున్నారు...

దేవరెద్దులున్న ఊర్లకు వర్తమానం పంపబడింది. ఆయా ప్రాంతాల ఎద్దు దాసర్లు, భక్తులు కూడా వచ్చి చూడసాగారు.

ఆరోజు సాయంత్రం వేల్పుల బీడులో... పాత సమాధుల పక్కనే పెద్దగొయ్యి తవ్వి ఎద్దును సమాధి చేసేశారు. ఆ మరునాడు దాని తలవైపున తులసి చెట్టు నాటి, అందరూ పాలు పోసి చిన్నకర్మ తీర్చారు.

# వెయ్యి భవంతుల రూపకర్త



1991లో 'అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అర్కిటెక్ట్స్' భవన నిర్మాణ సంస్థ 'ది గ్రేటెస్ట్ అమెరికన్ ఆర్కిటెక్ట్ ఆఫ్ ఆల్ ది టైమ్'గా ఫ్రాంక్ లాయిడ్ రైట్‌ని ఎన్నుకుంది. జూన్ 8, 1867లో విస్కాన్సిన్ రాష్ట్రంలోని 'రిచ్‌లాండ్ సెంటర్' అనే ఊరిలో పుట్టిన ఫ్రాంక్, అమెరికా, యూరప్, ఆసియాలో అనేక ప్రసిద్ధ భవంతుల నిర్మాణానికి రూపకల్పన చేసాడు. అలాంటి వాటిలో ఒకటి అలబామాలోని ఫ్లొరెన్స్ అనే ఊళ్లో స్టాన్లీ, మెల్రెడ్ రోజన్ బేమ్‌ల కోసం రూపొందించిన సింగిల్ ఫ్యామిలీ హౌస్. ఇలాంటివి 'రోజన్ బేమ్ హౌస్' పేరిట ఈనాటికీ అమెరికాలో అనేకం నిర్మితమవుతున్నాయి. ఈ ఇంటిని 1978లో నేషనల్ రిజిస్టర్ ఆఫ్ హిస్టారిక్ ప్లేసెస్ కింద తీర్మానించి, అమెరికా ప్రభుత్వం జాతీయ సంపదగా కాపాడుతోంది. 1935లో పిట్స్‌బర్గ్‌కి యాభై మైళ్ల దూరంలో ఫ్రాంక్ రూపొందించిన 'ఫాలింగ్ వాటర్' అనే మరో ఇల్లు ఓ చిన్న జలపాతం మీద నిర్మించబడింది. ఈ ఇల్లే అయాన్‌రాండ్ రాసిన 'ది ఫౌంటెన్ హెడ్' నవలకి పేరూ తెచ్చింది. అమెరికాలోని చారిత్రాత్మక ఇళ్ల జాబితాలో ఇది ఇరవై ఎనిమిదోది. ఫ్రాంక్ రూపొందించిన మరో గొప్ప భవంతి జాన్సన్‌వాక్స్ అడ్మినిస్ట్రేషన్ బిల్డింగ్.. సూర్యరశ్మి లోపల పడేలా పైరెక్స్ గ్లాస్‌ని కప్పుగా వాడిన తొలి భవంతి ఇది. మరో భవంతి, 'ది మ్యూజియం ఆఫ్ నాన్ ఆబ్జెక్టివ్ పెయింటింగ్'. న్యూయార్క్‌లో ఉన్న ఇది నేటికీ యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తోంది. గుండ్రటి అంతస్థులు గల ఈ మ్యూజియం సీలింగ్ కూడా పైరెక్స్‌తో చేసారు.



1966లో అమెరికా ప్రభుత్వం ఫ్రాంక్ లాయిడ్ రైట్ గౌరవార్థం విడుదల చేసిన తపాలా బిళ్ల బ్యాక్‌గ్రౌండులో మ్యూజియం ఉంటుంది. మొత్తం ఈయన చేపట్టిన వేయి ప్రాజెక్ట్‌లలో ఆయన జీవితకాలంలోనే ఐదువందలు పూర్తయ్యాయి. జపాన్ రాజధాని టోక్యోలో ఫ్రాంక్ రూపకల్పన చేసిన ఇంపీరియల్ హోటల్, అతని నైపుణ్యానికి మరో మచ్చుతునక. జపాన్‌లో భూకంపాలు అధికం. వాటిని తట్టుకుని నిలబడేలా ఫ్రాంక్ ఈ భవంతిని రూపొందించాడు. పునాదికోసం ఎనిమిది అడుగులు తవ్వితే నీరు ఊరేది. అరవై అడుగుల లోతు దాకా బురద నేలే. అందువల్ల ఆ హోటల్‌ని ఓడ ఆకారంలో నిర్మించాడు. గదులని రైలుపెట్టెలా డిజైన్ చేసాడు. భూకంపం వస్తే మొదట పాడయ్యేది నీటి గొట్టాలు, ఎలక్ట్రిక్ తీగలే కాబట్టి, వాటిని అడ్డంగా దండెంలా డిజైన్ చేయడంతో అవి భూకంప తీవ్రతకి తెగకుండా ఊగుతాయి. భూకంపం తర్వాత వినాశనానికి కారణం సాధారణంగా నిప్పు కాబట్టి, నీటి గొట్టాలు పగిలితే నిప్పుని ఆర్పేందుకు నీరు అందదు. అందువల్ల హోటల్ భవంతి పక్కన పెద్ద ఈత కొలనుని ఏర్పాటు చేసాడు ఫ్రాంక్.

సెప్టెంబర్1, 1923న టోక్యో భూకంపంవల్ల, నగరం తగులబడి 1,40,000 మంది ప్రజలు మరణించారు. అమెరికన్ దినపత్రికలు ఇంపీరియల్ హోటల్ నాశనమైందన్న వదంతులని ప్రచురించదలచుకున్నాయి. ఆ సంగతి తెలిసి ఫ్రాంక్, సవరణ వార్తని తర్వాత వేయచ్చని, తను డిజైన్ చేసిన హోటల్ ఎట్టి పరిస్థితితో పాడవ్వదని చెప్పాడు. అలాగే ఇంపీరియల్ హోటల్‌కి ఏమీ కాకపోగా, నిరాశ్రయులైన వందలాదిమంది ప్రజలకి అది ఆశ్రయమిచ్చింది. ఆ హోటల్ పక్కనున్న ఈత కొలనులోని నీరు చుట్టుపక్కల చెలరేగిన మంటలని ఆర్పడానికి ఉపయోగపడింది. ఫ్రాంక్ ముందుచూపువల్ల వేలాదిమంది ప్రాణాలు, ఆస్తులు కాపాడబడ్డాయి.

1960లలో ఇంపీరియల్ హోటల్‌ని పూర్తిగా పడగొట్టి ఇంకో హోటల్‌ని నిర్మించారు. ఏప్రిల్9, 1959న ఫ్రాంక్ మరణించాడు. అతడి డిజైన్స్ మాత్రం ఇంకా ప్రపంచంలోని భవన నిర్మాణ నిపుణులు స్వేచ్ఛగా వినియోగిస్తూనే ఉన్నారు.

ఆరోజే పదకొండో రోజు పెద్దకర్మగా నిర్ణయించారు. ఆరోజు సమారాధన పేరుతో అన్నదానం నిర్వహించాలనుకున్నారు. దానికోసం యింటికింతా అని పంపకం వేసి చందాలు వసూలు చేసి సమారాధన దిగ్విజయంగా నిర్వహించారు.

ఆరోజు... ఎద్దుగుడిని... శుభ్రం చేయించి, గోడలకు సున్నం కొట్టించి, ఆ మరునాడు బీశేరయ్య దేశపు కోడెను అక్కడికి చేర్చి దాన్నే దేవరెద్దుగా నిర్ణయించి, దాని ఆలనా పాలన బాధ్యతను సేవదాసరిగా నిర్ణయించిన బాలయ్యపైన వుంచారు. బాలయ్య పిల్లవాడు కాబట్టి ఆ బాధ్యత కూడా బీశేరయ్యపైన పడింది.



ఎంతో కష్టపడి అప్పుచేసి పరసలన్నీ తిరిగి ఇష్టంతో పట్టుకొచ్చిన దేశిపుకోడె దేవరెద్దు పేరుతో తమకు దూరమయ్యేసరికి బీశేరయ్య మనసు విలవిలలాడిపోయింది.

చేన్ల కోతలైపోయాయి.

బీశేరయ్య ఎలాగో... తన రెండెకరాల్లో పండిన సద్దచేను కోసి గూళ్ళువేసి, మగ్గిన తర్వాత గూళ్ళు కోయించి కంకుల్ని చుట్టింట్లో పోయించాడు... వారంతర్వాత... చెంగారెడ్డి ఎద్దులబండిని తీసుకొచ్చి దానికి తమ ఎద్దుల్ని కట్టి ఊరికి దక్షిణాన మైలుదూరంలో వున్న నాయకురాలు బండకు కంకుల్నితోలాడు. ఆ బండపైనే రెండురోజులు కంకులు ఎండకు ఎండిన తర్వాత... బండపైన స్లోపుగా పరిచి రెండేసి ఎద్దుల్ని ఒకబంతి చొప్పున కట్టి ఎన్ను తొక్కించాడు. కతారి రాముడు కూడా తన ఎద్దుల్ని తోలుకొని వచ్చి బంతి కట్టాడు. పేడ పడకుండా జాగ్రత్తపడి ఆరోజు మధ్నాహ్యం వేళకు ఎన్ను తొక్కించడం పూర్తి చేయించాడు.

ఆ తర్వాత దంతి తీసుకుని... గింజల్నుంచీ గుబ్బు వేరుచేశాడు. గుబ్బులో యింకా రాలకుండా వున్న గింజల కంకుల్ని ఏరి... గుదిపె తీసుకుని ఆడవాళ్ళు దబాదబా కొట్టి గింజలు రాలేట్టు చేశారు... ఆ గుబ్బును పెద్ద జల్లెడతో జల్లెడపట్టి గింజల్ని వేరుచేశారు...

గూగుల్తో సహా వున్న గింజల్ని మళ్ళీ... బండపైన తొలచివున్న రోళ్ళలో పోసి రోకళ్ళతో దంచి గింజల్ని వేరుచేశారు.

అలా వేరుచేసిన గింజల్ని తూర్పారబట్టి

అందుకే అన్ని పనులు అయిపోయాయి గనుక... గంగిరెద్దును తీసుకొని పల్లెల మీద బోయి డబ్బూ దస్కం సేకరించాలనుకున్నాడు బీశేరయ్య.



గింజల్లో వున్న చెత్తని, గూగుల్ని వేరుచేసి, గింజల్ని శుభ్రపరచి సంచులకు పోశారు. ఆ సంచుల్ని... యింటికి చేర్చారు... మిగిలిపోయిన గుబ్బును బండికెత్తి... బావికాడున్న దిబ్బలో కుమ్మరించారు.

ఆ తర్వాత అందరూ శుభ్రంగా స్నానాలు చేసి ఊపిరి పీల్చుకున్నారు. అంతకష్టపడితే పట్టుమని ఆరుమూట్ల ధాన్యం రాలేదు.

ఆ ధాన్యం అయిదారు నెలలకు సరిపోతుంది.

అది సంక్రాంతి మాసం...

ఒకరోజు... అందరూ ఇంట్లో వున్నపుడు "ఒరేబ్బా, నువ్వు డోలెత్తుకో. మునసామికి లీవులు గాబట్టి, వాడు సీతమ్మను పట్టుకోని చిన్నమేళం ఎత్తుకుంటాడు. నేను పెద్దమేళం, కొన్ని బోకులు ఎత్తుకుంటాను... ఈ పదిరోజులూ పల్లెలు తిరగదాం. పశువుల పండగనాటికి యింటికొచ్చేద్దాం. అంతగా అయితే మళ్ళా దేశం

## కొత్తగాలి...



**కట్టుబొట్టుకు**
**నాడు ప్రాధాన్యం**
**ప్రాశ్చాత్య అనుకరణతో**
**నేడు అధ్వాన్నం**

—ముమ్మిళ్ల వందన, హన్మకొండ

పైన పోదాం" తన అభిప్రాయం చెప్పాడు బీశేరయ్య.

కనకయ్య సరేనన్నాడు.

ఆ మరునాటినుంచే వీపున కాలున్న ఆవును, గంగెద్దును పట్టుకొని చుట్టుపక్కల ఊళ్ళన్నీ తిరగసాగారు వాళ్ళు. సంక్రాంతి ముందునాటికి తిరిగి గ్రామానికి చేరుకున్నారు.

రాత్రంతా గంగెద్దునాడించడం, పగలు ఇండ్లముందరికి గంగెద్దును తీసుకొచ్చి ధన ధాన్యాలు అడుక్కోవడం సాగిస్తున్నారు.

ఆరోజు కమ్మపల్లె కొచ్చారు.

చిన్నబ్బ గొడ్ల పందిరి కింద గంగెద్దును, ఆవును కట్టేసి, చిన్నబ్బనడిగి కట్ట వరిగడ్డి తీసుకుని వాటి ముందరేశారు.

ఆరోజు రాత్రి అక్కడ గంగెద్దును ఆడించాల్సివుంది.

సందేళనే రెండిండ్ల దగ్గర అడిగి అంత అన్నం పెట్టించుకొని తిన్నారు.

బీశేరయ్య... మోకాళ్ల కిందివరకూ విడిచి బిళ్లగోచీ పెట్టాడు. పొడుగు చేతుల చొక్కా తొడుక్కున్నాడు. దానిపైన నల్లటి పాత కోటు తొడిగాడు... తలకు ఎర్రటి తలపాగా చుట్టాడు.

కన్నకయ్య లుంగీ కట్టుకొని, తలకు తువ్వాలు కట్టుకొని డోలు మెడకు తగిలించుకున్నాడు. మునస్వామి... తలకు తువ్వాలు చుట్టి చిన్న సన్నాయిని భుజానికి తగిలించుకొని ఆవు పగ్గం చేతబట్టుకున్నాడు.

బీశేరయ్య గంగెద్దుకు ఎర్రటి ముసుగు కప్పాడు. దాని కొమ్ములకు ఎర్రటి రిబ్బను లాంటి గుడ్డచుట్టి కొమ్ములకు గగ్గిరెట్లతో పాటు ఉన్న కుప్పెలకేసి బిగించాడు. మెడకు వెడల్పాటి గవ్వలపట్టీని, మువ్వల పట్టీని తగిలించి బిగించాడు. దాని గోపురానికి మూరెడెత్తు ఎలుగ్గొడ్డు చర్మంతో కుట్టిన టోపీలాంటి ఆకారాన్ని వేసి, కడుపు కిందిగా దారంతీసి పడిపోకుండా బిగించాడు. ముసుగుగా కప్పిన బొంతనుంచీ అమర్చివున్న మువ్వలపట్టిని దాని తోక కిందుగా తీసి, అది జారిపోకుండా మరోవైపున దారంతో బిగించాడు. దాని ముందరి కాళ్లకు గజ్జలు కట్టాడు.

తానూ ముఖానికి నామాలేసుకుని సన్నాయిని ఊదుకుంటూ వీధి మధ్యలోకి నడిచాడు. కనకయ్య మునస్వామి... ఎద్దు నొకరు, అవునొకరు పట్టుకొని అతన్ననుసరించారు.

నడివీధిలో గొడ్లను నిలిపి... బీశేరయ్య, మునస్వామి సన్నాయిలు వాయిస్తుంటే... కనకయ్య డుముకు డుముకుమని డోలు వాయించసాగాడు. వాళ్ల వాద్యాల శబ్దం విని ఒక్కొక్కరే అక్కడ పోగైపోయారు. వీధిలో ఇండ్ల ముందర వేసిఉన్న బండ్ల పైన కూర్చోసాగారు. పిల్లలు, ఆడవాళ్లు గుంపుగా నిలబడి చూడసాగారు.

అలా ఊర్లో జనమంతా అక్కడ చేరిపోగానే కనకయ్య ఒక వారగా కూర్చొని డోలు వాయించసాగాడు. అతని పక్కనే కూర్చున్నాడు మునస్వామి.

బీశేరయ్య ఎద్దు పగ్గాన్ని చేతికి చుట్టుకొని "భలే మంచిరోజు, పసందైనరోజు" అన్న సినీగీతాన్ని మేళంలో వాయిస్తూ జనానికి దగ్గరగా ఎద్దును తిప్పుతూ ఒక చుట్టు చుట్టి వచ్చాడు. గంగెద్దు గంభీరంగా అతని వెంటే నడిచింది.

బీశేరయ్య సన్నాయిని ఆపాడు. కనకయ్య డోలు వాయించడం ఆపాడు. బీశేరయ్య ప్రారంభించాడు-

"మహాజనులార... మీకందరికి శుభోజ్జయం... ఈరోజు మా రామన్న మీ ముందు నేనడిగిందానికి సమాధానం చెప్పి, ఆడి మిమ్మల్ని ఆనందింప చేస్తాడు. చివరన ఆ సీతమ్మకు ఈ రామన్నతో పెళ్లి జరిపించి మీ ఆశీస్సుల్ని పొందుతాం" ఆవును చూపించి తాము ఆడబోయే గంగెద్దులాటకు నాందీ ప్రస్థావన పలికాడు బీశేరయ్య.

మళ్లీ బీశేరయ్య సన్నాయిని 'తూతూ' అని రెండుసార్లు అనిపించి ఒరే బసవన్నా... దూడూ బసవన్నా.. మనం ఈ అన్నలకు, అక్కలకు, అయ్యలకు, అమ్మలకు మన ఆట చూపించి, మన పాట విని పించి మన పనితనమేమిటో చూపించాల... అవునా... అవునయితే తల నిలువుగా ఊపు. కాదంటే... తల అడ్డంగా ఊపు... ఈ విషయాన్ని నేను పాటతో సన్నాయి ద్వారా అడుగుతాను చెప్పు" అంటూ సన్నాయి నోట్లో పెట్టుకుని 'ఔనా... నిజమేనా...' అన్న పాటను వాయించసాగాడు. కనకయ్య దానికి తగినట్టుగా డోలు వాయించసాగాడు.. ఆ పాట వింటుంటే... ఎంతో మధురంగా అనిపిస్తోంది.

గంగెద్దు ఆ పాటకు అవును అవును అన్నట్టు తల ఊపింది.

అది అయింతర్వాత... "ఒరే రాముడూ... ఒరే బసవన్నా... మన ఆట ఆరంభించేముందు అందరికీ ఒక్కసారి ముందరి కాలు వంచి అన్నా అంటూ సలాం చెయ్" అంటూ చేతిలో తాడు లాగాడు. అది కాలువంచి 'అంబా' అని అరిచింది.

"అక్కలకు నమస్కారం చేశావ్. అన్నలకు, అయ్యలకు నమస్కారం చెయ్" అన్నాడు.

అది మళ్లీ కాలువంచి 'అంబా' అన్నది.

ఎద్దును చుట్టూ తిప్పుతూ "అన్నకూ దండంపెట్టు.. అమ్మకూ దండం పెట్టు" అంటూ అరవసాగాడు...

అలా గంగెద్దుల ఆట సాగిపోతూనే వుంది.

అదే సమయంలో... ఊర్లో...

శంకర్రెడ్డి... తన యింటి వసారాలో వాలు కుర్చీలో కూర్చొని కాలిమింద కాలేసుకుని సిగెరెట్టు తాగుతూ విలాసంగా, పొగను గాలిలోకి వదుల్తున్నాడు.

"నాయనా... పశువుల పండగ యింక మూడు రోజులే. ఈరోజు భోగి పండగ... ఇండ్ల ముందర పొద్దన పాత చేటలు, పొరకలు అన్నీ యేసి భోగిమంట లేసినారు" పక్కనేవున్న కేశవరెడ్డి చెప్పాడు.

"ఆవల సుబ్బన్నకు చెప్పి... ఊరి ముందర చిట్లాకువ్వ యేంచినారా లేదా? ..." అడిగాడు శంకర్రెడ్డి.

"యేసినాడు... మన బాయికాడుండే పాత చొప్ప కూడా ఎత్తకపొయ్యి కువ్వ ఎ యెయ్యమన్నె."

"మన పశువుల్ని పసలపండగరోజు బాగా బెదిరించాల... అది చూసి ఊర్లో వాళ్లంతా ముక్కుమీద వేలేసుకోవాల"

"మన గుబిలికోడెకు పలకలో బహుమానం పెట్టి- కొమ్ములకు కడతాం. పలక పెరికినోనిదే ఆ బహుమానం"

"అది సరే... ఆ గంగెద్దులోడి దూడను తెలివిగా.. దేవరెద్దుగా మార్పించి వానికి దూరం జేసినాం.. వాడెట్లుండాడు? " ఆరా తీస్తున్నట్లు అడిగాడు శంకర్రెడ్డి.

"వాని కొవ్వు అనిగింది. లేకుంటే నా రొమ్మునే చెయ్యేసి తోస్తాడా... అగుమానంగా తిడతాడా..." పళ్లు పటపటలా

డిస్తూ చెప్పాడు కేశవరెడ్డి.

"నాయినా ... యిందా...టీ... తాగు" అంటూ ఓ నల్లటి ఆకారం... గున్నఏను గులా కదలివచ్చి రెండు గ్లాసుల్లో టీ తెచ్చి యిచ్చి పోయింది.

ఆమె శంకర్రెడ్డి కూతురు... పేరు జయలక్ష్మి... తండ్రిలాగే కారు నలుపుతో... లావుపాటి శరీరంతో గున్న ఏనుగులా వుంది. ముప్పయ్యేళ్లు దాటుతున్నా యింకా పెళ్లి కాలేదు. "ఆమెకు పెళ్లి చేసేస్తే చాలు... నా కోరికలన్నీ నెరవేరినట్టే" అనుకుంటుంటాడు ఆమెను చూసినప్పుడల్లా శంకర్రెడ్డి.

అయితే "ఈ నాయన ఈ జన్మలో నాకు పెండ్లి జెయ్యడు. ఎవుర్నో ఒకర్ని నేనే చూసుకోవడం మేలు" అన్న ఆలోచన్లలో జయలక్ష్మి మునిగి తేలుతుంటుంది.

టీ తాగి ఖాళీ క్లాసులు పక్కన పెట్టి మళ్లీ సంభాషణ కొనసాగించారు వాళ్లు. "అది సాలదురా వాడికి... యింకో దెబ్బ కొట్టాల. ఆ కొట్టింది మనమేనని వాడికి మాత్రమే తెలియాల..." కసిగా అన్నాడు శంకర్రెడ్డి.

"అవున్నాయనా... వాడికీ వాడి తమ్ముడికీ దెబ్బమీద దెబ్బ పడితేగానీ మన తడాఖా తెలీదు" అన్నాడు కేశవరెడ్డి.

"వొరేయ్... చెరువు ముందర పల్లెకు బొయ్యి... దొంగతనాల్లో ఆరితేరిన యిద్దరు ఆయకట్టు మొగోళ్లను పిల్చుకరమ్మన్నానుగదా, పిల్చకొస్తివా" అడిగాడు.

"పిల్చుకొచ్చినా... గోడకవతల... మన గొడ్ల కొటం దెగ్గిరుండారు" చెప్పాడు కేశవరెడ్డి.

"పో... ఇదే మంచి అదును... బీశేరయ్య, వాడి తమ్ముడు వారం దినాలుగా గంగెద్దును తోలుకొని దేశింపైన పోయినారు... పోయి వాళ్ల కోడెల్ని... తోలకపోయి... అమ్మేయమను... అదీ పాకాల కసాయి సాయిబులకమ్మేయమను... కొడుకులు పసల పండగరోజు గొడ్లు కన బడక తనకలాడాల... పో."

తండ్రి ఆలోచనలకు కేశవరెడ్డి పొంగిపోయాడు.

"ఓన్నో... శంకర్రెడ్డన్నో" అంటూ అటు వైపుగా వచ్చాడు చెంగారెడ్డి. "వోరే కేశవా... వీనికి మన ఆలోచన తెలీనీ వద్దు... వోడు మంచోడనిపించుకోవాలని ఈ విషయం నేరుగా తీసుకపోయి వాళ్లింట్లో చెప్పేసొస్తాడు"

'సరే' అంటూ అక్కడి నుంచీ వెళ్లిపోయాడు కేశవరెడ్డి. పిచ్చాపాటీ మాట్లాడుకోవడం కోసం అప్పుడే అక్కడికి రాసాగాడు చెంగారెడ్డి. అక్కడ... వీధిలో...

బీశేరయ్య సన్నాయి ఊదుతూనే తన రెండు తొడలపైన ఎద్దుకాళ్లను వుంచి... మోస్తూ సన్నాయి ఊదసాగాడు.

అదయింతర్వాత... బీశేరయ్య "జనులారా... మన పిల్లలు సైకిల్ తొక్కాలంటే చాలా యిష్టపడతారు గదా... ఈ ఎద్దు కూడా సైకిల్ తొక్కాలంటే యిష్టపడతాది... అరే... ఎద్దు తొక్కే సైకిల్‌ను నువ్వేడ తెస్తావయ్యా గంగెద్దులాయన అని మీరడగొచ్చు. ఎద్దు తొక్కే సైకిల్ అట్టాంటిదీ ఇట్టాంటిదీ కాదు... కనీ ఇనీ ఎరుగని సైకిల్. మనుషుల సైకల్..."

"ఆడేపాడే పసివాడ..." అనే పాటను సన్నాయిలో ఒక చరణం వాయించి "ఓ చిన్నవాడా... సైకల్ తొక్కతావా? " అంటూ అడిగాడు ఎద్దుని... అది సరే అన్నట్లు తల ఊపింది.

"ఏమయ్యా.... అయిదారుగురు చిన్నపిల్లలుంటే రండి" అని పిలిచాడు. ఓ ముగ్గురు పిల్లలు వచ్చారు.

"ఏం భయం లేదు... రండి... ఇది ఊరికే... ఒక ఆట అంతే" అంటూ మునస్వామి వెళ్లి ఆరుమంది పిల్లల్ని తీసుకొ

చ్చాడు. అందరూ పది పన్నెండేండ్లలోపు వయసువాళ్లే.

అందర్నీ ఒకరి వెనుక ఒకరిని చొప్పున వరుసగా కూర్చోబెట్టాడు. అందర్నీ తలవంచుకొని... రెండు కాళ్లపైన కూర్చునేటట్లు చేశాడు.

"బాబులూ మీరేం భయపడొద్దు... యిప్పుడు మీపైగా మా ఎద్దు సైకల్ తొక్కతాది... చూడండి బాబు... ఈ సైకిల్... పిల్లోళ్ల సైకిల్. మనుషులతో చేసిన సైకిల్. ఈ సైకిల్‌ను మా రాముడు ఎలా తొక్కతాడో... చూడండి" అని సన్నాయి నోట్లో పెట్టుకున్నాడు.

"జయమ్ము నిశ్చయమ్మురా... భయమ్ములేదురా... జంకుగొంకు లేక నువ్వు సాగిపొమ్మురా" అన్న పాటను శ్రావ్యంగా ఒక చరణం వాయించాడు. కనకయ్య డోలును తగినట్లుగా వాయిస్తూ సహకరించాడు...

"ఒరే బసవన్నా... ఒరే రాముడు... రా నాయనా... రా... పిల్లలకు నొప్పి తగలకుండా... భయం కలగకుండా... సైకిల్ తొక్కు... వీళ్లు మా బిడ్డలే కాదు... నీ బిడ్డలు కూడా... అట్టాంటి బిడ్డలకు ఏమన్నా జరిగిందో ఇక్కడ... ఈ నడీదిలోనే నిన్నూ నన్నూ నిలవనా పాతరేసేస్తారు.. జాగర్త నాయనా... రా... సైకిల్ తొక్కూ... నేను పాట వాయిస్తా.... యినుకుంటా తొక్కు..." అని "వరేబ్బా... ఇద్దోతాడు! పట్టుకో... జాగర్తగా సైకిల్ తొక్కించు" అంటూ ఎద్దుపగ్గాన్ని మునస్వామి చేతికిచ్చాడు. మునస్వామి... చివర కూర్చొన్న అబ్బాయి దగ్గరికి ఎద్దును తీసుకువచ్చాడు...

కనకయ్య డోలు కొడుతుంటే బీశేరయ్య సన్నాయితో పాటందుకున్నాడు... పాట మీద పాట... జలపాతంలా సన్నాయిలో ఉరుకుతోంది. ఏ పాటనైనా సునాయాసంగా వాయించేస్తున్నాడు...

ఎద్దు కదిలింది.

పిల్లలు ముందరి కాళ్లసందున వుండేటట్లుగా... మెల్లగా నడుస్తూ... ఒకరొకరి నెత్తిన కాలిగిట్టను సుతారంగా మోపి, కాలు మార్చి కాలు తీస్తూ... మరోవైపు బీశేరయ్య పాటను వింటున్నట్టుగా తల ఆడిస్తూ... ముందుకు కదలసాగింది... మునస్వామి.... వంగి కాలి గిట్టను... పిల్లల తలపైకి సుతారంగా పెట్టేటట్లు చేత్తో జాగర్తలు తీసుకుంటున్నాడు.

అక్కడ చేరిన జనాలు ఆసక్తిగా చూస్తున్నారు... ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

ఇక్కడ...

కేశవరెడ్డి... చెరువు ముందరిపల్లె దొంగల్ని తీసుకొని పల్లె వెనక చేలగుండా... రాశింటి వైపుకు బయలుదే

## ఇంకెన్ని ఉంటాయి?



'నేను మీకు ముందుగా రెండు కుందేళ్లు, తర్వాత మరో రెండు కుందేళ్లు, ఆ తర్వాత మరో రెండు కుందేళ్లను ఇస్తే మొత్తం మీ దగ్గర ఎన్ని ఉంటాయి?' అడిగింది టీచర్ శ్యామ్‌ను.

'ఏడు' చెప్పాడు శ్యామ్.

'సరే, ఇంకొకటి చెబుతాను. ముందుగా రెండు ఆపిల్స్, తర్వాత రెండు, ఆ తర్వాత మరో రెండు ఆపిల్స్ ఇస్తే మొత్తం ఎన్ని ఉంటాయి?'

'ఆరు' అన్నాడు.

'మరి కుందేళ్లనెందుకు ఏడు అని చెప్పావు?' అంది టీచర్.

'మా ఇంట్లో ముందే ఒక కుందేలు ఉంది కదా?' అన్నాడు శ్యామ్.

## కొత్తగాలి... 

**పైకెగిరే పతంగి**
**చెట్టుకొమ్మకు**
**చిక్కింది**
**పిల్లలు బడికెళ్ళాలని**

—పెరుక రాజు, నర్సింగాపూర్, కరీంనగర్

రాడు...

అప్పటికే ఊర్లో జనం... చలికాలం కావడంతో తలుపులు బిడాయించి ఇండ్లల్లో నిద్రపోతున్నారు...

దూరంగా కుక్కలు మొరుగుతున్నాయి... అప్పుడే... రాశింటి కవతలున్న చింత చెట్లోవున్న కాకుల గూళ్ళల్లో గుడ్లగూబ జొరబడినట్టుంది... కాకులు కావుకావుమని గోల చేస్తున్నాయి...

దొంగలు... మెల్లగా బీశేరయ్య ఇంటిని సమీపించసాగారు.

అక్కడ... సగం మందిని దాటిన ఎద్దు ఒక పిల్లవాడినెత్తిన ఒక కాలిగిట్టనుంచి నిలబడిపోయింది.

బీశేరయ్య... సన్నాయి వాయించడం ఆపి... "ఇప్పుడు చూడండి... ఈ ఎద్దు ఈడ ఎందుకు ఆగిపోయింది..." అన్నాడు.

మునస్వామి కల్పించుకొని "వోరే ముతాలే అంత మాత్రం తెలీదా" అన్నాడు.

"నేను ముతాలినేగానీ... ఈడ నీ ఎద్దు ఎందుకాగిపోయిందో సెప్పురా సిత్తిరి నా కొడకా" అన్నాడు అందర్నీ నవ్వించే ధోరణిలో బీశేరయ్య.

"కొడకా గిడకా అనొద్దు మర్యాదుండదు" అన్నాడు మునస్వామి.

"ముందు నేనడిగిన దానికి సమాధానం చెప్పరా పిల్ల నా కొడకా"

"ముందు నువ్వు మర్యేదగా అడగరా ముసలి నా కొడకా"

వాళ్ళ సంభాషణ హాస్యోక్తులతో సాగిపోతోంది...

"సరే... దేవరా... ముందు నీ బసవన్న ఈడెందుకాగిందో చెప్పు"

"ఏమీ లేదు పెద్దాయనా... వీళ్లల్లో ఎవడో దొంగ వుండాడు"

"ఎంతమాట... పోనీ అని ఈ ఊర్లో వాళ్లు మన ఆట చూస్తావుండారు. పాట వింటావుండారు"

"విని కడాన... జేబినిండా దుడ్లు, చేటలనిండా వడ్లు... బహుమానాలు యిచ్చిపోతార్లే"

"అది నువ్వే అనకూడదు. ఎందుకంటే... ఈ ఊర్లో నాయుళ్లంతా ధర్మప్రభువులు... నిన్ను వట్టిచేతుల్తో పంపరు. ముందు నీ పనితనం, నీ ఎద్దు పనితనం చూపించు"

"అc తప్పక చూపిస్తాను... నా ఎద్దు... ఈడుండేవాళ్లల్లో దొంగను కనిపెట్టింది"

"ఛీ ఛీ... అంతమాటనవద్దు... తప్పులు చెప్పావో... రేపట్నుంచీ ఈ ఊర్లోకే రానియ్యరు చూడు."

"లేదయ్యా... నా ఎద్దు... చాలా సత్తెమైన ఎద్దు... తప్పు చెప్పదు... దొంగను పట్టిస్తుంది చూడు."

"అట్టయితే మేముండం" కిందవున్న పిల్లల్లో ఎవరో అరిచారు.

"అయ్యా... మీకేం కాదు. ఇది ఉత్తుత్తి ఆటే... నిజం కాదు... మీరు మాట్లాడకుండా కూర్చోండి" అన్నాడు బీశేరయ్య.

"ఇదుగో పెద్దాయన.. నువ్వు నీ మేళంతో పాట పాడతావుండు. ఎద్దు దొంగను పట్టిస్తుంది" అన్నాడు మునస్వామి.

కనకయ్య డోలు కొట్టసాగాడు... ఆ శబ్దానికనుగుణంగా బీశేరయ్య సన్నాయితో పాటెత్తుకున్నాడు.

# కంఠస్వరాల గ్రంథాలయం



అమెరికాలో స్టోరీ క్రాఫ్స్ అనే స్వతంత్ర, లాభాపేక్షలేని ఓ సంస్థ 2003లో ప్రారంభమైంది. దీని ఉద్దేశం అమెరికన్ ప్రజల వివిధ జీవిత కోణాలని, పార్శ్వాలని వారు చెప్పగా రికార్డ్ చేసి, ఆ కంఠ స్వరాలని భవిష్యత్తుకి అందించడం. ఇందుకోసం అనేక మొబైల్ రికార్డింగ్ బూత్‌లను వాహనాల్లో వివిధ ప్రాంతాలకి తీసుకెళ్లి, వారు చెప్పేది రికార్డ్ చేయడం దీని లక్ష్యాలు. వీటన్నిటినీ వాషింగ్టన్ డి.సి. లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌లో భద్రపరుస్తున్నారు. అంతేకాక పబ్లిక్ రేడియో ద్వారా ఇంటర్నెట్‌లోనూ వీటిని ఎవరైనా వినవచ్చు.

చరిత్రని మౌఖికంగా రికార్డ్ చేసే ప్రపంచంలోని అతిపెద్ద ప్రాజెక్ట్ ఇది. మనుషులలోని దాతృత్వం, క్రూరత్వం, హాస్యప్రియత్వం కథనాలుగా రికార్డవుతున్నాయి. న్యూయార్క్‌లోని ఓ సబ్‌వే రైలులో తనకు తారసపడ్డ దొంగని సన్మార్గంలోకి మార్చిన జూలియో డయాన్ అనే వలస వచ్చిన ఓ అమెరికన్ కథనం, తన తాతమ్మ వేలిగోళ్లని రంగువేసుకున్నందుకు వాటి స్థానం నుంచి వేరుపరచిన కథనాన్ని నల్ల జాతికి చెందిన మేరీ అల్లెన్ నూన్ చెప్పిన నిజం, రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఇటలీలో తల్లిదండ్రులనుంచి వేరైన యూదు ఎరిక్ లామెట్ అమెరికాకి వచ్చిన తన తల్లిదండ్రులను తిరిగి కలుసుకున్న కథనం, సింగ్‌సింగ్ జైలులో ఉన్న డారెల్ డానెస్‌లోని పాటలు పాడే శక్తిని గమనించిన సంఘటన, ఆస్‌బార్న్, అతడి భార్య డెబీ గ్రామీణ మిస్సిసిపిలో గడిపిన అరవయ్యేళ్లనాటి జీవిత చిత్రణ మొదలైనవి వీటిలో కొన్ని ఉదాహరణలు.

వీటిలో ఆసక్తికరమైనవి 'లిజనింగ్ ఈజ్ ఏన్ ఆక్ట్ఆఫ్ లవ్' పుస్తకంగా వెలువరించారు.

ఎవరైనా స్టోరీ క్రాఫ్స్‌కి తమ అనుభవాలు రికార్డ్ చేయడానికి అప్లై చేయచ్చు. సాధారణంగా తమ కుటుంబ పెద్దల అనుభవాల కోసం, కుటుంబంలోని యువత అప్లికేషన్‌ని పంపుతుంటుంది. వారు నివసించే ప్రదేశానికి సమీపంలోకి రికార్డింగ్ బూత్ వివరాలు, అప్పాయింట్‌మెంట్ టైమ్‌ను వారు తెలుసుకోవచ్చు. అనుభవజ్ఞులైనవారు ఇంటర్వ్యూచేసి, ఆ కథ ఆసక్తిగా ఉంటే నలభైనిముషాలసేపు రికార్డ్ చేస్తారు. వెంటనే ఓ సీడీని వారికిచ్చి మరోటి లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌కి పంపుతారు. దూరప్రయాణాలు చేయలేని వారికోసం రికార్డింగ్ బూత్‌లున్న వాహనాల్లో వారి దగ్గరకే వస్తారు.

వృద్ధుల్లోని మరపుని తొలగించి జరిగింది చెప్పించే శిక్షణ పొందిన 'మెమోరీ లాస్ ఇనిషియేటెడ్' సిబ్బంది సహాయం చేస్తారు. కనీసం 8 కథనాలు ఓ ఇంట్లో రికార్డ్ చేయడానికి పనికొచ్చేవి ఉంటే సిబ్బంది సరాసరి వాళ్లింటికే వెళ్లి రికార్డ్ చేసుకుంటారు.




సి.ఎస్.ఎన్, అమెరికన్ మార్నింగ్ అనే కార్యక్రమాల్లోనూ, ఏబీసీ న్యూస్‌లో కూడా ఈ రికార్డింగ్‌లను ప్రసారం చేస్తున్నారు.

అక్టోబర్ 2003లో న్యూయార్క్‌లోని గ్రాండ్ సెంట్రల్ టెర్మినల్ దగ్గరఠ స్టోరీ బూత్ ఆవిష్కరణతో స్టోరీ క్రాఫ్స్ ఆరంభమైంది. మే 2005లో తొలిసారి మొబైల్ రికార్డింగ్ బూత్‌ని వాషింగ్టన్ డి.సి. లో లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ దగ్గర ఆరంభించారు. ఈ రెండు మొబైల్ బూత్‌లు 46 రాష్ట్రాల్లోని 70 నగరాల్లో తిరిగి ఇప్పటికే అనేక వేల కథలని రికార్డ్ చేసాయి. సెప్టెంబర్ 11, 2001న జరిగిన టెర్రరిస్ట్ దాడికి చెందిన అనేక కథలని న్యూయార్క్‌లో రికార్డ్ చేసారు. ఇలా 1930ల నుంచి జరిగిన అనేక సంఘటనలు రికార్డయ్యాయి.

మరో యిద్దరిని దాటుకొని వెళ్ళిన ఎద్దు ఒకచోట ఆగిపోయి ఒక పిల్లవాణ్ణి తన రెండు కాళ్ళ సందును ఇరికించుకుంది.

"య్యోవ్... నీ మేళమాపు... ఓ సామీ నీ డోలు కూడా ఆపు..." అరిచాడు మున స్వామి.

"ఎందుకాపమన్నావ్?" సన్నాయి ఊదడం ఆపి అడిగాడు బీశేరయ్య.

"దొంగ దొరికాడు" అన్నాడు మున స్వామి.

"ఎవరా దొంగ?"

"చూపిస్తానుండు" అని ఎద్దుకాళ్ల సందు నవున్న పిల్లవాణ్ణి తప్ప మిగిలిన వాళ్లను వెళ్లిపొమ్మన్నాడు మునస్వామి... వాళ్ళు వెళ్లాక "ఇదుగోనయ్యా దొంగ" అన్నాడు.

"నిజమేనయ్యా. నువ్వు సామాన్యుడు కాదు. నీ ఎద్దూ సామాన్యమైంది కాదు. సరే, ఆ పిల్లవాణ్ణి ఎద్దుయింక వదలదా ఏమీ" అడిగాడు బీశేరయ్య.

"వదుల్తుంది. అయితే ఈ పిలగోడు ఏం దొంగతనం చేశాడో చెప్పేస్తే వదిలే స్తుంది" అన్నాడు మునస్వామి.

"అయితే నేనడుగుతా నువ్వు వినుకో... ఒరే పిల్లవాడా... నిజం చెప్పెయ్! ఏం దొంగతనం చేశావ్?" అన్నాడు బీశేరయ్య.

"నేనేం దొంగతనం చెయ్యలేదు" పిల్ల వాడు ధైర్యంగా సమాధానం చెప్పాడు.

"నువ్వు నిజం చెప్పేదాకా ఎద్దు నిన్ను వదల్దు"

"ఇదంతా ఉత్తుత్తినే ఏదో ఒగిటిచెప్పు" అన్నాడు మెల్లగా వంగి మునస్వామి.

"మా పక్క చేన్లో రేత్తిరి సెనిగిసెట్లు పెరికినా" చెప్పాడు పిల్లోడు.

"శహభాష్ చేసిన తప్పు వప్పుకుంటే పాపం పరిహారమౌతుంది. యింక నువ్వు లేచి.. ఇలా రా" అంటూ బీశేరయ్య పిల్ల వాణ్ని లేపి చేయి పట్టుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో...

రాశింటి వైపు నడిచిన దొంగలు బీశే రయ్య గొడ్లకొట్టం తడికె తీశారు... మెల్లగా వెళ్లి సేద్యపుగొడ్లను విప్పుకొని... వీధిలోకొచ్చారు. అదే కడపటి యిల్లుకా బట్టి అటునుంచీ అటేగొడ్లను తోలుకొని వేగంగా పాకాల దారి పట్టారు.

కేశవరెడ్డి వాళ్లకు చెప్పాల్సింది చెప్పేసి, ఏమీ తెలీనట్లు తిరిగి ఇంటికి వచ్చి పడు కున్నాడు.

గంగెద్దు ఆటలో దొంగ దొరికాడు... కానీ ఊర్లో పడిన దొంగలు తప్పించుకుని వెళ్లిపోసాగారు.

గంగెద్దలాట మళ్లీ కొనసాగింది.

"ఒరే పిల్లవాడా.. యీ గంగెద్దు సామా న్యమైంది కాదు. బంగారట్లా నిన్ను దొంగంజేసింది. కాబట్టి మనం దీంతో యుద్ధం చేద్దాం. ఏమంటావ్?" అన్నాడు బీశేరయ్య.

"అవును అను" అన్నాడు మునస్వామి.

"అవును చేద్దాం" అన్నాడు పిల్లవాడు.

"అయితే... దీంతో మనం నేరుగా యుద్ధం చెయ్యలేం కాబట్టి, దీని కళ్ళకు గంతలు గడదాం... ఆ తర్వాత దాని తోక బట్టి ఈడ్చేద్దాం..." అని సన్నాయి మున స్వామి చేతికిచ్చి, మునస్వామి తలకు చుట్టుకొని వున్న ఎర్రటి చేతిరుమాలును నిలువునా నాలుగుమడతలు వేసి ఎద్దు కళ్ళకు గంతలు కట్టాడు... ఆ తర్వాత గగ్గి రెట్ట (వలయాకారంలో వున్న చిన్న మువ్వ) అమర్చిన జాటీ చేతిలోకి తీసుకు న్నాడు.

"ఏమయ్యా పిల్లవాడా... ఎద్దు తోక పడతామా" అంటూ పిల్లవాడి చేయి పట్టు కొని జాటీకున్న గగ్గిరెట్ట ఘల్లు ఘల్లున మోగేటట్లు నడవసాగాడు. ఆ శబ్దాన్ని బట్టి ఎద్దు... ఆ శబ్దం వచ్చిన వైపుకు తిరుగుతూ వుంది. వాళ్ళు ఏ వైపుకుపోతే ఆ వైపుకు వచ్చి వాళ్ళని తరుముతోంది.

అలా కొంతసేపటి తర్వాత బీశేరయ్యా "ఏమయ్యా పిల్లవాడా దీన్నిట్లా జయించ లేంగానీ... నా సన్నాయిలో పాట పాడి దాన్ని లొంగదీసుకుని దానిచేత తల ఊపిస్తా... చూస్తావుండు... అది నేరుగా వచ్చి నా సంక కింద దూరి నా పాటను ఆలకిస్తుంది" అని, 'రారా కన్నయ్య, రారా కన్నయ్యా... దీనులను కాపాడా రారా కన్నయ్య' అన్న పాటను ఒకచోట నిలబడి వాయించసాగాడు. ఆ ఎద్దు మేళం శబ్దాన్నిబట్టి మెల్లగా నడుచుకుంటువెళ్ళి అతని సంకలో తలపెట్టి ఆలకిస్తున్నట్టు తల ఊపింది. ప్రేక్షకులంతా కరతాళధ్వనులు చేశారు.

బీశేరయ్యా దాని కళ్ళకు కట్టిన గంతను విప్పి "అయ్యా పిల్లవాడా... నువ్వు నాతో బాటు ఎద్దు తోక పట్టడాని కొచ్చినావు. గొప్ప వీరుడివి. అంతటి వీరుడికి గౌరవం చేయకపోతే యెట్లా" అని పిల్లవాన్ని ఎద్దుపైన కూర్చోబెట్టి ఆ ప్రదేశాన్ని ఒక చుట్టు చుట్టించి దింపి పంపించేశాడు.

బీశేరయ్యా కోడెల్ని దొంగలించిన దొంగలు నెట్టుబండ దాటి అడవి మార్గం పట్టారు... దార్లో ఎవరో ఎదురై "ఏమయ్యా గొడ్లను తోలకపోతున్నారు... ఎక్కడివి? " అని అడిగారు.

వాళ్ళు "ఆ పక్క పులిచెర్లలో కొన్నామయ్యా... యింటికి తోలకపోతున్నాం" అంటూ జంకూ గొంకూ లేకుండా చెప్పి ముందుకు సాగిపోతున్నారు... వడివడిగా ఎద్దుల్ని అదిలిస్తూ... వేగంగా నడుచుకుంటూ వెళుతున్నారు.

ఇక్కడ... బీశేరయ్యా ఎద్దు ప్రదర్శన జరుగుతూనే వుంది.

బీశేరయ్యా అక్కడే ఒక పంచెగుడ్డను నేలపైన పరిచాడు. "అయ్యలారా! అమ్మలారా... ఈ ఆటలో కడ ఆట సీతారాముల పెళ్ళి. ఆ పెళ్ళికి మీరంతా దానం చెయ్యండి... మీరు కట్టేసి పారేసిన ఒక పంచగుడ్డా, ఒక పాత చీరా... ఒగ చొక్కా... ఏదైతే ఏమీ... వస్త్రదానం చేయండి... మీ పాపం పటాపంచలైపోతుంది. ఒక రూపాయి, అర్ధరూపాయి... ఒక పావలా... మీకు తోచింది ఈ ధర్మ వస్త్రంపైన పారేయండి..." అంటూ ప్రేక్షకుల్ని అభ్యర్థించాడు.

ఆ మాటతో చిల్లర రాలిపడుతోంది. వారికి తోచింది వస్త్రంపైన విసరేస్తున్నారు.

కొందరు ఆడవాళ్ళు చేటలతో ధాన్యం, పప్పులు, మిరపకాయలు, చింతపండు... ఎవరి స్తోమతకు తగినట్లు వాళ్ళు తెచ్చి వస్త్రంపైన పోస్తున్నారు.

"అన్నలారా... అక్కలారా... నోరున్న మనం అన్నం తింటాం. నోరులేని ఈ జీవం గడ్డి తింటుంది... మడులున్న మారాజులు వరిగడ్డి కట్టలు దానం చేయండి. మీకు పుణ్యలోకాలు లభిస్తాయి..." మునస్వామి అరచి చెప్పసాగాడు.

ఒకరిద్దరు వరిగడ్డి కట్టల్ని తెచ్చి పక్కన పడేసి వెళ్ళారు.

తర్వాత ప్రదర్శన ప్రారంభమైంది.

"ఒరే సీతమ్మ తండ్రీ... జనకుడా" గట్టిగా అరిచాడు బీశేరయ్యా.

"ఏమిరా దశరథుడా!" అదేస్థాయిలో సమాధానమిచ్చాడు మునస్వామి. ప్రేక్షకులు ఆసక్తిగా చూడసాగారు.

"ఇప్పుడు ఈ సీతారాములకు పెళ్ళి జరిపించాల" అన్నాడు బీశేరయ్యా.

"నాకెందుకు చెప్తావు... జరిపించు" అన్నాడు మునస్వామి.

"అయితే... నీ సీతమ్మను మా రాముడికిస్తావా? "

"సీతమ్మ వప్పుకుంటే యిస్తాను!"

"మీ సీతమ్మ వప్పుకోవాలంటే ఏం

చేయాల? "

"కట్నం కావాల"

"ఓరీ ముండాకొడకా... పెళ్ళి కొడుక్కి ఎవరైన కట్నం అడుగుతారుగానీ పెళ్ళి కూతురికి కట్నం అడుగుతారా? ..."

"అవును నేనడుగుతాను.... నా సీత మ్మంటే ఏమనుకుంటివి. లోకమాత"

"సరే... ఏంకావాలో చెప్పు ఇస్తా"

"నువ్వే చెప్పు. ఎంతిస్తావో..."

"ఒక మసిపేలిక చీరగా యిస్తా... ఒక దుడ్డు కట్నంగా ఇస్తా. నీకు వప్పిత మేనా..."

"అయితే మా సీతమ్మనడుగుతా వుండు."

"అడుగు"

"ఓ నా బంగారు కూతురా సీతమ్మా... వొక మసిపేలిక చీరగా యిస్తాడంట... ఒక దుడ్డురూక కట్నం యాస్తాడంట. వప్పుతావా రాముణ్ణి" పాటలాగా రాగం తీస్తూ అడిగాడు మునస్వామి.

దానికి ఆవు తన తలను అడ్డంగా తిప్పింది.

"ఓ య్యోవ్ రాముని నాయనా... మా సీత వప్పలేదయ్యా"

"ఓహో... అయితే ఇంకేం కావాలం టావో అడుగు"

"అడిగితే యిస్తావా? "

"ఓం యిస్తా... అడుగు."

"రెండు పట్టుచీరలు పెట్టు... వంటి నిండా బంగారునగలు దిగెయ్యి... మా సీత నడుముకు అరచెయ్యంత వెడల్పు వడ్డాన మెయ్యి. వెయ్యి రూపాయల కట్న మియ్యి, మా సీతను వప్పిస్తా..." అన్నాడు మునస్వామి.

"ఓ... అన్నీ చేయిస్తా గానీ... నీ బంగారు కూతురు నడుము మన నల్లకొం డంతుందే... అంత బంగారం నేనేడ దెచ్చి వడ్డాణం చేయించేది"

"అదంతా కుదరదయ్యా... చేయించా

## కొత్తగాలి...

**గాలిలో ఎగురకు**
**కిందపడిపోతావు**
**నేలను ప్రేమించు**
**నింగి అంచులు చూస్తావు**

—డాక్టర్ అయాచితం నటేశ్వరశర్మ,
కామారెడ్డి

ల్సిందే"

వాళ్ళ సంభాషణలకు జనం నవ్వు కుంటూ ఆనందిస్తున్నారు. వాళ్ళ సంభా షణ యింకా ఉత్సాహంగా సాగింది.

"సరే... అయితే సీతమ్మ నడుగుతా" అని పాటలు పాడుతూ కట్నంగా యిచ్చే వస్తువుల్ని ఏకరువు పెట్టి "నీకు యింపిత మేనా" అని అడిగాడు. అయినా అది తల అడ్డం తిప్పింది.

"అయ్యా మీ సీతకు యింకా ఏమంట. కట్నం సాలదంటనా? "

"కట్నం సాలక కాదయ్యా"

"ఇంకెందుకంట"

"అది నేను చెప్పనయ్య" అంటూ వెళ్లి ఆ ముందర కాలుమీద కాలేసుకొని కూర్చు న్నాడు మునస్వామి.

"అయ్యా యింకేమిటో చెప్పయ్యా" బతి మలాడుతున్నట్టన్నాడు బీశేరయ్య.

"ఆహా...ం నేను చెప్పను" ఇంకా నీలి గాడు మునస్వామి. వాళ్ల నటన చూసి కడుపుబ్బ నవ్వుతున్నారు జనం.

"నీ కాళ్ళు పట్టుకుంటాను చెప్పయ్యా వియ్యంకుడా" బీశేరయ్య అన్నాడు.

"ఏదీ నా వటక్కాయ పట్టుకో" అంటూ కాలు ఊపాడు.

"ఛీ... నిన్ను తంతారయ్య జనం. బూతులంటున్నావు"

"నేను నా వట్టికాలు పట్టుకోమన్నాను.

అది నీకు బూతుమాటనిపిస్తే నీకు పందుం చెవుడున్నిట్టు లెక్క... సరే నా కాలు పట్టుకో చెప్తా" అన్నాడు మునస్వామి.

బీశేరయ్య అతని కాలు పట్టుకొని "ఏమ నిందయ్యా నీ సీత" అన్నాడు.

మునస్వామి పైకిలేసి "సెప్తా యినుకో వయ్యా..." అన్నాడు.

"చెప్పు చెప్పు" అన్నాడు బీశేరయ్య.

మునస్వామి ఒక పాటలాగా చెప్పసాగాడు-

"మీ రాముడు కర్రోడంట, మీ రాముడు యెర్రోడంట. అందుకే మా సీత వప్పననింది"

"ఎట్టయినా సరే సామీ... వప్పించు. నీకు కట్నం యింకా ఎక్కువిస్తా"

"అయితే మా సీతను అడిగిచూస్తా" అని ఆవు ముందరికి వెళ్ళి కట్న కానుకలు చెప్పి "ఏమే సీతమ్మా... రామున్ని వప్పి నావా" అన్నాడు మునస్వామి.

ఈసారి ఆవు అవునన్నట్లు తల నిలువునా ఊపి పైకి లేచింది.

అది చూసి మునస్వామి "చూడయ్యా పెద్దాయనా... నెరిసి నలభై ఏండ్లయినా వుంటారంట. నలుగుబెట్టి నాలుగు నిమిసాలు తాలలేరంట. అట్ల మా సీత కట్నం మాట యినగానే నీ కర్రిరాముడి కోసం బో తొందరపడుతోంది చూశావా?" అన్నాడు.

అందరూ మరోసారి గొల్లున నవ్వారు.

ఆ తర్వాత ఆవును ఎద్దు పక్కకు తోలి, జతచేసి పెళ్లిమేళం వాయించాడు బీశేరయ్య. కనకయ్య డోలు కొట్టసాగాడు.

"సీతారాముల కళ్యాణం చూతమురా రండి" అన్న గీతం శ్రావ్యంగా సన్నాయిలో వినిపిస్తుంటే పల్లెజనం ఇండ్ల దారి పట్టారు.

గంగెద్దలాట ముగిసింది.

18



## దొరలు-దొంగలు

కమ్మపల్లెలో గంగెద్దలాట ముగించి, ప్రేక్షకుల నుంచీ వచ్చిన డబ్బుల్నీ, వస్తువుల్నీ ఎత్తుకొని యింటికొచ్చి, గంగెద్దును, ఆవును పందిరి కింద కట్టేసి వచ్చి పడుకున్నారు వాళ్లు.

ఆ మరునాడు తెల్లవారిగానీ గొడ్ల దొంగతనం జరిగిండే విషయం తెలియలేదు.

తెల్లవారుజామున యథాలాపంగా భాగ్యమ్మ కొట్టంలో పేడకళ్ళు ఎత్తడానికి వచ్చింది. ఆ సమయంలో సేద్యపు గొడ్లు లేకపోవడంతో పరిగెత్తుకుంటూ వచ్చి ఇంట్లో చెప్పింది.

"ఎప్పటినుంచీ కనిపించలేదు?" కంగారుగా అడిగాడు బీశేరయ్య.

"రేత్తిరి... పానుకునేముందు వాటి గాట్లో వరిగెడ్డి యేసివచ్చింది నేనే. అప్పటికి వున్నాయి" చెప్పింది కనకమ్మ.

పొద్దు పుట్టేటప్పటికి ఆ వార్త పల్లెలో సంచలనం రేపింది.

బీశేరయ్య... కనకయ్యను, కఠారి రామున్ని ఛార్జీలిచ్చి తలో పక్కకు పంపాడు... తానూ వెతుక్కుంటూ పాకాలవైపు బయలుదేరాడు...

అలా వెళ్ళి వాళ్ళు ఆ రెండురోజులూ వెతికి పశువుల పండగనాటికి వట్టి చేతుల్తో తిరిగొచ్చారు.

తనతో కబడీ ఆడే కోడే లేకపోవడం

బాలయ్యకు చాలా బాధ కలిగించింది. గొడ్లు పోయిన బాధతో ఆ రెండురోజులు కుటుంబంలో ఎవరికీ తిండి సహించ లేదు... కంటికి కునుకు రాలేదు.

బీశేరయ్య తనకు అనుమానమున్న ప్రాంతాలన్నీ వెదికి తిరిగొస్తూ వస్తూ పాకాల పోలీస్‌స్టేషన్‌లో రిపోర్ట్ కూడా యిచ్చి వచ్చాడు.

పశువుల పండుగనాడు పశువులు కని పించకుండా పోవడం అశుభంగా భావిం చారు వాళ్ళు.

ఆరోజు ఊర్లో... ఆవల సుబ్బన్న... పశువులనన్నింటిని పెద్దచెరువు నీటిలో ఈదులాడించి మేతకు తోలుకెళ్ళాడు!

ఊర్లో ఇళ్ళ దగ్గరున్న పశువులను ఒకరో కరే... చెరువులో ఈదులాడించో లేదా బావుల్లో తోలో... స్నానం చేయించి ఇళ్ళకు తీసుకువచ్చి దోశలు తినిపించి ఒక్కపొద్దు తీర్చారు... ఆ తర్వాత పశు వుల కొమ్ములకు రంగులు పూశారు.

కనకయ్య మచ్చుకొడవలెత్తుకొని మున స్వామిని వెంటతీసుకొని... వేల్పులబీటిలో వున్న మర్రిచెట్టు బెరడునుంచీ పట్టెడు చెక్క సేకరించాడు. ఆ తర్వాత తుమ్మ చెక్క, సుంకేసర చెక్క, మేడిచెక్క, బాగి చెక్క సేకరించి తీసుకొచ్చి ఆ చెక్కను రొట్లో వేసి దంచాడు!...

దాంట్లోకి ఉప్పురాళ్ళు వేసి చేట్లో పోసుకొని వచ్చి, గొడ్ల నాలుకలను చేత్తో తీసి వాటిపైన చెక్కేసి రుద్దాడు... గంగెద్దు సరిగా మేయడం లేదని, వరిగడ్డి పోచలు తెచ్చి బొటనవ్రేలి లావుతో పెన వేసి, దాని నోటికేసి బిగించి కొమ్ములకు ముడి వేశాడు... అది దాన్ని నమలలేక నోరు ఆడిస్తుంటే దాని నోటినుంచీ చొంగ కారసాగింది.

అంగడింటికి వెళ్ళి బులుగురంగు పౌడరు తీసుకొచ్చాడు....

బీశేరయ్య ముక్కుతాడు సాయంతో కద లకుండా పట్టుకుంటే... గొడ్ల కొమ్ముల్ని, మచ్చుకత్తితో బాగా జివిరాడు కన కయ్య....

ఆ తర్వాత గంగెద్దు కొమ్ములకు వదు లుగా వున్న కంచుకుప్పెల్ని గగ్గిరెట్లను తీసి, చింతకాయతో తోమి వాటిని తళతళ లాడించాడు! ఆ తర్వాత గంగెద్దు కొమ్ము ల్నీ జివిరాడు... లక్కతెచ్చి పొడిచేసి కుప్పెల్లో కూరాడు... వాటికి గగ్గిరెట్లు తొడిగి, బాగా ఎర్రగా కాగిన ఇనుపకడ్డీని కుప్పెలో కూరిన లక్కలో వేసి తిప్పుతూ... వేడి చల్లారకనే ఎద్దు కొమ్ము లకేసి బిగించాడు. అవి ఎద్దుకొమ్ములకు అతుక్కుపోయాయి. ఆ తర్వాత బులుగు రంగు పొడిలో నీళ్ళు కలిపి, ఒక చిన్నగుడ్డ పీలిక అందులో ముంచి, రంగు అద్దుకొని పశువుల కొమ్ములకు పూశాడు. ఆపైన వాటి విలువను బులుగురంగుతోనే వాటి శరీరాలపైన అంకెల్లో వేశాడు...

ఆవిధంగా గంగెద్దు వీపున పదివేలు అని రాశాడు!... రంగు కాగితాలు తెచ్చి సన్నగా కత్తిరించి గంగెద్దు కొమ్ములకు అతికించి సింగారించాడు!...

ఈ తతంగమంతా అయ్యేసరికి మధ్యా హ్నామైపోయింది. గంగెద్దుకు గడ్డికళ్ళెం విప్పి, అంత అన్నం తిని గొడ్లను మేతకు తోలుకువెళ్ళాడు. బీశేరయ్య సీతమ్మను, గంగెద్దును మేతకు తోలుకువెళ్ళాడు.

వాళ్ళు ఎద్దుల్ని తోలుకుని తిరిగొచ్చేటప్ప టికి పల్లె కోలాహలంగా వుంది...

ఎద్దులకు చెక్కపలకలు కట్టుకొని కొందరు, ప్రభలు కట్టి కొందరు రంగు కాగితాలు చుట్టి కొందరు... అలంకరించు కొని ఊరికి దక్షిణం వైపున్న బీడుచేల్లోకి తోలుకు పోతున్నారు.

బీశేరయ్య... రెండురోజుల క్రితం పులి చెర్ల సంతలో గంగెద్దుకోసం కొనుక్కొచ్చిన

రంగురంగుల 'ప్రభ'ను తెచ్చి గంగెద్దు కొమ్ములకు కట్టాడు.

బీశేరయ్య గంగెద్దును, ఆవును పట్టుకొని బయలుదేరితే మిగిలిన గొడ్లను కనకయ్య తోలుకు రాసాగాడు. మునస్వామి, బాలయ్య ఇద్దరూ... దేవరెద్దుగుడికి వెళ్ళి దేవరెద్దుగా మారిన దేశపు కోడెను పట్టుకొని చిట్లాకువ్వ దగ్గరకు బయలుదేరారు.

గంగెద్దు వీధిలో... ప్రభతో హుందాగా నడుస్తుంటే దాని ఎత్తయిన గోపురంతో... కనుల పండువుగా కనిపిస్తోంది. కొందరు పిల్లలు, ఆడవాళ్ళు వచ్చి ఆవు వీపున ఉన్న కాలుకు మొక్కుకొని వెళుతున్నారు....

ఊర్లో అన్ని పశువులు అక్కడికి చేరిపోయాయి... ఆవల సుబ్బయ్య అప్పటికే ఆవుల్ని అక్కడికి తోలుకొచ్చేశాడు...

ఆ బీట్లో దేవమూల వున్న చిన్న చిగర చెట్టుమొదలు చుట్టూ గడ్డి చెక్కేసి, పేడతో అలికి మూరెడు పొడవున్న నున్నటి నల్ల రాయిని కాటమరాజుగాను, దానికిరువైపులా మరికొన్ని రాళ్ళు వీరులుగాను భావించి కాటమరాజు కొలువు ఏర్పాటు చేయబడింది. గొల్ల సుబ్బయ్య, కఠారి ముత్తయ్య, చెంగారెడ్డి లాంటి ఊరిపెద్దలు అక్కడ అన్నీ నిర్వహిస్తున్నారు...

దానిపక్కనే... మూడు రాళ్ళు పొందించి కొత్త చట్టిలో బియ్యము బెల్లం వేసి బోణం వండుతున్నారు కొందరు....

ఆ కొలువుకు కొన్ని అడుగుల దూరంలో ఒక చిన్నపాటి చుట్టిల్లు లాంటి చిట్లాకువ్వ వేయబడివుంది

ఆ వేడుక చూడటానికి ఊర్లో దిగిన చుట్టాలతోబాటు అక్కడున్న చెట్లకింద కూర్చొని ఊర్లో మగవాళ్ళు కబుర్లాడుకుంటున్నారు. కొందరు మాదిగలు డప్పులు కొడుతూ గొడ్లను బెదిరిస్తున్నారు.

ఒక చెట్టు కింద కూర్చొని పశువుల్ని చూస్తున్న గూకా చెంగడు, నుసకడు, కఠారి రాముడు కబ్లుర్లలోకి దిగారు. వాళ్లిద్దరిలో గూకాచెంగడు వయసులో కాస్త పెద్దవాడు. అతను ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు.

"పూర్వకాలంలో మనుషులకు ప్రధాన ఆస్తి పశువులే... భారతంలో... అజ్ఞాత వాసం గడుపుతున్న పాండవుల ఆచూకీ కనిపెట్టేదానికి కౌరవులు విరాటరాజు గోవుల్ని అటకాయిస్తారు. ఉత్తర గోగ్రహణం కథ మీకు తెలుసు కదా" అన్నాడు చెంగడు.

"అవునబ్బా... ఆ కాలంలో అన్నన్ని పశువులున్నాయి మరి. రేపల్లెలో క్రిష్ణుడు గోవర్ధనగిరిని చిటికినేలుతో ఎత్తి గోవుల్ని కాపాడిన కథ కూడా ఉంది కదా" అన్నాడు రాముడు.

"అది గాదు... అసలు ఈ పసల పండగనాడు కాటమరాజును ఎందుకు నిలపతారు... అసలు కాటమరాజు ఎవరు... గోవులకు ఆయనకు సంబంధమేమి... ఒగేళ ఆయనేమన్నా పశువుల దేవుడా? " అనుమానం వ్యక్తం చేశాడు నుసకడు.

"ఒరే నుసకా... నేను కంపల్లె స్కూల్లో అయిదువరకు సదువుకున్నా గదా. నేను అయిదు సదివేటప్పుడు.. 'కాటమరాజు కథ' అనే పాఠం వున్నింది. ఆ పాఠం చెప్పేటప్పుడు దీని గురించి చెప్పినాడయ్యా మహన్నభావుడు... అప్పాసామి అయివోరు సచ్చి యాడుండాడో గానీ భలే యివరంగా చెప్పినాడబ్బా"

గతాన్ని తల్చుకుంటూ అన్నాడు చెంగడు.

"అదే కొంచెం యివరంగా చెప్పబ్బా..." రాముడడిగాడు. గూకా చెంగడు చెప్పసాగాడు.

"అప్పుడెప్పుడో కొన్ని నూర్ల సంవత్సరాల కిందట కనిగిరిని యాదవరాజులు ఏల్తా వున్నారంట. ఆ రాజుల్లో కాటమరాజు

ఒకడు. ఆయనన్నందరు ఆవులన్న అంటా రంటలే. వాళ్ళకు కుదిరితే ఆరామడ - కదిలితే పన్నెండామడ విస్తీర్ణం వుండే పశుసంపదున్నిందంట. వాటిని గుర్రాలపైన తిరగతా మల్లేసేవోళ్ళంట. అవి మేతకు యలబారితే ముందు పోయేవాటికి గడ్డిలో పై ఆకులు, ఆ తర్వాత బోయేవాటికి కొనలు, ఆ తర్వాత పోయినవాటికి ఏర్లు మాత్రమే మిగిలేవంట. అట్టాంటి పశువులకు ఒకసారి దేశంలో కరువేర్పడి మేత లేకుండా అయిపోతే కాటమన్న మందీ మార్బలంతో గోవుల్ని మేపుకుంటూ నెల్లూరు సీమకు వచ్చినాడంట. నేరుగా నెల్లూరునేలే నల్లసిద్ధిరాజు దెగ్గరికి కాటమయ్య పొయ్యి పుల్లరి చెల్లించి గోవులు మేపుకునేదానికి అనుమతి పొందినాడంట"

"పుల్లరంటే" మధ్యలో అడిగాడు నుసకడు.

"పుల్లరంటే పన్ను.. అంటే శిస్తూ రూకలు" చెప్పాడు రాముడు.

"అన్ని గోవులకు శిస్తు రూకలెట్లబ్బా కట్టేది" అన్నాడు నుసకడు.

"రూకలంటే దుడ్డే గాదురా నీ పాసుల గూల... వాళ్ళడిగిన శిస్తు ఎలాంటిదో తెలుసా... రెండు తట్టల రొక్కం.. ఆమింద 'ఆవుకు పుట్టిన కోడెల్లా మాదే' అని కోరినారు" వివరించాడు గూకా చెంగడు.

"సరే. యింక చెప్పు" అన్నాడూ నుసకడు.

"అయితే... కుందమాదేవి అని సిద్ధిరాజుల ఉంపుడుగత్తె పెంపుడు చిలకనొక రోజు కాటమయ్యవోళ్లు చంపేస్తారు. దానికి పగబట్టిన ఆయమ్మ బోయీలను పిలిపిచ్చి కొన్నివేల ఆవుల్ని అర్ధరాత్రి పూట పొడిపించేసిందంట. ఆ విషయం తెలుసుకున్న కాటమరాజు పుల్లరి ఎగనూకుతాడు. కుందుమాదేవి చేసిన ద్రోహం ఆయప్పకతెలవలా.... ఫలితంగా ఎర్రగడ్డపాడు అనే సాట యిరువర్గాల వారికి యుద్ధం జరుగుతాది. నల్లసిద్ధి సేనాధిపతి ఖడ్గతిక్కనైతే, కాటమయ్య సేనాపతి బ్రహ్మరుద్రయ్య. ఆ యుద్ధంలో బొల్లావు, ఒంటి కొమ్మావు వంటివి కూడా యుద్ధంచేసి శత్రువుల్ని జయించినాయంట. ఆ యుద్ధంలో కాటమరాజుకు జయం లభించినా, అందరూ సచ్చిపోయినారంట. గోవుల కోసమే, పరాయిదేశం పొయ్యి అక్కడి రాజుల్ని జయించడం సామాన్యమైన విషయం కాదుకదా. అందువల్ల అప్పట్నుంచీ ఆయప్పను ఆవలకు దేవున్ని జేసినారు. కులాలతో సంబంధం లేకుండా ఆవులున్నోళ్ళందరూ పసల పండగనాడు పశువుల దెగ్గిరా కాటమరాజును నిలిపి, ఆయప్ప సుట్టకారమూ, ఆ యుద్ధంలో సచ్చిపోయిండే వీరులకు గుర్తుగా వీరగల్లులు నిలిపి, బోణం వండి, సిట్లా కువ్వకు అగ్గిపెడతారు" సుదీర్ఘంగా చెప్పాడు చెంగడు.

"వీరగల్లు అంటే" మళ్ళీ అడిగాడు నుసకడు.

"ఎవరైనా శత్రువుల్ని ఎదుర్కొని వీరమరణం పొందితే వాళ్ళకు గుర్తుగా స్థాపించుకున్న రాళ్లు" చెప్పాడు చెంగడు.

"యింత యివరంగా నువ్వు సదివిన సదువుల్లో వున్నిందా? "

తిరిగి ప్రశ్నించాడు నుసకడు.

## కొత్తగాలి...

**ఓ ప్రియా ప్రతిరాత్రి**
**పలకరిస్తావు కలలో**
**కన్నెత్తయినా చూడవు**
**నావైపు ఇలలో**

- వై.కె.మూర్తి, విజయవాడ

"అబ్బబ్బ అనుమానం ముందు బుట్టి, ఆ తర్వాత వీడు పుట్నట్టుందే. ఏమిరా... రేత్తిర్లో దాసరోళ్లొచ్చి నడీదిలో తాంబుర్ర వాయిస్తా గుమ్మిత కత చెప్తారు కదా... ఎప్పుడూ విన్లేదా"

"యిన్నాను గానీ, అంత గెవనానికి (జ్ఞాపకానికి) లేదు. నువ్వేమీ అనుకోవద్దబ్బో.. యింకో అనుమానం? "

రాజ్జ్యాలు యేలినోళ్ళు రాజులు, బ్యామ్మలు, రెడ్లు... కాదంటే నాయుళ్ళు... వోళ్ళకు సంబంధించినవి తక్కువైనా ఎట్లో వొగట్ల ఎక్కువజేసి రాయించుకునేవోళ్ళు. పైగా ముందంతా బ్యామ్మలేగదా కావ్యాలు... కాండిన్యాలు రాసేవోళ్ళు... వీళ్ళేమో శూద్రులైపోయిరి.... వోళ్ళు ఎట్ల రాస్తారు చెప్పు"

"అదీ నిజమేలే"

అంతవరకూ మౌనంగా వాళ్ళ సంభాషణ వింటున్న రాముడు పైకి లేచి "యింక లెయ్యం డబ్బా పిలస్తావుండారు గానీ" అన్నాడు.

ముగ్గురూ కలిసి కాటమరాజు కొలువు దగ్గరికి వెళ్లారు. ముత్తయ్య... బోణంకుండలోనుంచీ అంత బెల్లమన్నం తీసి కాటమరాజుకు నైవేద్యం పెట్టాడు.. కేశవరెడ్డి ఒక పొడుగాటి చొప్పకట్టను తీసుకున్నాడు. గొల్ల సుబ్బయ్య బోణం సట్టి చేతబట్టుకున్నాడు. కేశవరెడ్డి చొప్ప కట్టను వెలిగించి, దాంతో చిట్లాకువ్వకు నిప్పుపెట్టి, ఆ మంట ఎక్కువయ్యేలోపు అక్కడ చేరిన పశువులకైవారం చుట్టి వస్తుంటే, సుబ్బయ్య గరిటతో బోణాన్ని విసరి విసరి పశువులపైన చల్లుతూ ఒక రౌండు పూర్తిచేసి వచ్చారు.

అప్పటికి చిటపట శబ్దం చేస్తూ చిట్లాకువ్వ మంట ఆకాశానికెగిసింది... పశువుల యజమానుల్లో కోలాహలం... డప్పుల శబ్దం... దాంతో పశువులన్నీ, బెదిరి ఊర్లోకి పరిగెత్తసాగాయి. ఊర్లో పండగపూట పశువులు గడ్డి మేస్తే మంచిదని తమ తమ ఇండ్ల ముందర పచ్చిగడ్డి వేసివున్నారు.

## అప్పుడెందుకు పట్టుకోలేదో?



ఒకటో తరగతి పిల్లల్ని ఫీల్డ్ ట్రిప్పులో భాగంగా ఓ పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్లారు. అక్కడ ఓ బోర్డుకు పరారీలో ఉన్న 10 మంది ఖైదీల ఫొటోలు అతికించి ఉండడం చూశారు.

చిన్ను అడిగాడు, 'నిజంగా అవి దొంగల ఫొటోలేనా? '

'అవును. పోలీసులు వాళ్లను పట్టుకునేందుకు కష్టపడుతున్నారు? '

'ఆ ఫొటోల్ని తీసుకునేటప్పుడే వాళ్లను పట్టుకోవచ్చు కదా? ' తెలివిగా ప్రశ్నించాడు చిన్ను.

"నిండా మునిగినాంక సలేముండాదిలే.. చెప్పు చెప్పు"

"ఈ కాటమరాజు ఎంత గొప్పోడు కాకపోతే... మన దేశమంతా ఈ దినం ఆయన కొలువు బెడతారు.. మరి అంత గొప్పోడి గురించి మనకు తెలిసింది తక్కువేనే... ఇప్పుడూ క్రిష్ణదేవరాయల గురించి తెలుసు. ప్రతాపరుద్రున్ని గురించి తెలుసు... ఢిల్లీ సుల్తానుల గురించి తెలుసు.... నేను రెండోక్లాసులో సుమారుగా సదువుకున్న గుర్తు... మరి... కాటమరాజు గురించి ఎవురికీ తెలీదే... ఎందుకు? "

"వొరే... నీ పాసులగోల... ముందు

# స్పీకర్ గారి దాతృత్వం

లోక్‌సభ స్పీకర్ అయిన అనంతశయనం అయ్యంగార్ తన బంగ్లాలో ఒకరోజున ఆఫీసు గదిలో కూర్చుని ఏదో రాసుకుంటున్నారు. ఆ సమయంలో ఓ పేదవాడు ఎంతో శ్రమపడి ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చాడు- అయ్యంగారి సహాయం కోసం. అప్పుడు మధ్యాహ్నం ఒంటి గంట అయింది. అది అయ్యంగార్ భోజనానికి వెళ్లే సమయం. ఆయన కూర్చున్న పక్క గదిలో సెక్రటరీ పేదవానిపై చికాకుపడుతూ, "ఇప్పుడు అయ్యంగారిని కలవడానికి వీల్లేదు. ఇదాయన భోజనానికి వెళ్లే సమయం. నువ్వు వెళ్లి 4 గంటలకు రా" అన్నాడు.

ఈ మాటలు ఆయన చెవిన పడ్డాయి. వెంటనే సెక్రటరీని పిలిచి,

"భోజనానికి ఆలస్యం అయినా పర్వాలేదు. ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చిన అతను పాపం ఈ మహానగరంలో గంటలకొద్దీ ఉండలేడు. వెంటనే అతణ్ణి ఇక్కడకు తీసుకురా" అన్నారు.

పేదవాడు అయ్యంగారి గదిలోకి వెళ్ళాడు. తను వచ్చిన పని చెప్పాడు. అయ్యంగారు వెంటనే సంబంధిత అధికారికి ఫోన్‌చేసి అతడి పని పూర్తిచెయ్యమని ఆదేశించారు. ఆ అధికారి వద్దకు పేదవ్యక్తిని తీసుకువెళ్ళి అతని పని చేయించమని సెక్రటరీకి చెప్పారు. పేదవాడు ఎంతో సంతోషంతో అయ్యంగారి పాదాలకు నమస్కరించాడు. అతణ్ణి లేవనెత్తిన అయ్యంగార్ దారి ఖర్చులకు వందరూపాయలు ఇచ్చారు.




అన్నాటి నిజం

# వినమ్రత

లోక్‌సభ మాజీ స్పీకర్ అనంతశయనం అయ్యంగార్ ఒకసారి రైల్లో ప్రయాణం చేస్తుంటే, ఆయన రైలు టిక్కెట్ ఎక్కడో పడిపోయింది. టిక్కెట్ కలెక్టర్ ఆయన్ను టిక్కెట్ అడిగాడు. అతనికి అనంతశయనం ఎవరో తెలియదు.



"నా టిక్కెట్ కనపడటంలేదు. దయచేసి నా సహాయకుడు వచ్చి మీకు డబ్బిచ్చేదాకా ఈ చేతివాచీ మీ దగ్గర ఉంచండి!" అన్నారు అనంతశయనం గడియారాన్ని టీసికి అందచేస్తూ.

రైలు ఆగిన తర్వాత అయ్యంగారికి స్వాగతం పలకడానికి అనేకమంది రావడం.. ఆయన్ను దండలతో ముంచెత్తడం చూసిన టిసి అసలు విషయం తెలుసుకొని భయపడ్డాడు.

"అయ్యా! క్షమించండి! తమరు ఎవరో తెలియక అలా చేశాను" అంటూ వాచీని ఆయన చేతికి తొడిగాడు. చిరునవ్వుతో అయ్యంగార్, "ఇందులో మీ తప్పేమీ లేదు. మీ డ్యూటీ మీరు చేశారు" అన్నారు.

ఊరంతా ఆవుల్ని బెదిరిస్తూ కోలా హలంగా వుంది.

కానీ కోడెలు పోయిన బాధలో ఏ కోలా హలమూ లేకుండా నిర్వేదంతో పశువులకు అగ్గి చూపించుకొని ఇంటిదారి పట్టారు బీశే రయ్య, అతని తమ్ముడు కనకయ్య.

ఆ దారిలో... 'హేయ్ హేయ్' అని మిడిమేళంగా అరుస్తూ తన గొడ్లను మీది మీదికి తోలుకొచ్చాడు కేశవరెడ్డి...

"ఎవర్రా వాడు మీదికి తోల్తాడు గొడ్లను. కండ్లు కనబడలేదా..." అంటూ వెనక్కి చూశాడు... కనకయ్య.

శంకర్రెడ్డి వంకరగా మూతి తిప్పి వికారంగా నవ్వాడు.

ఆ నవ్వు చూసి "గొడ్లను వీడే ఏమో చేసుంటాడు" అని మొదటిసారిగా అను మానపడ్డాడు.

ఇంకా గట్టిగా అదిలించి చూడు నా దెబ్బ అన్నట్లు తన ఎడ్లను బీశేరయ్య మీది కురికించాడు కేశవరెడ్డి.

తొక్కుతాయేమోనన్న భయంతో... పక్కకు గెంతడం, ఆ గెంతడంలో గంగెద్దు పగ్గం చేతిలో నుంచీ జారిపోవడం రెండూ ఒకేసారి జరిగాయి. అతను నేర్పుగా తప్పించుకున్నాడుగానీ పక్కనే రెండు మట్ల లోతున్న పాడుబడిన దిగుడు బావు న్నది. దాంట్లో పడిపోయేవాడే... అదే జరుగుంటే ఏ కాలో చేయో విరిగుండేది.

అయితే మనిషనుకున్నట్టే అన్నివేళలా జరగదు కదా...

కేశవరెడ్డి తోలిన వేగానికి... అతని ఎద్దొకటి గంగెద్దు మీద పడింది. ముందే బాగా బలిసిన ఎద్దు గంగెద్దు. దానికి కోపం ముంచుకొచ్చింది. వెంటనే వెనక్కి తిరిగి దాని డొక్కల్లో ఒక్క పోటు పొడి చింది. ఆ దెబ్బకు దాని కొమ్ములకున్న ప్రభ ముక్కముక్కలైంది గానీ, ఆ ఊపుకు కేశవరెడ్డి ఎద్దు వెళ్ళి ఆ పాత బావిలో పడిపోయి పైకి లెయ్యకుండా అయిపో యింది.

దాంతో "నీయమ్మా అరగాసు గొడ్డా... నిన్ను మేపినోడి ఆలీ తాడుదెగా" అంటూ పచ్చిగా తిడుతూ "గొడ్డును సంపితివి గదే" అన్నాడు.

"పండగపూట గొడ్డును తిడితే నీకే పాపాలు. పోరా... నాశనమైపోతావ్" అని తిట్టుకుంటూ కనకయ్యకు సర్దిచె బుతూ ముందుకు వెళ్ళిపోయాడు బీశే రయ్య.

వాళ్ళు ఇంటికి చేరేలోపే కేశవరెడ్డి ఎద్దుకు కాలు విరిగిందన్న వార్తా వాళ్ళ చెవిన పడనే పడింది.




## దొంగలు దొరకనేలేదు

**రెం**డు రోజుల తర్వాత పోయిన గొడ్లు దొరికాయని, వచ్చి గొడ్లను తోలకపొమ్మని బీశేరయ్యకు పోలీసుల నుంచీ వర్తమానం అంది, బీశేరయ్య కుటుంబం సంబరపడిపో యింది.

ఎడ్లు దొంగతనం జరిగిన తెల్లవారే పోలీసు రిపోర్టివ్వడం వల్ల పాకాల పోలీ సులు అప్రమత్తమయ్యారు.

ఏదో అనుమానం వచ్చి పాకాల గోవధ శాలపైన నిఘా వేశారు. వాళ్ళ అను మానం నిజమై, నిఘా ఫలించి, రిపోర్టి

చ్చిన రెండో రోజున కోతకొచ్చిన బీశేరయ్యా గొడ్లు వాళ్ళకు దొరికాయి.

బీశేరయ్యా ఆఘమేఘాల మీద వెళ్ళి పోలీసులకు, మామూలు చెల్లించి, ఎడ్లను తోలుకొచ్చుకున్నాడు.

పోలీసులు ఎంత అడిగినా ఎద్దుల్ని అమ్మిన దొంగను గురించిన సమాచారం మాత్రం గొడ్లు కొన్న వ్యక్తులు చెప్పలేకపో యారట.

బీశేరయ్యా గొడ్లు మళ్ళీ దొరికాయన్న సంగతి కేశవరెడ్డికీ, శంకర్రెడ్డికీ తెలియనే తెలిసింది. అగ్గిమీద గుగ్గిలమే అయ్యారు. కానీ ఏమి అనలేక తేలుకుట్టినదొంగల్లా మౌనంగా వుండిపోయారు. కానీ... తమ ఎద్దుకాలు విరిగినందుకు వాళ్ళ పగ మాత్రం యింకా రెట్టింపయింది.




బక్క జీవులు

**చే**న్లు పరిగిలిపోయాయి.

ఒకనెల పాటు గొడ్లకు యిబ్బంది కలగ లేదు...

గొడ్లను... ఆరోజు మధ్యాహ్నం పరిగిలి పోయిన చేన్ల బీళ్ళలో వదిలి వేల్పులు బీడులో కూర్చొని కనకయ్య, గూకా చెంగడు, నుసకడులాంటి యువకులు వానాగుంతలు ఆడుకుంటున్నారు.

వేల్పుల బీడుకు కిలోమీటరు దూరంలో తూర్పున పేరావాళ్ళపల్లె, ఉత్తరాన కమ్మ పల్లె, దక్షిణాన కూతవేటు దూరంలో ఘంటావాళ్ళపల్లె. కమ్మపల్లెదాటుకుని మరో మైలు నడిస్తే, కొత్తపేట, కొత్తపేట నుంచీ మరో మైలు నడిస్తే మంగళం పేట...

వేల్పులు బీడు పక్కనున్న చిన్నగుట్ట ఎక్కిచూస్తే ఇవన్నీ కనిపిస్తాయి. అవే కాదు... ఆ చుట్టుపక్కలున్న బావులు, చెరువులు, పొలాలు కూడా కనిపిస్తాయి.

దానిపైకి వెళ్ళి... ఆ పొలాలను చూడాలంటే కఠారిరాముడికి మరీ యిష్టం... వేల్పులు బీడుకవతల గొడ్లను వదిలి ఆ గుట్టపైన కూర్చొని పేరావాళ్ళ పల్లె వైపు చూస్తున్నాడు... అక్కడినుంచీ చూస్తుంటే అది మరీ దగ్గరగా అనిపి స్తోంది. పొలాల్లో గొడ్లు, చెత్తాచెదారం ఏరుకొని తింటున్నాయి... వేల్పుల బీడు కవతల... పేరావాళ్ళపల్లె కివతల మధ్య ప్రదేశంలో వున్న వ్యవసాయ బావినుంచీ ఎవరో కేకలు వేస్తున్నారు... ఏం జరి గిందో స్పష్టంగా తెలియడంలేదు.

గబగబా గుట్టదిగి “వారే చెంగా.... ఆ బాయికాడ ఎవురో అరస్తావుండారు, పరి గెత్తండ్ర” అన్నాడు.

ఆ మాటతో అందరూ అటువైపుకు పరిగెత్తారు...

అది కపిలబావి... కపిల తోలేట ప్పుడు... నిండుబానొ మీద కొనబారి లోకి వెళ్ళిన గొడ్లు బానలో నీళ్ళు దోణెలో కుమ్మరిల్లకనే వెనక్కి వచ్చేశాయి... బానలో నీళ్ళ బరువు గొడ్లను లాగే సింది... ఆ దెబ్బకు ఒక గొడ్డు దోణెలో పడిపోయివుంది. యింకో ఎద్దు బావి వైపు తిరిగిపోయి కాళ్ళు బిగదన్ని నిలబ డివుంది. మోకు పట్టుకొని ఎద్దులు బావిలో పడిపోకుండా లాగుతున్నాడో వ్యక్తి.

అది గంగచంద్ర బావి. ఆ ఎద్దులు

అతనివే...

అక్కడికి వెళ్ళి యువకులు ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఒకరు తొండం తాడు లాగి, బానలో నీళ్ళను కుమ్మరించే శారు.

ఆ తర్వాత అందరూ కలిసి దోణెలో పడివున్న ఎద్దును పైకిలాగారు.

"య్యోవ్ గంగచెంద్ర... ఇవి బక్కె ద్దులు... అంత నిండుకు నీళ్ళు ముంచక పోతేనేమి బానకు. అవి ఈడ్చొద్దా!..." అన్నాడు తన్ను కొయ్యమీద కాలుబెట్టి మోకును తీసేస్తూ కనకయ్య.

"లేదయ్యా... ఇవి పనికి దొంగ గొడ్లు... కొట్టకొనాకు పోయినాకా దానెమ్మ... ఆ వలపటెద్దు మొండికేసుకుని నిలబడిపోయింది. నిండు బానకదా. ఎనిక్కి యీడ్చేసింది" జరిగింది చెప్పాడు గంగచంద్ర

"మేముగానా రాకండావుంటిమో... ను వ్వా నీ ఎద్దులు బాయిలోపడి సచ్చిందురు పోండి... అందునా శ్యానా లోతుగా వుండాదిబాయి" బావిలోకి చూస్తూ అన్నాడు రాముడు.

"ముందే బాయిలో నీళ్ళు లేవు. ఏదో మునకలో అన్ని నీళ్ళున్నిటుండాయి. పండి టేగానా... పులుసులోకి ఎముకలున్నిండ వుపో" అన్నాడు గూకా చెంగడు.

"అవునయ్యా... ఇట్టా గొడ్డును పెట్టు కోని యెట్ల పనిజేస్తావుండావు? "అడిగాడు కనకయ్య.

"ముండనాకొడుకు... దళాల్ కాడు... సిన్నబ్బనాయుడు పుంగునూరు పరసలో పట్టిచ్చినాడు నాకు" యాష్టపోయాడు గంగ చంద్ర.

"పరసలో కొన్నవైతే ఆయనకు మాత్రం ఏం దెలుసుకానీ యాడన్నా తీసకపోయి అమ్మేసేయి. వీటితో యాగలేవుగానీ" అన్నాడు రాముడు.

"యేదో... దొంగలదోలాల" అన్నాడు గంగచంద్ర.

ఎద్దుల్ని, గంగచంద్రను ఆవిధంగా రక్షిం చినందుకు సంతోషిస్తూ 'మనగొడ్లు ఏమ య్యాయో' అనుకుంటూ మళ్ళీ వేల్పుల బీడు వైపుకు బయలుదేరారు వాళ్ళు. వాళ్ళ కబుర్లలో ఇదే విధంగా వరిగడ్డిబండి బోల్తాపడిన ప్రదేశాలు, గొడ్లు పొడిచి ప్రమాదాలకు గురైన వ్యక్తుల గురించి చర్చించుకుంటూ బీడుకు చేరుకున్నారు.




## మందుల పర్వం

ఈ సంఘటన జరిగిన సరిగ్గా పది రోజులకు...

పిడుగుగొట్టిన చిన్నకోడె మాటిమాటికీ దగ్గుతోంది. గడ్డి సరిగా తినడం లేదు. వల్లంతా మబ్బేసుకుంది.

పొట్టలో ఏమో అయిందనుకొని బీశే రయ్య గాడిద కడుపాకు తెచ్చి నూరి తిని పించాడు. అయినా తగ్గలేదు.

పశువుల వ్యాధులకు మందులిచ్చే గూకా చెంగన్ని పిల్చుకొచ్చి చూపించాడు.

గూకాచెంగడు గొడ్డును బాగా పరిశీలిం చాడు... పరిశీలించి "గొడ్డు వల్ల గీలింది (అనారోగ్యం)... కుర్రం వల్లా" అన్నాడు చెంగడు.

"కుర్రం అని ఎట్ల కనిపెట్నావురా చెంగా నువ్వు? " అడిగాడు.

"కుర్రం వచ్చిన గొడ్డుకి... యిద్దో

సూడు... ముక్కు నోరు పుండయింది. మేత తినలేక జోము (చొల్లు) కార్చుకుం టావుంది... యిది ఎక్కువైతే కాళ్ళకు దిగు తుంది. అప్పుడు గొడ్డు యిదేమాదిరి మబ్బేసుకోని నాలుగు కాళ్ళు కుంటు తుంది. అప్పుడు దాన్ని కుంటుకుఱం అంటారు. మొత్తానికి బాన్నే కనిపెట్టాం. లేకంటే ఈ కుఱం కాస్తా కుంటుకుఱం అయ్యేది" చెప్పాడు చెంగడు.

"ఇప్పుడు దీనికేం జేయాల"

"చెప్తా" అంటూ దాని అఱ్రును చూశాడు. దానిపైన ఉడుకుగడ్డలా ఏదో ఎత్తుగా వెలిసింది... "న్నోవ్! అఱ్రుగడ్డ కూడా అయింది గదన్నా" అన్నాడు.

"అయ్యో... అవునే నేను గెవనించనే లేదే" ఆ గడ్డను పట్టి చూస్తూ అన్నాడు బీశేరయ్య.

"వీటికి మందులెట్టబ్బా..."

"నేను యింటికి బొయ్యి... సంగటి తినే సొస్తా... అంతలోపల నేను చెప్పేవి తెచ్చి పెట్టు"

"సెప్పబ్బా తెస్తా"

"జిట్టవాకు, జిల్లేడు కొనలు, రెప్పాలకొనలు, ఇసందారాకు, తక్కెళ్ళాకు, నేలపైన అల్లుకోనుంటాది సూడు తాళిబొట్లాకు అదీ, తెల్లగడ్డలు, మిరపగింజలు (మిరియాలు) తెచ్చిపెట్టు... ఇవన్నీ కుఱానికి... యింక బోతే అఱ్రుగడ్డకు సపరేటుగా ఎఱ్రబద్దాకు తే... అదీ మామూలు ఎరబద్దాకుగాదు ముండ్ల ఎఱ్రబద్దాకు తే" లిస్టు జెప్పి వెళ్ళిపోయాడు చెంగడు.

బీశేరయ్య ఒక చేతిసంచి పట్టుకొని చేన్లపైన బడ్డాడు... ఒక గంటసేపటికి అన్నీ సేకరించుకొని తిరిగొచ్చి చెంగన్ని పిలిపించాడు!

చెంగడు వచ్చి ఎఱ్రబద్దాకు పక్కన బెట్టి మిగిలినవన్నీ రోటిలోకేసి దంచసాగాడు. అతనివైపే విచిత్రంగా చూస్తూ నిలబడ్డాడు బీశేరయ్య.

## కొత్తగాలి...

**అయిదు సంవత్సరాలకొకసారి**
**పైకితీసే**
**తుప్పపట్టిన ఆయుధం**
**మన ఓటు**

**-జెయమ్**, రాయగడ

"అవునయ్యా చెంగా... యింత సిన్నవయసులో ఈ విద్దె నీకెట్ల అబ్బిందిరా" అని అడిగాడు బీశేరయ్య.

"మా నాయనకు గొడ్ల గురించి బాగా తెలుసన్నా... మా నాయన మంచి వైద్దె గాడు గదా... ఆయన జబ్బుపడి సచ్చిపోయి నాలుగేండ్లాయకదా. సచ్చిపోతా సచ్చిపోతా ఈ వైదిగిం నాతో పోకూడదు. మా తాత మా నాయనకు నేర్పించినట్టుగా, మా నాయన నాకు నేర్పించినట్టుగా నేను నా కొడుక్కి నేర్పిస్తానని ఇవన్నీ నేర్పించినాడు. మహానుభావుడు. సచ్చి యాడుండాడో... మనషులకయితే ఈదికొక డాక ట్రుండాడు. పాపం. నోరూ వాయీ లేని ఈ జీవాలకు ఎవురు వైదిగం జేస్తారు. ఇది గూడా వొగపున్నెమే అనుకోని ఇది నేర్చిపెట్టుకున్నె" చెంగడు చెప్పాడు.

"గొడ్లకు జబ్బుల గురించి నాకూ కొంచెం సెప్పబ్బా. తెలుసుకుంటా... నిన్ను జూస్తావుంటే నాకూ భలే మునాస (ఉత్సాహం)గా వుండాది"

"గొడ్లకు శ్యానా రోగాలొస్తాయన్నా... అందులో సబ్బువాపు ఒగటి. ఇది గంగమ్మ... వళ్ళంతా పుండు పుండ్లయి తాది. దానికప్పుడు వళ్ళు సలవజేయాల. లేకంటే తగ్గదు"

"దానికేం జేయాల"

"మనుషులకు మాదిరే యాపాకు

## కొత్తగాలి...

**నిన్ను చూసినరోజు**
**పండువెన్నెలే నాకు**
**సుందరస్వప్నాల విందు**
**మనసంతా నిండు**

*–తమిరిశ జానకి, హైదరాబాద్*

పూయాల. దీంతర్వాత గుండి చీల ముక్కె సంగా తెలుసుకోవాల్సింది"

"గుండి చీల అంటే..."

"గుండె.. అర్ట్ పెయిలన్నా... యిదొస్తే గొడ్డు ఉన్నిటుండి నిలవనా పడిపోతుంది. దీనికేమీ మందులేదు గానీ... గొడ్డు అట్ట పడిపోంగానే ఒక గుండ్రాయి తీసుకొని ఎదరొమ్మున గుద్దితే లేచి పరిగెత్తుతుంది"

"అది సరేరా సెంగా... నెరెడువాపు అంటారే. అదేందిరా? "

"నెరెడంటే పిచ్చన్నా... పొట్టలో వుంటుందది. గొర్రెలు పాడూ కోసేటప్పుడు చూడలేదా ఏలిపొడువుతో నల్లంగుంటుంది. దాంట్లో పచ్చంగా ఏసు కుంటుంది. దాన్ని కోసి పారేయాల. లేకంటే... అది పగిలితే మాంసం చేదెక్కి పోతుంది. ఆనేక ఆ మాంసం పారేయా ల్సిందే"

"అవున్రో. కోళ్ళకు కూడా వుంటుంది"

"అన్నింటికీ వుంటుందన్నా. మడిసికి గూడా వుంటుంది."

"సరే గొడ్లకు గాలమ్మొరొస్తుంది గదా. దానికేంజేయాల. మామూలు అమ్మొరొస్తే ఏంజేయాల..."

"మామూలు అమ్మొరు వస్తే... మూడు పూట్లా కల్లు తాపించాల. గాలమ్మోర్కైతే రాగిపిండి, ఉద్దెపప్పు, పెసరుపప్పు అన్నీ కలిపి కాంచి పాయసం పెట్టాల. ఆ పాయసం సల్లార్చి ఎదురు గొట్టంలో పోసి తాపిస్తేసరి... ఎలనీళ్ళగాయలు గూడా తాపిస్తే... బిరీనా కొలుకుంటుంది."

"సిన్న పిల్లలకు పడినట్ల గొడ్లకు కూడా మెడలు పడతాయి గదా"

"అవునన్నా నెలల పిల్లోళ్ళను ఎట్లంటే అట్ల ఎత్తుకుంటే మెడలు పడతాయి. అప్పుడేం జేస్తాము... ఆముదం తీసుకొని మెడలు, వళ్లు అంతా మర్ధించి మసాజా చేస్తాం... అనేక నెటికి తీస్తాం. అదే మాదిరి గొడ్డుకు కూడా నెటికి తీస్తాం... చెట్టుకోసి కొమ్ములు కట్టేసి, మెడకు పగ్గం గట్టి, ఎనకకాళ్ళ సందునతీసి లాగి నెటిక తీస్తాం. మెడకు ఎలనీళ్ళు పోసి మర్ధిస్తాం... మొన్ననేగదా మీ కోడెకు తీసి నాము"

నూరిన ఆకుల్ని మిరియాలు, తెల్లగడ్డల్ని వేసి మళ్ళీ నూరి బాగా కలిపి మూడు పెద్దవుండలు చేసి, ఆ ఉండల్ని గొడ్డు నోట్లో పోసి తురికి, నోరుమూసి పెట్టి మింగించాడు. ఆ తరవాత ఎర్రబద్దాకు రోట్లో వేసి దంచసాగాడు. ఒక చెంబు తెప్పించుకొని దంచిన ఆకునుంచీ రసం తీస్తూ కూర్చున్నాడు.

వాళ్ళ సంభాషణ తిరిగి ప్రారంభ మైంది.

"సరేబ్బా సెంగా! గొడ్లకు అప్పుడప్పుడూ కండ్లు బోతాయి గదా. అప్పుడేం జేయాల? "

"గొడ్లకు సామాన్యంగా కండ్లు పోవన్నా... నిజానికి కండ్లు పోతా యంటే... ఆసు తప్పుడ పక్షివొగటుంటుం దన్నా... అది పొడుస్తుందన్నా కండ్లకు బట్టీ"

"యిదేందిరా. నేనెప్పుడూ విన్లేదు"

"మనిషి చనిపోతే పాడెగట్టి ఎత్తకపోతా రుగదా గుంతలో యేసేదానికి. అట్ల గుంతలో యేసేముందు యాడనో వొగసాట దింపుడుకల్లెంగా పాడె దించ

తారు. ఆడ పిండాకూడు వండిన సట్టిని పగలగొడతారు. ఆమింద మూడుసార్లు సచ్చిపోయిండే మడిసి పేరు పెట్టి సెవులో అరస్తారు. ఆపైన శవాన్ని తీసుకపొయ్యి పూడ్చేస్తారు... అదయిపోయిం తర్వాత ఎప్పుడన్నా వాన బడతాది సూడు. ఆ వాననీళ్ళు తాగి బతకతాది వొగసిన్న గువ్వ. అది మట్టిరంగుతో వుండి ఏ చెత్త లోనో దాక్కోనుంటుంది. అది దేక్కుంటా, రెక్కలు కదిలిస్తా నడస్తాది. పైకి ఎగర లేంది. ఈ పచ్చి గనక గొర్రెల నడుంపైకి ఎగిరి కూసునిందనుకో వాటికి జడుంపెట్టు పడుతుంది. అంటే ఆ గొర్రె ఎప్పుడూ... సచ్చిపోయిన పిల్లను ఈనతాది. దానికెప్పుడూ పాలుండవు.. అట్టాంటి పచ్చిగొడ్లకు కండ్లు పొడిచేస్తాది. దీన్నే 'గువ్వపోటు' అంటారు. అట్ల గొడ్లకు కండ్లు బోతాయి" వివరించాడు చెంగడు.

ఆ విషయం వింటుంటే బీశేరయ్యకు చాలా ఆశ్చర్యం వేసింది.

"మరి దానికి మందు? " అనుమానం వ్యక్తం చేశాడు.

"ఏం లేదన్నా... చెట్లకు అల్లుకుంటుంది సూడు పొడపత్తిరాకు... ఆ ఆకుల్లో ఒక తెల్లగడ్డ, ఒక ఉప్పురాయి యేసి దొగ్గడ దొగ్గడగ నూరి, దాన్ని వొగ పసుపుగుడ్డలో యేసి రెండు చుక్కల పసరు కంట్లో పిండితే సాలు... ఎట్టా కంటికయినా సరే సూపొచ్చేస్తుంది"

చెంబులోకి పసరు పిండిన తర్వాత... ఆ పసరు తీసుకొని గొడ్డు దగ్గరి కొచ్చి ఆ పసరును అర్రు గడ్డపైన దట్టంగా పూయ సాగాడు చెంగడు.

"అబ్బా... భలే సెప్పినావు. గొప్ప వైదిగం (వైద్యం) అయ్యా నీది" మెచ్చుకోలుగా అన్నాడు బీశేరయ్య.

అర్రుకు పసురు పూయడం పూర్తిచేసి, అక్కడే పెరట్లో, మట్టి తొట్టిలో వున్న నీళ్ళతో చేతులు కడుక్కొని యింటిదారి పట్టాడు చెంగడు.




## బంధం బలపడింది

**క**తారి ముత్తయ్యా ఆవుకు కట్టు నిలిచి, అది సూడిది అయింది. కనకమ్మకూ ముట్టాగి గర్భవతి అయింది... ఆమె నోములు ఫలించాయి. కనకయ్యతోబాటు ఆ యింటి కుటుంబ సభ్యులందరూ సంతోషించారు. ముత్తయ్యా ఆవు నిండు సూటికి వచ్చి ఒక పేయదూడను ఈనింది. అయితే ఆవుదూడకు పాలివ్వకుండా కాల్తో తన్ని తోసేస్తోంది. మేయ కూడా వేయ లేదు.

అది గమనించిన రాముడు ఇంట్లో కూర్చొని వున్న తండ్రిని "నాయనా ఆవు దూడను వల్లుకోలేదు. ఏం జేయాల? " అని అడిగాడు.

"మట్టు నాకిందా..." అడిగాడు ముత్తయ్య

"నాకింది. అయినా యింకా మట్టు ఆరలే"

"మట్టు ఆరినాకా సూద్దాంగానీ... ఆవు మేయ వేసిందా? "

"లేదు... అట్ల కొన కనబడతావుంది అంతే"

"అయితే ముందు మన బాయికాడికి పోయి... నువ్వు చెట్లు రెండుండాయి

కదా... ఆ నువ్వులాకు పిడికెడు కోసకరా పో" అన్నాడు.

రామయ్య బాయికాడికి పరిగెత్తి నువ్వు లాకు పెరుక్కొచ్చాడు.

ముత్తయ్య ఆ నువ్వులాకుల్లో కాసిన్ని నీళ్ళుపోసి బాగా పిసికాడు. పిసకంగా పిస కంగా పసరుబంక తయారైంది. ఆ బంకను వెదురు గొట్టంలో పోసి ఆవు దగ్గర తాపించాడు. అంతే ఆ పసరు తాగిన కొంతసేపటికి మేయ పడిపో యింది...

"మేయను కుక్కలు తింటే మంచిది గాదు. తీసకపోయి యాడన్నా పుట్టలో యేసిరా" అన్నాడు ముత్తయ్య.

రాముడు ఒక పొడుగాటి కట్టెకు మేయను తగిలించుకొని వెళ్ళి పల్లెవెనక చేలల్లో ఒక పెద్ద పుట్టలో వేసి వచ్చేశాడు.

ఈ తంతంతా పూర్తయ్యేసరికి దూడకు మట్టు ఆరిపోయి మెల్లమెల్లగా అడుగు లేస్తూ తల్లి దగ్గర మళ్ళీ పాలు తాగడానికి ప్రయత్నించింది. అంతే ఆవు కొమ్ముల్తో దూరంగా తోసేసింది.

దాన్ని గమనించిన ముత్తయ్య... "వరె వరే... ఈ ఆవు దూడను తన బిడ్డగా అనుకోవడం లేదే... సరే" అనుకొని, 'హొరే రాముడూ... ఆవు ఆసనం దగ్గిర మెల్లిగా ఒక చెంబుడు నీళ్ళు బొయ్యి. ఆ నీళ్ళు దూడపైన పడేట్టుగా సూడు. ఆ తర్వాత అదే వల్లుకుంటుంది' అన్నాడు.

రాముడలాగే చేశాడు. తర్వాత ఆవు దూడకు హాయిగా పాలిచ్చింది. ఆ రోజు ఆ కుటుంబం ఆవు జున్నుతో ఆనందంగా కాలం గడిపింది.

## 23

### *మరో పాపానికి పథకం*

పొలం గట్టున నిలబడి ఎద్దుల్ని మేపు కుంటూ వున్నాడు శంకర్రెడ్డి. అందులో ఒకటి కుంటెద్దు.

పశువుల పండుగనాడు గంగిరెద్దు మీది కురికి, కాలిరుచుకున్న ఎద్దు.

విరిగిన కాలు కట్టుకునిందే గానీ... అది కుంటిదైపోయింది. పనికీ పాటకు పనికి రావడం లేదు. ఉలపాగా మేపుకోవాల్సి వస్తోంది. అమ్మేద్దామనుకుంటే ఎవ్వరూ కొనడం లేదు. కసాయోళ్ళకు అమ్ముదామ నుకుంటే అన్ని ఏండ్లు పనిచేసిన ఎద్దును కటికోనికమ్మడానికి మనసొప్పడం లేదు.

దాన్ని చూసినప్పుడంతా గంగెద్దు గుర్తు కొస్తుందతనికి. గంగెద్దు గుర్తుకొచ్చినప్పు డంతా బీశేరయ్య, కనకయ్య గుర్తుకొస్తారు. ఆ వెంటనే వాళ్ళు తిట్టిన తిట్లు, చేసిన అవ మానం గుర్తుకొస్తుంది. అది గుర్తుకు వచ్చినప్పుడంతా అతని మనసు కుతకుత ఉడికిపోతుంది. శంకర్రెడ్డి పరిస్థితీ అదే...

అదే తలచుకొని ఆలోచిస్తున్న కేశవరెడ్డి దగ్గరికి వచ్చాడు. పొలాలు చూసుకుంటూ శంకర్రెడ్డి... ఏ చేనికి ఎప్పుడు ఎరువు పోయాలి, ఈసారి వానబడితే ఎలా దున్నాలో, ఏ చేన్లో ఏ పంట వేయాలి వంటి ఆలోచన్లతో ఆడికొచ్చాడతను.

అతన్ని చూడగానే "ఏం నాయనా యిట్టొస్తివి? " అని అడిగాడు కేశవరెడ్డి.

"పంచాయితీ ఆఫీసుకు బొయ్యి వస్తా వుండా గానీ... ఈ ఎద్దుకు కాలు యింతేనా? " అని అడిగాడు కుంటెద్దు కాలువైపు చూస్తూ.

"యింక యింతే నాయనా... కుంటి గొడ్డు అయిపోయింది. ఎందుకూ పనికి రాదు. ఉలపాగా మేపుకోవాల్సిందే"

"ఉలపాగా ఎందుకు మేపడంగానీ, ఎప్పు డైనా కటికోళ్ళొస్తే ఎంతకో వొకంతకు అమ్మేయి... కానీ... ఇంత పనిచేసిన బీశే రిగాన్ని ఏమీ చేయలేకపోతన్నామే. గొడ్డు నమ్మేద్దామన్న బాధకంటే... వాడి బాధే ఎక్కువగా వుందిరా, ఏం జేయాల" మధ

నపడసాగాడు శంకర్రెడ్డి.

"నేనొగ ఎత్తు ఏసినాను... నువ్వేమన్నా అంటావేమోనని ఊరికేవుండా"

తలొంచుకొని చెప్పాడు కేశవరెడ్డి.

"హారేబ్బా. కేశవా? ఏదో వొగటి సెయ్యాల్రా వాళ్ళకు" కసిగా అన్నాడు.

"అయితే కొత్తపేట నుంచీ ఇర్లోన్ని రమ్మంటా? ఈ మద్దెన మన బాయిగడ్డ నుండే పుట్టలో ఒక పెద్ద నాగుబామును పట్నాడు వోడు"

"అయితే.."

దాన్ని మచ్చిక చేసుకొని ఊరూరు తిప్పుతా, బుర్రవాయించి ఆడిపిస్తావుండాడు"

"ఆడిపిస్తే..."

"వాన్ని ఆ పామును తెమ్మని... మన గొడ్డును పొడిసిన గంగెద్దుకేసే గెడ్డిలో రేత్తిరిపూట వదిలేయమని సెప్తేసరి"

"భలే యోచ్చనే... కానీ తెలుసు కుంటే...

ఎట్ట తెలస్తాది. అర్ధరేత్తిర్లో వాళ్ళ యింటెనక గోడపక్కన పందిరి కింద కదా గంగెద్దును కట్టేస్తారు. ఎవరికీ కానకుండా ఎద్దు ముందర పాము వొదిలేస్తే సరి పాయ"

"అవును. ఇప్పుడు నా కొడుకనిపించుకు న్నావు. ఈ దెబ్బతో పొడిసిన ఎద్దూ చస్తుంది... దానివల్ల బతికే బీశేరిగాని కుటుంబమూ పస్తుల పాలైపోతుంది" ఆనందంగా అన్నాడు శంకర్రెడ్డి.

"అయితే నేను కొత్తపేటకు పోదునా? "

"యింకా ఎందుకు ఆలస్యం... గొడ్లను నేను యింటికి తోలకపోతా... కొత్తపేటకు బొయ్యి యిర్లోన్ని తీసకొచ్చెయ్" అన్నాడు శంకర్రెడ్డి.

తండ్రి చేతికి ఎడ్ల పగ్గాలిచ్చి కొత్తపేట వైపు నడవసాగాడు కేశవరెడ్డి.



## బిడ్డ పుట్టింది- గొడ్డు పోయింది

ఆ రోజు రాత్రి... గొడ్ల కొటం రొచ్చు రొచ్చుగా వుండడంతో, గంగెద్దుతో బాటు కోడెల్ని కూడా పందిరికే కట్టేశారు బీశేరయ్య వాళ్ళు.

ఆ రాత్రి భోంచేసుకొని అందరూ పడు కున్న తర్వాత కనకయ్య, పందిరిపైకెక్కి వరిగడ్డి కట్టలు తెచ్చి గొడ్ల ముందు పడేసి వచ్చి పడుకున్నాడు...

పందిరికింద వున్న గంగెద్దు, కోడెలు... గడ్డిలో మూతులు పెట్టి ఒక్కొక్క పోచనే నమలసాగాయి... ఉన్నట్టుండి... చాపరి కోడె గట్టిగా అరిచింది...

"వొరే కనకా... గొడ్డుకు ఏమైందో చూడరా" చుట్టింట్లోనుంచే అరిచాడు బీశేరయ్య. కనకయ్య లేచి పందిరి దగ్గరకు వెళ్ళాడు.

అది కిందపడి గిలాగిలా కొట్టుకుం టోంది.

"అన్నా" గట్టిగా అరిచాడు.

బీశేరయ్య తలుపు తీసి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

భాగ్యమ్మ బుడ్డీ వెలిగించి తెచ్చింది. నిండు చూలాలైన కనకమ్మా మెల్లగా లేచి వచ్చింది.

"గుండి చీల వచ్చిందేమోరా" అంటూ బీశేరయ్య గుండ్రాయి తెచ్చి దాని ఎదకొమ్మున కొట్టాడు. అయినా ఫలితం లేకపోయింది.

చాపరికోడె నోట్లో నురుగ కక్కుకుంటూ

కండ్లు తేలేసింది... గిలగిలా కొట్టుకుం టున్న దాని కాళ్ళు ఆగిపోయాయి. వాటి తోబాటు దాని శ్వాసా ఆగిపోయింది. సరిగ్గా అదే సమయంలో కనకమ్మకు నొప్పులు ప్రారంభమయ్యాయి. తెల్లారేస రికి... కనకమ్మకు పండంటి మగబిడ్డ పుట్టాడు.

కనకయ్య పిలుపునందుకొని వచ్చిన ఊరి మాదిగలు చచ్చిన గొడ్డును చూశారు. "సామే ఇది విషప్పురుగు ముట్టుకోని సచ్చింది. నాగుబాము కరిసుం డవచ్చు" మాదిగ పెద్ద చెప్పిన మాటవిని హతాశుడైపోయాడు బీశేరయ్య.

"సరే దీన్ని తీసకపోయి చర్మం తీసి... కర్రేసి కపిల బాన కుట్టండి. మిగిల్తే... చెప్పులు కుట్టియ్యండి" అన్నాడు కన కయ్య...

మాదిగలు గొడ్డును తీసుకువెళ్ళారు...

ముత్తయిదవయిన మంత్రసాని అప్పుడే పుట్టిన బిడ్డకు స్నానం చేయించి తీసుకెళ్ళి నట్టింట్లో పడుకోబెట్టింది.

ఆ కుటుంబానికి గొడ్డుపోయిన విషాదం ఒకవైపు, బిడ్డ పుట్టిన సంతోషం మరోవైపు ఒకేసారి కలిగాయి. ఆ యింటికి అప్పుడే కష్టం, అప్పుడే యిష్టం వెలుగునీడల్లా ఒకే సారి వచ్చిపడి, ఏదో జీవన రహస్యాన్ని స్ఫురింపజేస్తున్నాయి.




*అందరూ బెడ్డవాళ్ళు కాదు*

**ఏ** సంతోషమూ సుఖమూ లేని నిస్సా రమైన జీవితంలా మరికొన్ని రోజులు దొర్లి పోయాయి...

ఒకరోజు... తన యింటి వసారాలో కూర్చొని... శంకర్రెడ్డి కేశవరెడ్డి మాట్లాడు కుంటున్నారు...

"నాయనా... యెట్లో వగట్ల... ఆ సిన్న బ్బనాయుడికి కమీసనిచ్చి కుంటెద్దుని ఎం తకో వగంతకు దొంగలదోలే యిదం సూడబ్బా అని సెప్పినా... రేపే ఎవర్నో పట్టుకోనొస్తానన్నాడు"

"అది యిల్లొదిల్తే... శని వదిల్నట్టు... దాంజూసినప్పుడంతా... బంగారట్ల గొడ్డు శనిమాదిరిగా మారడానికి కారణమైన బీశే రయ్య గుర్తుకొస్తాడు..."

"ఆ నా కొడుక్కి సరిగ్గా జేసినాం గదా"

బీశేరయ్య ప్రసక్తి వచ్చేసరికి పరిసరాలు మరచిపోయారు వాళ్ళు... తమ కోప మంతా ఎల్లగక్కారు... కానీ అదే సమ యంలో వాళ్ళ మాటలు మరో రెండు చెవుల్లోకీ దూరుతున్నాయన్న సంగతి వాళ్ళు గమనించడం లేదు. వాళ్ళు మాట్లా డుకుంటూనే వున్నారు...

"మనల్ను అవమానించినందుకు, వాళ్ళ గొర్రెకాలించినాము, ఎద్దుల్ని కూడా దొంగ తనం చేయిస్తిమి గానీ వాళ్ళ అదృష్టం బాగుండి అవి మళ్ళా దొరికినాయి"

"ఈసారి... దెబ్బకు దెయ్యం వదిలింది కదా"

"అవున్నాయనా... ఆ ఇర్లోన్ని పిలిపించి, నాగుబామును యిడిసి ఎద్దుని సంపిస్తిమి"

"ఎద్దయితే సచ్చింది గానీ మనం గంగె ద్దును సంపించేదానికి పామును వదల మంటే ఆ ముండాకొడుకు కోడెలపైకి వది లినట్టుంది నాగుబామును. అందుకే గంగెద్దు బతికిపోయింది..."

"అయినా ఎక్కడ బోతుందిలే...

ఎప్పుడో వొగబ్బుడు దొరక్కపోతుందా? "

"అది సరే... వాడు రెండువేల రూపాయలు పెట్టి ఏరీకోరీ పట్టుకొచ్చిన దేశిపు దూడను చెంగారెడ్డి మాటవరసకనిన చిన్న విషయం బట్టుకోని దేవరెద్దుగా మార్పించేసి దెబ్బకొడితిమిగదా... ఆ దూడ ఎట్టుంది.."

"దానికేమి... రాజభోగాలనుభవిస్తావుండాది"

"ఇంత అన్యాయమా... వీళ్ళకు గెడ్డి పెట్టాల్సిందే" అనుకుంటూ... అంతవరకూ వీధివైపున గోడకవతల నిలబడి వింటున్న చెంగారెడ్డి లోపలికి వెళ్ళాడు. ఆతన్ని చూసి తమ మాటలు విన్నాడేమోనని కాస్తా కంగారుపడినా పైకిమాత్రం మామూలుగానే ముఖాలు పెట్టారు వారు.

"ఏమి సెంగారెడ్డి... యిట్టొస్తివి? " నవ్వుతూ పలుకరించాడు శంకర్రెడ్డి...

"పనుండే వస్తి... కానీ... వచ్చిన పని గాకుండా యీడికొచ్చింతర్వాత నేను చేయాల్సిన పని గుర్తుకొచ్చింది" సీరియస్గా అన్నాడు చెంగారెడ్డి.

"ఏంపనో అది" అడిగాడు...

కేశవరెడ్డి మౌనంగా వింటూ నిలబడ్డాడు.

"చెప్తా... ముందు అసలు మీరు రైతులేనా సెప్పండి? " తీక్షణంగా చూస్తూ అడిగాడు చెంగారెడ్డి.

"ఆ అనుమానం నీకెందుకొచ్చింది? "

"రైతులు జేసే పనులు మీరు చెయ్యడంలా... అందుకనీ..."

"అంత చెయ్యరాని పని మేమేం చేశామనీ..." తల ఎగరేసి అడిగాడు కేశవరెడ్డి...

"రైతులు బతికేది గొడ్ల కష్టంతో... అట్లాంటి గొడ్డు మనది కానంతమాత్రాన... దొంగతనం చేయించేది, చంపించేది... రైతులు చేసే పనేనా...? "

"తాము మాట్లాడుకున్న విషయాలు ఇతను విన్నట్టుంది" అనుకొని మౌనంగా తలొంచుకొని నిలబడ్డారిద్దరు...

"గొప్పతనమూ, పెద్దతనము... కులంలో గాదుండాల్సింది... మనం జేసే పనుల్లో, మనం మాట్లాడే మాటల్లో వుండాల... మీరు జేసిన పనులు ఊర్లో తెలిస్తే ముఖానికి మసిపూస్తారు. పేడతో యేస్తారు... కేకరించి ముఖాన వూంచుతారు... ఛూ... నోరూవాయీ లేని గొడ్లను సంపే మీ ముఖాలు సూస్తేనే పాపం... మీరూ కాపోళ్ళని సెప్పేదానికే సిగ్గుగా వుండాది..." నేలకేసి ఉమ్మి తిరిగి విసవిసా వెళ్ళిపోయాడు చెంగారెడ్డి...

ఈ విషయాలు చెప్పి ఊర్లో ఎక్కడ పరువు పోగొడతాడోనని భయపడిపోయారు వాళ్ళు...

## 26

### ఈ లోకమే ఒక సంత

కాలం వేగంగా సాగిపోతోంది...

ఆ ఏడు... పడిన తొలేటి వానలకు పచ్చిక బాగా పెరిగింది. ఆ పచ్చికతిన్న గొర్రెలకు వింతరోగం వచ్చింది.

ఉన్నట్టుండి పారడం... కొద్దిరోజులకు చచ్చిపోవడం... లేదా మేస్తూ మేస్తూ అలాగే ఎగిరిపడి చచ్చిపోవడం.

కొందరు పిచ్చురోగం. దానికి మందుల్లేవన్నారు... మరికొందరు నీలినాలిక అన్నారు. అలాగే మేకలూ చావడం మొదలెట్టాయి. దాంతో ఊర్లో గొర్రెలమంద ముక్కాలు భాగం ఊడ్చుకపోయింది. మేకలూ సగానికి పైగానే ఖాళీ అయిపోయాయి. మంగళంపేట సాయిబులకు, దామల్ చెరువు, కల్లూరు సాయిబులకు

చచ్చిన జీవాలతో మంచి వ్యాపారమే అయింది. కారుచౌకగా గొర్రెల్ని కొనడం... హోటళ్ళ వాళ్ళకు అధిక లాభాలకు అమ్ముకోవడం... కొందరు చస్తున్న జీవాలను చూసి, బాగున్న గొర్రెల్ని కూడా చౌకగానే అమ్మేసుకున్నారు... ఈ క్రమంలో కోటయ్యా తమ గొర్రెల్ని అమ్మేశాడు...

ఆ ఊరి గొల్లలకు, కురవలకు ప్రధాన వనరు అయిన మేకలు, గొర్రెలు పోవడంతో వాళ్ళ ఆర్థిక పరిస్థితీ దిగజారిపోసాగింది.

వ్యవసాయమన్నా సాగుతుందనుకుంటే ఏ ఏడుకాయేడు వరసబెట్టి కరువుమీంద కరువు రాసాగింది. చుట్టుపక్కల బావులెండిపోయాయి... ఆరుద్ర కార్తెలో తొలేటి వానలు.. చెంబుతో చిలకరించినట్టు పడేవి. అంతమాత్రానికే రైతులు దుక్కులు దున్ని విత్తనాలు వేసుకోవడం... పూతమిందకు వచ్చినప్పుడో లేదా ఆ తర్వాతనో పూర్తిగా చేన్లు ఎండిపోవడం పరిపాటి అయిపోయింది. ఏడెనిమిదేళ్ళకొకసారైనా సరైన పంటలు పండడంలేదు. దానికితోడు ఆర్థిక స్తోమత వున్నవాళ్ళు అప్పులు చేసి పాత బావుల్లోనో, పొలాల్లోనో బోరింగులు దించడం చేశారు... వాటిలో పడిన అరకొర నీళ్ళతో కొద్దికాలం నెట్టుకొచ్చారు. రానురాను అవీ ఎండిపోసాగాయి...

రైతులు చేసిన అప్పులు భరించలేక ఆత్మహత్యలు చేసుకోవడం ప్రారంభించారు. కొందరు పనుల్ని వెదుక్కుంటూ... పట్నాలకు వెళ్ళడం మొదలుపెట్టారు.

మేపే బీళ్ళు లేక, ఉన్నా వర్షాలు పడక వున్న అరకొర గొర్రెల్ని, మేకల్ని కూడా అమ్మేసుకున్నారు జనం... వ్యవసాయం పూర్తిగా దెబ్బతింది. పశువుల్ని మేపుకోవడం కూడా రైతులకు భారంగా అనిపించింది.

జిల్లాలో పాలకేంద్రాలు పుట్టుకొచ్చాయి... దాంతో... పాడిపశువుల్ని తప్ప సేద్యపు గొడ్లను తెగనమ్ముకోసాగారు...

బీశేరయ్యా కూడా అనవరించుకోలేక గంగెద్దు, సీతమ్మావును తప్ప అన్నింటినీ అమ్మేశాడు...

బెంగుళూరు నుంచీ వచ్చిన గొడ్ల వ్యాపారస్తులు, కొనుక్కున్న పశువుల కాళ్ళు విరగ్గొట్టి లారీల్లో కుక్కి కోతకు తోలుకుపోసాగారు. ఆ దృశ్యం చూసిన రైతులు మౌనంగా బాధల్ని భరించడమే తప్ప ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో పడిపోయారు.

కనకయ్య పిల్లవాడు పెరిగి పెద్దయ్యేసరికి అన్నతో వేరుపడ్డాడు. ఆతనూ ఒక దూడను కొనుక్కొని గంగెద్దును తయారు చేసుకున్నాడు... ఇప్పుడు ఆ అన్నదమ్ములకు పూర్తిగా గంగెద్దులాటే జీవనాధారంగా మారిపోయింది.

బీశేరయ్యా పెద్దకొడుకు ఎలాగో డిగ్రీవరకూ చదివి తిరుపతిలో ఏదో చిన్న ఉద్యోగం సంపాదించుకుని, పెళ్ళిచేసుకుని స్థిరపడిపోయాడు. కానీ చిన్నప్పుడే చదువు మానేసిన బాలయ్యా తండ్రితో బాటే గంగెద్దులోడయ్యాడు.

అతనికీ పెళ్ళయింది. కనకయ్యా కొడుకూ అతి కష్టమ్మీద ఎలిమెంట్రీ స్కూలు గట్టెక్కి ఆ తర్వాత చదువు మానేసి ఇంటిదగ్గరే వుండిపోయాడు.

రానురాను గంగెద్దుల్ని మేపడం కూడా వాళ్ళకు కష్టమైపోసాగింది. కనకమ్మ... కఠారి రాముడి పున్నెమా అని... అడపాదడపా గంగెద్దుకు మేత పెట్టగలిగింది కానీ... కఠారి రాముడు వ్యవసాయం వదిలేసి రాజకీయాల్లోకి దిగడంతో... ఆ దారీ మూసుకుపోయింది.

కోటయ్యా ఎప్పుడో చనిపోయాడు, ఆత

నితో బాటు ఆతని వయసు వాళ్ళయిన ముత్తయ్య, సుబ్బయ్య, శంకర్రెడ్డి లాంటి పాత తరం మనుషులూ కాలగర్భంలో కలిసిపోయారు...

ఈ నేపథ్యంలో పల్లెల వాతావరణం మారిపోయింది. తెలుగుదేశం పార్టీ రాజకీయాల్లో పెనుమార్పులు తెచ్చింది. అలాగే సమాజంలోను మార్పు తెచ్చింది. రానురాను కులరాజకీయాలుగా పార్టీలు మారిపోయాయి. దాంతో తరతరాల శంకర్రెడ్డి వంశపు సర్పంచి గిరీ రాజకీయాలు పతనమైపోయాయి...

ఒకసారి నాయుళ్ళు సర్పంచులైతే మరోమారు రెడ్లు సర్పంచులవుతూ వచ్చారు. వీళ్ళు ఊర్లు ఊర్లనే పంచుకున్నారు.

దాంతో అంతకుముందు అన్ని కులాలు కలిసి సహజీవనం చేసిన పరిస్థితి మారిపోయి, ఆనాటి ఆప్యాయతలు అన్నీ మంటకలిశాయి.

చివరికి ఒకే కులం వాళ్ళయినా పక్కపక్కనే సజావుగా జీవించే పరిస్థితి లేకపోయింది.

రాజకీయాలు నడపలేని వాళ్ళు ఆస్తుల్ని అమ్మైనాసరే... పట్నాలకు చేరిపోయి ఏవో వ్యాపారాలు చేయసాగారు... ఆ వ్యాపారాల్లోనూ రెడ్లు, నాయుళ్ళే ముందున్నారు...

కేశవరెడ్డి కాంట్రాక్టులు మొదలుపెట్టి బాగానే సంపాదించసాగాడు. చిన్నబ్బనాయుడు పశువుల వ్యాపారంలో దళారీగా నేర్చుకున్న తెలివితేటలు, మోసాలు... వ్యాపారంలో ప్రదర్శించడం మొదలెట్టాడు. మొదట తిరుపతిలో తిష్టవేసి రియల్ ఎస్టేట్స్‌లో యజమానులకు, కొనుగోలుదారులకు మధ్యదళారీగా మారి కాస్తో కూస్తో సంపాదించి, చివరికి తానే ప్లాట్లువేసి కోట్లు సంపాదించాడు. తిరుపతిలో లక్షలు పెట్టి ఇండ్లు, అపార్ట్‌మెంటులు కట్టించాడు.

ఎటూ పోలేని చెంగారెడ్డి, గంగచంద్ర లాంటి వాళ్ళు మట్టిని నమ్ముకొని పుట్టి పెరిగిన నేలను వదలలేక మొండిగా ఊర్లోనే బతుకులు యీడ్చసాగారు.

బీశేరయ్య, కనకయ్య గంగెద్దుల్ని పట్టుకొని దేశంపైన పోతూ వస్తున్నారు. కానీ ముందులా వాళ్ళను ఆదరించేవాళ్ళు తక్కువైపోయారు.

రానురాను వాళ్ళకు కూటికి జరగడమే కష్టమైపోయింది. అది తప్పిస్తే వేరే ఏ పనులూ చేతకానివాళ్ళు. పైగా ఏంచేద్దామన్నా పనుల్లేని పరిస్థితి.

ఇలాంటి పరిస్థితిలో బీశేరయ్య గంగెద్దు ముసల్దయిపోయి చచ్చిపోయింది.

## దేవుడు చూస్తున్నాడు

**ఓ** కాథలిక్ ఎలిమెంటరీ స్కూల్‌లో మధ్యాహ్నం పిల్లలు లంచ్‌కోసం వరుసగా నిలబడ్డారు. టేబుల్ ముందుభాగంలో ఆపిల్ పళ్లు గుట్టగా పోసి 'ఒకే ఒక్క పండు తీసుకోండి. దేవుడు మిమ్మల్ని చూస్తూ ఉంటాడు' అని నోటీస్ అతికించారు. ఇంకొంచెం ముందుకు వెళితే టేబుల్‌కు రెండో చివరన చాకొలెట్లు కుప్పగా పోశారు. అది చూసి ఓ అమ్మాయి 'మీకెన్ని కావాలో అన్ని తీసుకోండి. ఇప్పుడు దేవుడు ఆపిల్ పళ్లను చూస్తున్నాడు' అని చీటీ రాసి పెట్టింది.



ఎలాగయినాసరే. తన కులవృత్తిని వదలకూడదనీ, తన ప్రాణం వున్నంతవరకు గంగెద్దు ఆచారం పోగొట్టకూడదనే పట్టుదల గల మనిషి.

ఊరికే గోళ్ళు గిల్లుకుంటూ ఇంట్లో కూసోలేకపోయాడు.

అతనికి అప్పటికే బాగా వయసైపోయింది. అయినా... ఎక్కడైనా ఒక మంచి జాతయిన దూడను పట్టుకొచ్చి గంగెద్దుగా తర్ఫీదివ్వాలనుకున్నాడు...

ఎలాగో అప్పో సొప్పో చేసి రెండువేలు సేకరించుకుని పల్లెలమిందిపడ్డాడు.

ఏ పల్లెలో చూసినా పాలిచ్చే జర్సీ ఆవులేవున్నాయి. అవయినా పల్లెకు పదికంటే ఎక్కువగా లేవు.

సేద్యపు గొడ్లనూ చూద్దామన్నా కనిపించడంలేదు.

చివరికి ఏదయినా పరసకు వెళాదామనుకుని ఇంటికి తిరిగొచ్చాడు.

నేరుగా ముఖం కడుక్కుందామని పెరట్లోకి వెళ్ళాడు... అప్రయత్నంగానే అతని చూపు గొడ్ల పందిరివైపు మళ్ళింది...

గొడ్లులేని పందిరి బాగా పాడు పడినట్టనిపించి, బోసిగా కనిపించింది.

ఆ తర్వాత గొడ్ల కొట్టంలోకి తొంగి చూశాడు... ఒకప్పుడు పశువులతో, పశువుల పేడతో గంజరంతో, గొడ్లవాసనతో నిండివున్న కొట్టం ఖాళీగా కనిపించింది... పైగా సగంకప్పు జారిపోయి, గోడలు చీలిపోయి శిథిలావస్థకు చేరుకుంటోంది కొట్టం...

అక్కడ పశువులకు తనకు ఒకప్పుడున్న అనుబంధం, ఎన్నెన్నో సంఘటనలు, గుర్తుకు వచ్చి మనసు నొప్పిగా బాధపడింది.

మౌనంగా... నీళ్ళతొట్టి దగ్గరకు వెళ్ళి ముఖం కడుక్కుని తమ్ముడి యింటివైపు చూశాడు...

ఒకప్పుడు ఒకటిగా వున్న ఆ ప్రదేశం మధ్యలో అన్నదమ్ముల్ని వేరుచేస్తూ నిలబడివున్న గోడమీదుగా అతని చూపు తమ్ముడి చుట్టింటి పైన బడింది. ఆ యిల్లూ తన యిల్లులాగానే కప్పు జారిపోయి బాగా పాతబడిపోయి కనిపిస్తోంది.

మెల్లగా ఇంట్లోకి వెళ్ళి కోడల్ని అడిగి అన్నం పెట్టించుకొని తిని, నడుముకున్న వల్లటంలో డబ్బుల్ని మరొకసారి చూసుకుని బయలుదేరాడు...

కొట్టంలో చెప్పులేసుకుని వీధిలో కొచ్చాడు.

వీధి దాదాపు నిర్మానుష్యంగా కనిపిస్తోంది.

"ఎట్లున్న ఊరు ఎట్టయిపోయింది. ఒకప్పుడు... వీధిలో ఇండ్లముందరే గొడ్లు కట్టేస్తావుండ్రి, ఆవలోడు ఆవలిడండని కూతేస్తానే ఈది పొడుగునా ఆవలే కనిపిస్తావుండె. వీధినిండా గొర్రెలు, మేకలు మేతకు పోతా వస్తావుండె... ఎవురైనా దగ్గరి సుట్టమో, ఆడబిడ్డో శ్యానారోజులకు యింటికొస్తే ఏ బక్క గొర్రెనో, మేకనో కోసి వండి పెట్టి మిగిలిన తునకలు ఎండేసుకొని తింటావుండ్రి. ప్రతి యింట్లోనూ కనీసం పది పదయిదు కోళ్ళుంటా వుండె. ఎవురైనా బందుగులు యింటికొస్తే కోడిని కోసి పెడతావుండ్రి. ఇప్పుడు చూద్దామన్నే గొర్రెలూ లేవు. మేకలూ లేవు... తెల్లారితే కూసేదానికి ఊర్లో వొగ కోడిపిల్ల లేదు... ఆ గొడ్లూ లేవు... పసలపండగలు లేవు... సిట్లా కువ్వలూ లేవు... పేరుకు సంకురాత్రి వస్తావుండాది. పోతావుండాది... అంతే" అనుకుంటూ వీధింట్లా నడవసాగాడు...

"ఊరిచివర వడ్డిబోయిలకు కాలనీ యిండ్లు కట్టించింది గవర్నమెంటు. అయినా ఆ యిండ్లల్లో ఎవ్వరూ వుండడం

లేదు. పనులు వెదుక్కుంటూ ఎటో వెళ్ళి పోయారు. ఆ తర్వాత కంసలోళ్ళ యిండ్లు ఖాళీగానే వుండాయి. ఆ మాటకొస్తే ముక్కాలువాసి రైతులిండ్లూ ఖాళీగానే వుండాయి. అందరూ ముసిలీ ముతకను ఇండ్ల దగ్గరే వదిలేసి పలస్తరం (వలస) పోయినారు..."

ఆలోచిస్తూ ఊరికడాన వున్న వంకదాటి, దానికవతలున్న గొల్లయిండ్ల కాడికి వెళ్ళాడు. అక్కడ మొదటి యిల్లే దేవరెద్దు గుడి...

ఆ యింటి ముందర బాగా ముసలిదై పోయివున్న దేశిపుదేవరెద్దు అతని కళ్ళబ డింది. అప్పటికి ఆ ఎద్దుకు సేవదాసరిగా వున్న గొల్లసుబ్బన్న మనవడు ఇంటి గడ పలోనే కూర్చోనున్నాడు.

దాన్ని చూడగానే బీశేరయ్యకు ఎక్కడ లేని దుఃఖం ముంచుకొచ్చింది. ఒకప్పుడు పుంగనూరు వరసలో పట్టుకొచ్చిన దేశపు దూడే అది.

దాన్ని పెంచిన నెరులు అతని గుండెలో ఎక్కడో కదిలింది. దాని ముందరికి వెళ్ళి నిలబడ్డాడు.

అది తల ఎత్తి అతనివైపు ప్రసన్నంగా చూసింది.

గబాలున దాని తలను రెండు చేతు లలో అబ్బాలించి పట్టుకొని కౌగలించుకొని వలవలా ఏడ్చేశాడు.

అతని వాలకం చూసి సేవదాసరి "ఏం తాతా ఏమైంది? " అని అడిగాడు.

"ఏంలేదులేరా" తనను తాసంబాలించు కుంటూ అని దాన్ని వదలి దూరంగా వచ్చాడు.

"యింకెందుకు ఏడుస్తావుండావు? "

"వొగబ్బుడు ఇది నా యింటి గొడ్డు... బిడ్డను సాకినట్టు సాకినా.. ఆనెర్లు పోలె" అనుకుంటూ యింకొంచెం ముందుకె ళ్ళాడు...

దూరంగా రెడ్ల యిండ్లు కనిపించాయి.

## కొత్తగాలి...

**నెలరోజులు దాటితే**
**చేతికందేది జీతం**
**నూరేళ్లు దాటినా**
**ఊహకందనిది జీవితం**

*– సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ*

అందులో మొదటి ఇల్లు శంకర్రెడ్డిదే. ఇప్పుడు దాని ప్రహరీకి ఖరీదయిన గేటు, ముందుకంటే యింకా అందంగా నిర్మించు కున్న యిల్లు... కనిపించింది.

అప్పుడే గంజిపెట్టి తోమిన దేశవాలీ ఖద్దరు బట్టల్లో తెల్ల ఏనుగులా కదుల్తూ ఇంట్లో నుంచీ వెలుపలికొచ్చి నిలబడ్డాడు కేశవరెడ్డి.

ఇప్పుడతని కొడుకు పట్నంలో ఇంజినీ రింగ్ చదువుతున్నాడు.

బీశేరయ్య ఆతని యింటిని దాని పక్కనే వున్న చెంగారెడ్డి యింటిని, మిగిలిన కుర వల యిండ్లనీ మార్చి మార్చి చూశాడు.

అతని యింటి ముందర మిగిలిన యిండ్లు వెలవెలబోతూ కనిపించాయి.

నిర్లిప్తంగా ఒక్కసారి తల ఊపి మంగ ళంపేట దారి పట్టాడతను.

అక్కడ బస్సెక్కి పాకాల్లో దిగి కలికిరి బస్సెక్కాడు.

ఓ గంటన్నర తర్వాత బస్సు కలికిరి ఆర్టీసీ బస్టాండ్లో ఆగింది. దానికి కొంతదూ రంలో పరస జరుగుతోందని తెలుసుకొని అక్కడికి వెళ్ళాడు...

ఆ పరసను చూసి అతని మనసు నీర సంగా మూలిగింది.

ఒకప్పుడు వేలగొడ్లతో సాగే ఆ పరసలో పట్టుమని నూరుగొడ్లు లేవు. అవి కూడా

బక్కచిక్కిన గొడ్లు.

అయినా పరసంతా తిరిగాడు. కానీ ఎక్కడా ఒక కోడెదూడ కనిపించలేదు...

గంటలో మళ్ళీ బస్టాండుకొచ్చి పుంగనూరు వెళుతున్న ఆర్టీసీ బస్సెక్కాడు. మరో గంటలో పుంగనూరు చేరింది బస్సు. బస్టాండ్లో దిగి నేరుగా నగరు దారి పట్టడు...

మధ్యలో అనుమానం వేసి పక్కనవున్న ఓ టీకొట్లో టీ తాగి..."ఏమయ్యా పరసజరగతా వుండాదా? " అని టీ కొట్టోన్ని అడిగాడు.

ఆ మాటకు వాడు అతనివైపు వింతగా చూసి " ఏదీ పశువుల సంతా" అన్నాడు.

"ఆ...ఆ" అని తలూపాడు బీశేరయ్య...

"ఏదో జరగతావుంది పో పెద్దాయినా" అని బారెడెత్తు చేయెత్తి టీ తిరగబోస్తూ వుండిపోయాడు తను.

బీశేరయ్య నడుచుకుంటూ జమీందారు గారి బంగళా దగ్గర కొచ్చాడు.

ఒక్కసారి బంగళా వైపు చూశాడు... ఇప్పుడక్కడ 'ఏవేవో అంగళ్ళు వెలసివున్నాయి.

వాటికవతల వున్న ప్యాలెస్ బాగా శిథిలావస్థలో కనిపించింది. అక్కడినుంచీ చాలాదూరం నడిస్తేగానీ పరస జరుగుతున్న ప్రదేశం చేరుకోలేకపోయాడు. ఎందుకంటే ఇంతకుముందు పరస జరిగే చోట మూడు నాలుగంతుస్తుల బిల్డింగులు కనిపిస్తున్నాయి.

ఆ పరసా అతనికి నిరుత్సాహాన్నీ కలిగించింది.

ఒకప్పుడు ఎంతదూరం చూసినా క్రిక్కిరిసిన పశువులతో, జనాలతో నిండివుండే పుంగనూరు పరస బోసిపోయి కనిపిస్తోంది.

అక్కడా పట్టుమని వంద గొడ్లు లేవు...

పరసంతా తిరిగాడు... కానీ అక్కడా అతనికి గంగెద్దుకవసరమైన దూడ కనిపించనేలేదు. తిరిగి తిరిగీ అలసిపోయి, జమీందారుగారి ప్యాలెస్ వెనుక వైపు గుండా... బస్టాండు వైపు నడిచాడు...

అక్కడ ఒకచోట... పెద్ద కోలాహలం వినిపించింది.

పుంగనూరు దొరవారు తవ్వించిన కోనేరు కవతలున్న బీడులో ఏదో సభ... అది బసవరాయ డిగ్రీ కాలేజీ గ్రౌండ్... దాన్నిండా జనమే...

ఇసకేస్తే రాలనంత జనం... సుమారు పదివేల మందికి పైగానే వుంటారు.

ఆ గ్రౌండ్‌లో ఓ మూల పెద్ద వేదిక.... రంగురంగుల షామియానాలతో మెరిసిపోతుంది...

ఆ వేదికపైన ఒక ప్రసిద్ధమైన సినిమా హీరో... కొత్తగా రాజకీయాల్లోకి దిగాడు. ఆ మధ్యన రిలీజయిన అతని సినిమా వందరోజుల ఉత్సవం ఆ ఊర్లో జరుపుకుంటున్నట్టుంది.

అది వందరోజుల ఉత్సవమే కాదు. అతనికి రాజకీయ ప్రవేశోత్సవం కూడా.

దాన్ని చూడ్డానికి ఎగబడివచ్చిన జనం...

అదొక జనసముద్రంలా అనిపించింది...

"పశువులు చేరాల్సిన ఊర్లో... జనం చేరినారు... జిల్లాకే పేరుబోయిన ఈ ఊరి పరసలో... పశువుల్లేవు గానీ... ఇక్కడ మాత్రం... ఒగిటేజనం... ఇది మనుషుల పరస..."

ఆ మాటకొస్తే ప్రతి జనావాసమూ పరసే... ప్రతి నగరము... ప్రతి దేశము పరసే... ఈ లోకమే పెద్ద సంత... మనుషుల సంత. ఈ పరసలో అమ్మే వాళ్ళు, అమ్ముడుపోయేవాళ్ళు, వ్యాపారులు, దళారులు అందరూ మనుషులే"

ఆలోచిస్తూ ముందుకు నడిచి వెళుతూనే వున్నాడు బీశేరయ్య...



# లంచగొండి భార్య

-వెంకటేష్

"అమ్మగారూ.. ఆ ఇంట్లో ఉండే పల్లవిగారింటికి ఏసీబీ వాళ్లొచ్చారంట. మీ ఆయనగారు కూడా గవర్నమెంటు ఉద్యోగమేకదా? జాగ్రత్తగా ఉండమని చెప్పమన్నారమ్మా సౌమిత్రి అమ్మగారు" అని చెప్పేసి పక్కింట్లోకి వెళ్ళిపోయింది వాళ్ళ పనిమనిషి లక్ష్మి.

భర్తకి ఫోన్‌చేసి విషయం చెప్పాలని, ఫోన్ దగ్గరకెళ్ళాక... అప్పుడు... అప్పుడొచ్చిందా ఆలోచన ఆమెకి.

తన తండ్రి కట్నంగా ఇచ్చిన డబ్బుని లంచంగా యిచ్చి, ఉద్యోగం సంపాదించి... అందులో రెండు చేతులా సంపాదిస్తూ...

అసలతనికి ప్రభుత్వోద్యోగం వస్తుందనే తన తండ్రి పెళ్ళి చేసింది. అప్పటికి నిరుద్యోగిగా ఉంటూ, చదువుతప్ప వేరే ఏమీ ఆధారం లేని అతనికి ఆ కట్నం ఎక్కువైనా సరే ఇచ్చారు. అతను కూడా తన తండ్రిని దేవుడిలా భావిస్తూ తనని పెళ్ళి చేసుకున్నాడు.

తీరా ఇప్పుడు - అడ్డదారుల్లో విపరీతంగా సంపాదించి, ఎక్కడెక్కడో భూములు, ఇళ్ళు, అపార్ట్‌మెంట్లు కొనేశాడు. ఇల్లంతా బంగారం, బ్యాంకునిండా డబ్బు, అతని స్నేహితుని వ్యాపారాల్లో వాటాలు, షేర్లు, ఆ స్థితిలో ధనమదంతో ఒళ్ళు కొవ్వెక్కిన రీతిలో అతని ప్రవర్తన... ఎక్కడ డబ్బులడుగుతారో అని బంధువుల్ని, ఆఖరికి అతని తోడబుట్టిన వాళ్ళను, అమ్మానాన్నల్ని దూరం చేసేసిన అతని ముందుచూపు... తన తండ్రిని కూడా హీనంగా, అతని స్థాయికి తగనివాడిగా చూసే అతని చూపు... పోన్లే కూతురు సుఖపడుతోంది కదా అని బాధని దిగమింగుకున్న తండ్రి తల్లడిల్లిన హృదయం... బార్లమ్మటా, క్లబ్బులమ్మటా, పబ్బులమ్మటా తిరుగుతూ రోజుకోదాన్ని వెంటేసుకుని తిరిగే అతని బరితెగించిన ప్రవర్తన... ఒక్క చూపుతో, ఒక్క మాటతో విషంకక్కే అతనితీరు... ఆమెని ఫోన్ చేయకుండా ఆపింది.

పదినిమిషాలు ఆలోచించి అప్పుడు ఫోన్ చేసిందామె. భర్తకి కాదు పల్లవి యింటికి. ఆ ఫోన్ ఏసీబీ వాళ్ళు తీస్తారని తెలుసామెకి.

ఇలాంటి అక్రమార్జన మొత్తం ప్రభుత్వ ఖజానాకి అప్పగిస్తారనీ, ఆ డబ్బుతో పది పల్లెటూళ్ళకి సకల సదుపాయాలు కల్పించవచ్చనీ తెలుసామెకి.

అతని ఉద్యోగం పీకేసి జైలులో పెట్టినా ఫరవాలేదు. తన కాళ్ళమీద తను నిలబడగలదు. ఒక్క పొట్టని పోషించుకోవడానికి ఎంత కావాలి? ©

# ఇదీ వేదం

# యజ్ఞంలో పశుహింస వుందా?

8

-డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

లోకహితం కోసం జరిగేదే యజ్ఞం. వేదంలో సృష్టికర్త పరబ్రహ్మ సర్వమానవుల కళ్యాణం కోసం యజ్ఞాన్ని ఈ విశ్వానికి అందించాడు. సమస్త ప్రాణులకు మేలుచేసేది యజ్ఞం. యజ్ఞంలో ఏ విధమైన పశు హింస జరిగేందుకు వీలులేదు. అట్లా జరిగితే అది యజ్ఞమేకాదు.

యజ్ఞానికి 'అధ్వర' మనే పేరుంది. అంటే హింసలేనిదని అర్థం. మహర్షి యాస్కుడు నిరుక్త శాస్త్రంలో యజ్ఞానికి అధ్వరమని రాశారు. న + ధ్వరము = అధ్వరము. ధ్వరతి హింసాకర్మ. నధ్వరతి ఇతి అధ్వరః అని వైదిక శబ్దాలకు అర్థాలు రాశారు. యజ్ఞంలో హింస జరగకూడదని దీనర్థం.



యజ్ఞశాలలన్నీ ఋషుల ఆలోచనలకు ప్రయోగశాలలై సనాతన పవిత్ర భావ వికాసానికి దోహదం చేశాయి.

'యజ్ఞోవై శ్రేష్ఠతమంకర్మ' (శతపథ బ్రాహ్మణం) యజ్ఞమంటే అత్యుత్తమ కర్మ అని మహర్షి యాజ్ఞవల్క్యుడన్నారు.

**అన్నాద్ భవంతి భూతాని**
**పర్జన్యాదన్న సంభవః।**
**యజ్ఞాత్ భవతి పర్జన్యో**
**యజ్ఞఃకర్మ సముద్భవః॥** (భగవద్గీత)

అన్నం వలనే సర్వప్రాణులు జీవిస్తున్నాయి. ఆ అన్నం మేఘాలు వర్షించడం వలన ఉత్పన్నమవుతుంది. ఆ మేఘాలు యజ్ఞమనే వేదవిహితకర్మ చేయడం వలన ఏర్పడతాయని శ్రీకృష్ణ భగవానుడన్నాడు.

'గోమేధ' మంటే గోవును చంపి యజ్ఞం చేయడం, 'అశ్వమేధ' మంటే గుర్రాన్ని చంపి యజ్ఞం చేయడం, 'అజామేధ' మంటే మేకను చంపి యజ్ఞక్రతువులను నిర్వహించడం. ఇవి తర్వాత మొదలయ్యాయి.

**యూ పంఛిత్వా పశూన్ హత్వాకృత్వా రుధిర కర్దమః।**
**యద్యేవ గమ్యతే స్వర్గం నరకం కేన గమ్యతే?॥**

(మహాభారతం - అనుశాసనపర్వం)

మహాభారతంలో భీష్ముడు యుధిష్ఠరు

నితో- పశువులను స్తంభానికి కట్టిచంపి ఆ రక్తంతో యజ్ఞస్థలాన్ని తడిపి స్వర్గానికెడితే నరకానికెళ్లేదెవరని ప్రశ్నిస్తాడు.

గోమేధమంటే ఇంద్రియాలను పవిత్రంగా వుంచుకోవడం, నిగ్రహించడం కోసం చేసే యాగమని యాస్క మహర్షి నిర్వచించారు.

**అగ్నిర్వా అశ్వః**

(శతపథ బ్రాహ్మణం 3-6-2-5)

అశ్వమేధంలో అశ్వమంటే 'అగ్ని'. మేధ మంటే 'నెయ్యి'. అగ్నిలో నెయ్యివేసి చేసే హోమానికి అశ్వమేధమని పేరు.

**ఆజ్యం మేధః**

(శతపథ బ్రాహ్మణం 13-3-6-2)

మేధ అంటే ఆజ్యము (నెయ్యి)

**రాష్ట్రంవా అశ్వమేధః**

(శతపథ బ్రాహ్మణం 13-1-2-3)

రాజు రాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలించడం. ధర్మరాజు ప్రజా క్షేమాన్ని దృష్టిలో వుంచుకొని రాజ్యం సుభిక్షంగా వుండాలని రాష్ట్ర హితంకోసం దేశ కల్యాణం కోసం చేసే యాగం అశ్వమేధమని యాజ్ఞవల్క్య మహర్షి ప్రబోధం చేశారు.

అజామేధమంటే న+జా='అజా'- అంటే మొలకెత్తని ధాన్యాలతో యజ్ఞం చేయాలని మహర్షుల ఉవాచ.

**బీజైర్ యజ్ఞేషు యష్టవ్యమితి వై వైదికీ శ్రుతిః।**

**అజ సంజ్ఞాని బీజాని ఛాగం నోహంతు మర్హ థ॥**

(మహాభారతం- శాంతి పర్వం)

ధాన్యాలతో యజ్ఞాలు చేయాలని వేదాలు ఘోషిస్తున్నాయి "అజ" లంటే మొలకెత్తని ధాన్యాలని అర్థం. కనుక మేకలను చంపేందుకు వీలులేదని మహాభారతంలో వ్యాస మహర్షి అన్నారు.

వైదిక సాహిత్యంలో జీవహింస సర్వదా నిషిద్ధం.

పంచతంత్రంలో విష్ణుశర్మ ఇలా చెప్పారు:

**యే యాజ్ఞికాః యజ్ఞకర్మణి పశూన్ వ్యాపాదయంతితే మూర్ఖాః।**

**పరమార్థశ్రుతేన జానంతి అజాః వ్రీహయః తావత్ సప్త వార్షికాః కథ్యంతే న పునః పశు**



**విశేషాః॥**

యజ్ఞాలలో పశువులను వధించేవారు, దానిని వేదోక్తమనేవారు వేదాల సత్యార్థాలను తెలుసుకోలేరు. వేదంలో అజలతో యజ్ఞం చేయడమంటే ఏడు సంవత్సరాలుంచిన పాత ధాన్యాలతో యజ్ఞం చేయాలనీ అర్థం. అజ అంటే మేక కాదని విష్ణుశర్మగారు వివరించారు.

మహాభారతం శాంతి పర్వంలో ధర్మరాజు భీష్మపితామహుని మాంస భక్షణ, యజ్ఞాలలో పశుహింసను వేదాలు సమర్థిస్తున్నాయా? అని ప్రశ్నిస్తే భీష్ముడు ఇలా సమాధానమిచ్చారు :

**సురా మత్స్యా మధు మాంస మాసవం కృసద్ ఔదనమ్।**

**దుర్తైః ప్రవర్తితం హిన ఏతీద్ వేదేషు విద్యతే॥**

(మహాభారత 265-9)

రాజా! మద్యం, మాంసం, మత్తు పదార్థాలు, దూషితమైన అన్నములను యజ్ఞంలో ఆహుతులివ్వడం, తినడం, తాగడం మొదలైనవన్నీ ధూర్తులచే కల్పించబడ్డాయి. వేదాలలో ఇది లేదని వేదవ్యాస మహర్షి అన్నారని చెప్పారు.

**పశూన్ సర్వాన్ యే రక్షంతి తేనః ఆత్మసు జాగృతి**

**తేన పశు షు జాగృతి॥**

(అధర్వవేదం 19-48-5)

పశువులను రక్షించి పోషించే వారిని సమాజంలో అందరి కంటే ఉన్నతమైన వ్యక్తిగా వేదం కీర్తిస్తుంది.

ఈ విధంగా వేదాలలో ప్రాణులన్నిటిపైన సద్భావన, పశురక్షణ, పశుహింస నిషేధాలున్నాయి.

గాం మా హిగ్ంసీః = గోవును చంపవద్దు

అవిం మా హిగ్ంసీః = గొర్రెను చంపవద్దు

అశ్వం మా హిగ్ంసీః = గుర్రాన్ని చంపవద్దు.

మా హిగ్ంసీః సర్వ భూతాని- ఏ ప్రాణిని హింసించవద్దు - చంపవద్దని యజుర్వేదం హితోపదేశం చేస్తుంది.

పశూన్ పాహి - పశువులను రక్షించాలి.

గాం మా హిగ్ంసీ =గోవులను రక్షించాలి

ఇమం మా హింగ్సీః ద్విపాదం పశువమ్ - రెండు పాదాలు కలిగిన పశువులను హింసించవద్దు - చంపవద్దు.

మా హింగ్సీః ఏకశఫం పశుమ్ - ఒంటి గిట్ట కలిగిన గుర్రాలను చంపవద్దు.

గావో విశ్వస్య మాతరః = గోవులు విశ్వానికి తల్లులు

**ధ్రువం ప్రాణి వధో యజ్ఞే నాస్తి యజ్ఞస్త్వ హింసకః॥**

**తతో అహింకః కార్యః సదాయజ్ఞో యుధిష్ఠిర॥**

(మహాభారతం- అనుశాసన పర్వం)

యజ్ఞంలో నిశ్చయంగా ప్రాణి వధలేదు. యజ్ఞం హింస లేనిది. యజ్ఞాన్ని హింసారహితంగా చేయాలి.

మహాభారతం శాంతిపర్వంలో యజ్ఞంలో పశుహింసలేదని వివరిస్తూ భీష్ముడు ధర్మరాజుకు వసురాజు గాథను వినిపించాడు.

మహర్షులు, దేవతలు కలిసి యజ్ఞం చేయాలని సంకల్పించారు. దేవతలు మహర్షులతో అజతో యజ్ఞం చేయాలని అన్నారు. అజ అంటే మేక. మేకను చంపి యజ్ఞం చేయాలని చెప్పారు. అప్పుడు మహర్షులు ధాన్యాలతో యజ్ఞం చేయమని వేదం బోధిస్తుందని, ఆ ధాన్యాలకు అజ అనే పేరుందని కనుక పశువును చంపకూడదని, వేదం పశువులను రక్షించమని ప్రబోధం చేస్తుందని అన్నారు.

అదే సమయంలో సర్వ శ్రేష్ఠుడైన వసువు ఆ మార్గంలో వెడుతూ వారిని సమీపించాడు. అతడు అంతరిక్షగామి, శ్రీమంతుడు, సమగ్ర బలవాహనములు కల

వాడు. యాగాలు చేసినవాడు, దాత, సర్వ ప్రాణులకు హితం చేసేవాడు. అతడు అసత్యం చెప్పడని దేవతలు, మహర్షులు నిర్ణయించుకున్నారు. వసురాజుతో, 'ఓ రాజా! యజ్ఞం దేనితో చేయాలి. ఓషధులతోనా? అజ- మేకను చంపి చేయాలా? మాకు సంశయం కలిగింది. మా సందేహాన్ని నీవే తీర్చాలి. నీ మాటను మేము ప్రమాణంగా అంగీకరిస్తాం' అని అన్నారు.

వసురాజు మహర్షులకు, దేవతలకు ప్రణమిల్లి మీ ఇరుపక్షముల వారిలో ఎవరిదే అభిప్రాయమో తెలపమని అన్నాడు. మహర్షులు ధాన్యాలతో యజ్ఞం చేయాలనేది మా పక్షం. పశువును చంపి యజ్ఞం చేయాలనేది దేవతల పక్షమని వారు అన్నారు. అప్పుడు వసురాజు దేవతల ఎడల పక్షపాత బుద్ధితో పశువును చంపి యజ్ఞం చేయాలని అన్నాడు.

అది విని ఋషులు కోపంతో, 'దేవతల పక్షాన్ని వహించి అసత్యం చెప్పావు కనుక దివము నుండి భూమిపై పడి పోవుదువు గాక!' అని వసువును శపించారు. అతడికి ఆకాశగమనం శక్యం కాదు అనడమే తడవుగా వసువు ఆకాశం నుండి క్రింద పడి పోయాడు. అందువల్ల యుధిష్ఠరా! అజ నామం కలిగిన ధాన్యాలతోనే యజ్ఞం చేయాలి కాని పశువులను చంపి యజ్ఞం చేయకూడదని భీష్ముడు ధర్మరాజుకు బోధించాడు.

వైదిక మర్యాదలు లోపించడం వలన మూఢులు, సంశయాత్ములు, నాస్తికులైన వారు యజ్ఞంలో పశు హింసను ప్రవేశపెట్టారు.

మహాభారతంలోని ఈ ప్రసంగాన్ని బట్టి వేదం హింసాయుత యజ్ఞాన్ని ప్రతిపాదించదని, మధ్యకాలంలో మద్యమాంసాదులకు అలవాటు పడినవారే హింసాత్మక యజ్ఞాలను వేదం పేరిట నడిపారని మనకర్థమవుతుంది.

**సహయజ్ఞా ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।**
**అనేన ప్రసవిష్యధ్వం ఏషవో అస్త్విష్ట కామాధుక్॥**

(భగవద్గీత)

పరమాత్ముడు సృష్ట్యాదిలో మానవులను సృజించి వారి మంచి కోరికలు తీర్చేందుకు యజ్ఞాన్ని విశ్వానికి ప్రసాదించాడు. యజ్ఞంతో మీరు ధర్మాత్ములు కావాలి, అభివృద్ధిని సాధించండి, ఇది మీకు కామధేనువు వంటిదని ఉపదేశించాడు.

**దేవాన్ భావయ తానేన తే దేవా భావయంతు నః।**
**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥**

(భగవద్గీత)

మానవులారా! యజ్ఞంతో మీరు దేవతలను సంస్కరించండి. ఆ దేవతలు మిమ్ములను ఆదరిస్తారు. ఆరోగ్యవంతులను చేస్తారు. దేవతలు, మానవులు పరస్పరం ఆదర సత్కారములతో పరమ శ్రేయస్సును అనుభవింతురుగాక. పరమపూజ్యుడైన పరమాత్ముడు వేదములద్వారా మానవులకిదే బోధించాడు.

మహర్షులు వేద మంత్రార్థద్రష్టులు. యజ్ఞ ప్రక్రియల నేర్పరచి వానిలో నేయి ఓషధులను, సుగంధ ద్రవ్యాలను, ఉత్తమ పదార్థాలను ఆహుతిగా ఇమ్మని బోధించారు. వస్తువులను విభజించి సూక్ష్మంగా చేసి వాయువులో చేర్చే శక్తి కేవలం అగ్నికే ఉంది. అందుకే మహర్షులు 'అగ్నిర్ వై దేవానాం ముఖం'- అగ్నియే దేవతలకు నోరువంటిదని అన్నారు. అందుకే యజ్ఞం లోకానికి ఉపకారం చేస్తుంది. వేదం సర్వ శుభంకరమైన యజ్ఞాన్ని లోకహితం కోసం మానవ సమాజానికి అందించింది.

**"లోకాః సమస్తా సుఖినో భవంతు."** ©




కథ వెనుక కథ

# కథాభిమానుల 'గుండెల్లో గోదారి'

**నడిచినంత మేర పుడమితల్లికి ఆకుపచ్చని చీరను బహూకరించే నదీమతల్లి గోదావరి. ఆ గోదావరికెన్ని రూపాలో? ఎన్ని వైవిధ్యాలో? అలాంటి గోదావరి నది ఛందస్సును ఔపోసన పట్టి అందంగా, రస బంధురంగా అక్షరాల్లోకి అనువదించిన సృజనశీలి బి.వి.ఎస్. రామా రావు. 'అమరావతి కథల'తో చిరకాలకీర్తిని మూటగట్టుకున్న సత్యం శంకరమంచిలా 'గోదావరి కథల'తో బి.వి.ఎస్. రామారావు అంతే ఘనకీర్తిని సొంతం చేసుకున్నారంటే అతిశయోక్తి కాదు.**

**1981లో** బి.వి.ఎస్.రామారావు రాసిన గోదావరి తొలికథ మొదలుకుని 1994లో చివరి కథ 'సీతమ్మకు చేయిస్తీ..' వరకూ వరుస కథలన్నీ అప్పట్లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురితమై అశేష పాఠకుల విశేష ఆదరాభిమానాలను చూరగొన్నాయి. ప్రస్తుతం 'గోదావరి కథలు' పేరిట కథాసంపుటిలో ఇవి లభ్యమవుతున్నాయి.

**అచ్చతెనుగుకథలు:**

ప్రపంచీకరణ ప్రభావంతో, జోరుగా పడమటిగాలి వీస్తున్న ఈ వర్తమానంలో అచ్చమైన తెలుగుకథ మృగ్యమైపోతోంది. వ్యాపారభాష వంటపట్టించుకుని కార్పొరెట్ సంస్కృతితో కరచాలనం చేసిన నేటి తరం తెలుగు కథల నడుమ అచ్చతెలుగు కథలుగా నిలుస్తాయి 'గోదావరి కథలు'. సగర్వంగా తలెత్తుకుని తిరిగే తెలుగక్షరంలా ఈ కథలు తెలుగువారి సంస్కృతి, సంప్రదాయాలకు అద్దం పడతాయి. అచ్చతెనుగు నుడికారం, కొత్తవకాయరుచి కలగలిపిన అద్భుతమైన కథలివి.

'గోదావరి కథలు' సంపుటిలో తనకు బాగా నచ్చిన 'గుండెల్లో గోదారి' కథవెనుక కథను రచయిత బి.వి.ఎస్. రామారావు ఆసక్తిదాయకంగా తెలియజేసారు. ఆ విషయాలు ఆయన మాటల్లోనే...

**ఏడాదికొక కథ**

ఉద్యోగరీత్యా పుష్కరకాలం గోదావరి తీరాన పనిచేసే అవకాశం లభించడం నా

అదృష్టం. అపుడే గోదావరిని అనేకరూపాల్లో చూసే అవకాశం లభించింది. ఎపుడూ ప్రశాంతంగా పారే గోదారి అపుడపుడు ఉగ్రరూపం దాల్చి భయపెట్టేది. పాపికొండల నడుమ మెలికలు తిరుగుతూ పారే గోదారి సుందరదృశ్యాలు నా మనసు కాన్వాసుపై చెరగని ముద్ర వేసుకున్నాయి. 1981లో 'గోదావరి కథల'ను రాయడం ప్రారంభించాను. తొలికథ 'రాగిడబ్బు' కాగా, 1994లో 'సీతమ్మకు చేయిస్తీ..' ఈ పరంపరలో చివరిది. అంటే.. గోదావరి ఆలంబనగా పదమూడు కథలు నే రాసేసరికి అన్నేళ్లు పట్టిందన్నమాట. సుమారుగా ఏడాదికో కథ రాశానని చెప్పొచ్చు. ఇతివృత్తం రూపకల్పనలోనే అధిక సమయం పట్టేది. కథను ఆలోచించేందుకు రోజులూ, వారాలు, నెలలు పట్టినా... రాయడం మాత్రం గంటల్లోనే అయిపోయేది. చాలా రోజులు పట్టిన కథగా చెప్పదలచుకుంటే...'సీతమ్మకు చేయిస్తీ'నే చెప్పాలి. ఇక అతిత్వరగా పూర్తయిన కథ 'గుండెల్లో గోదారి'.


బి.వి.ఎస్. రామారావు

**రైల్లో పుట్టిన కథ**

గోదావరి ఎపుడూ ఉల్లాసంగానే ఉండదు. ఒకో సందర్భంలో ఉగ్రరూపం దాల్చుతుంది కూడా. వరదల సమయంలో గోదావరిని చూడాలి. భయం కొల్పుతుందెవర్నికైనా. అలాంటి వరదల నేపథ్యంలో రాసిన కథ ఇది. ఆ కథ పుట్టుక, ప్రచురణ ఇత్యాది అంశాలన్నీ ఇపుడు తలచుకుంటే ఆశ్చర్యమనిపిస్తాయి. ఎందుకంటే... ఈ కథని రైలులో హైదరాబాద్ వస్తూ రాసాను. అలాగే హైదరాబాద్ నుంచి తిరిగి రాజమండ్రి వెడుతూ ఆంధ్రజ్యోతి నండూరి రామ్మోహనరావుగారికి చదవమని అందజేసాను. ఆయన చదివి తానే పురాణంగారికి



అందజేస్తానని తీసుకున్నారు. అలా ఆ కథ ప్రచురణ అయింది.

**కథాసంక్షిప్తం**

గోదావరి వరద బీభత్సం మధ్య జరిగిన ఒకానొక పెళ్లి.. అనంతర పరిణామాలను ఈ కథలో చిత్రీకరించాను. వధువుకి ఆ గ్రామం షావుకారుకొడుకు అబ్బాయి బంగారు గొలుసు బహూకరిస్తాడు. వరుడికి పైడమ్మ అనే స్త్రీ బంగారు ఉంగరాన్ని కానుకగా ఇస్తుంది. ఇంతలో గోదారికి గట్టు తెగుతుంది. వరదలో చిక్కకుండా అతిథుల దగ్గర్నుంచీ.. షామియానా



సిబ్బంది, బజంత్రీలవారితో సహా అందరూ పరుగులంకించుకుంటారు. కానీ కొత్తజంట అందులో చిక్కుకుంటుంది. ఒకర్నొకరు రక్షించుకుంటూ, ఒడ్డుకు చేరే క్రమంలో ఒకరిగురించి మరొకరు తెలుసుకోగోరుతారు. ఆ తెలుసుకునే విషయమల్లా...షావుకారు కొడుకు అబ్బాయితో సాన్నిహిత్యం గురించి వరుడు, పైడమ్మతో సాన్నిహిత్యం గురించి వధువు తెలుసుకోవాలనుకుంటారు. వరదలో కొట్టుకుని చనిపోయేముందు నిజం చెప్పాలంటూ ఒకరికొకరు షరతులు విధించుకుంటారు. దాంతో... ఒకరికొకరు అసలు విషయాన్ని, అంతకుముందున్న సాన్నిహిత్యాన్ని విప్పిచెప్పేసుకుంటారు. తెల్లవారుతుంది. వరద బీభత్సం తగ్గుతుంది. వెలుగురేకలు విచ్చుకుంటాయి. అపుడు...వారిద్దరూ తమకు అందిన బంగారు గొలుసు, బంగారు ఉంగరాన్ని నదిలో పడేసి ఒక్కటవుతారు. గోదావరి ప్రవాహంలో పుట్టిన అలలవలె ఇలాంటి సంఘటనలు జీవితంలో తలెత్తుతాయనే అంతర్లీన సందేశంతోపాటు, చక్కని హృదయస్పర్శతో కథ ముగుస్తుంది.

**పేరు పెట్టింది అన్నయ్య**

మా అన్నయ్య, సుప్రసిద్ధ రచయిత బి.వి. రమణారావు ఈ కథ చదివి దీనికి 'గుండెల్లో గోదారి' అనే పేరు సూచించారు. మా ఇంట్లో సాహితీవాతావరణం మెండుగా ఉంది. ప్రముఖ చిత్రకారుడు బి.వి.సత్యమూర్తి, మెజిషియన్స్ బి.వి. పట్టాభిరామ్, బి.వి. సత్యనగేష్‌లు నా సోదరులు. సుప్రసిద్ధ దర్శకుడు, చిత్రకారుడు బాపు, రచయిత ముళ్లపూడి వెంకట రమణ ప్రాణమిత్రులు కావడం నా అదృష్టం. స్పందన లేనిదే రచన చేయలేను. అలాగే రాయాలనే ఒత్తిడితో కథలు రాసిన సందర్భాలూ అనేకం ఉన్నాయి. సత్యం శంకరమంచి చేత 'అమరావతి కథలు' రాయించిన పురాణంగారే నాచేత కూడా 'గోదావరి కథలు' రాయించారు. 'తూర్పువెళ్లే రైలు' చిత్రీకరణ సందర్భంలో పరిచయమైన పురాణం ఆ సినిమాకి స్క్రిప్ట్ సహకారమందిస్తుంటే చూసి 'కథలు రాయమంటూ' ప్రోత్సహించారు. ఆ సందర్భంలో ఏ సబ్జెక్ట్ ఇష్టమని ప్రశ్నించగా...'గోదావరి ఇష్టమైన సబ్జెక్ట్' అని చెప్పాను. నా కథల మొట్టమొదటి పాఠకుడు దుర్గాప్రసాద్ కాగా, చిత్రాలు వేసేందుకుగాను బాపుగారు మలిపాఠకులుగా

## జాగ్రత్త తల్లీ! స్మితం

**లో**క్‌సభ మాజీ స్పీకర్, రాజకీయ ప్రముఖుడు అనంతశయనం అయ్యంగార్ ఒకసారి తన కుమార్తెతో కలిసి రైల్లో ప్రయాణం చేస్తున్నాడు. ఆమె పక్కన ప్రముఖ రాజకీయనాయకుడు మహావీర్ త్యాగి కూర్చున్నాడు. త్యాగిని చూసి నవ్వుతూ అయ్యంగార్ కుమార్తెతో అన్నారు-

"తల్లీ! జాగ్రత్త. నీ మెడలో వున్న బంగారుగొలుసు పక్కన కూర్చున్న వ్యక్తి లాక్కుపోతాడు!"

అందుకు త్యాగి పకపక నవ్వి, "మీరు చెప్పింది నిజమే అయ్యంగార్! నేను వాల్మీకి తెగకు చెందినవాణ్ణి. వాల్మీకి మహర్షి మా తెగకు పేరు ప్రఖ్యాతులు తెచ్చాడు. ఆయన మహర్షి కాకముందు కులవృత్తి ప్రకారం దొంగతనాలు చేసేవాడు" అన్నాడు.



రూపొందారు. ముళ్లపూడి కథను మలచే శైలి నన్నెంతగానో ఆకట్టుకుంటుంది.

*ప్రముఖుల ప్రశంసలు:*

"కృష్ణమ్మతల్లిని భువనమోహనంగా, శివుడు మెచ్చేలా అమరావతి కథలతో అర్చించిన అక్షరాలా కీర్తిశేషుడు శంకరమంచి సత్యంగారిలా బి.వి.ఎస్. రామారావు కూడా గోదావరికి పూజారి..."

**-ముళ్లపూడి వెంకటరమణ**

"కొందరు నీళ్లతో కూడా కథలు రాస్తారు. అలా నీళ్లతో రాసినవాడు సీతారాముడు. ఆ నీళ్లు గోదావరి నీళ్లు... బాపుగారి సాయంతో సీతారాముడి కథల వంటంతా జుర్రేసిన పాఠకులు గోదారంతా ఈదేసినట్లు ఫీలవుతారు..."

**-పురాణం సుబ్రహ్మణ్యశర్మ**

శతాబ్దపూర్వార్థంలో శ్రీపాద, మల్లాది చెక్కినట్లు రసరమ్యంగా ఉన్నాయి 'గోదావరి కథలు'

**-ఉషశ్రీ**

పిహెచ్‌డి చేయకముందు గోదావరికథలు చదివుంటే... థీసిస్ మరోరకంగా ప్రజెంట్ చేసి ఉండేదాన్ని...

**-యశోదారెడ్డి**

"పుట్టింది 1932లో కాకినాడలో. మద్రాసు యూనివర్సిటీలో సివిల్ ఇంజనీరింగ్‌లో పట్టాపొంది రాష్ట్ర నీటిపారుదల ప్రాజెక్ట్‌లో పనిచేసి 1990లో పదవీవిరమణ చేసాను" అంటూ ముగించారు బి.వి.ఎస్. రామారావు. ఈ సాహితీసృజనశీలి మరెన్నో అచ్చమైన, స్వచ్ఛమైన తెలుగుకథలను రాసి తెలుగు సాహితీ కీర్తిబావుటాను దశదిశలా ఎగురవేస్తారని ఆయన అభిమానుల అభిలాష.

సేకరణ: **పి.వి.డి.ఎస్. ప్రకాష్**




# కావేరి

నీరెండ సాయంత్రం! తలనిండా పూలు ముడుచుకుని, ముఖానికి పల్చగా పౌడరు అద్దుకుని ముసిముసి నవ్వులు నవ్వు కుంటూ ట్యాంక్‌బండ్‌పై వయ్యారంగా నడుస్తోంది కావేరి.

బొడ్డుకిందకు కట్టిన ఇస్త్రీచీర నాభితో పాటు నడుం ఒంపు అందాల్ని కనువిందు చేస్తుంటే.. లోనెక్ బ్లౌజ్ ఆమె గుండెల నిండుదనాన్ని అరచాటుగా చూపుతూ జనానికి గుండెల్లో గుబులు రేపుతోంది..

కొందరు ఆబగా... ఆకలిగా చూస్తుంటే మరికొందరు దొంగచూపులు చూస్తూ చొంగకార్చడం గమ్మత్తుగా ఉంది. పక్కన భార్యాబిడ్డలున్నవారూ ఓరగా తనను గమ నించడం చూసి ఆమె గర్వపడుతోంది.

అలాంటి ఆమెకు-

మదనుడి చాపంలా ఒళ్లు విరుచుకుని నడుస్తున్న ఆమెకు-

ఆ దృశ్యం ఆశ్చర్యం కలిగించింది.

ఎవరతను?

నిన్న కూడా అంతే!

శ్రీశ్రీ విగ్రహం దిమ్మెకు ఆ వైపున ఆను

కుని పుస్తకం చదువుకుంటున్నాడు. తలెత్తయినా చూడడం లేదు. తనకన్నా పుస్తకంలోని అక్షరాలే బాగుంటాయా?

ఆమె అహం దెబ్బతింది..

చక్కని ముఖవర్చస్సు, బంగరు మేని ఛాయ, అందమైన జుట్టు, కోటేరు ముక్కు, ఒంటికి అతుక్కున్నట్లున్న డ్రెస్.. అందగాడే! లేత బెండకాయలా నవనవలాడుతున్నాడు. కానీ కనీసం పరిసరాల్ని పట్టించుకోడేం? ఇంకా పసివయసు పాపాయేనా?

తన ఉనికిని తెలియపరుస్తూ పొడి దగ్గుదగ్గింది.

తలెత్తి చూశాడతను. ఓ క్షణంపాటు పైనుంచి కిందకు చూసి మళ్లీ పుస్తకంలో తలదూర్చాడు.

తన అందాన్ని అతను ఖాతరు చేయకపోవడం ఆమెలో పట్టుదల పెంచింది. తనూ అక్కడే కూర్చుని వచ్చేపోయేవారిని కవ్విస్తోంది.. మధ్యమధ్య అతనిపై ఓ చూపు విసుర్తోంది.




అంతలో షీలా, రాగిణి, సమీర అంతా కిలకిల నవ్వుతూ వచ్చారక్కడికి.

'ఏమే మాకంటే ముందే వచ్చావు.. సరుకు దొరికిందా?' కోడ్‌భాషలో మాట్లాడుతున్నారు వాళ్లు.

'ష్‌ష్... అతన్ని చూడండి. నూనూగు మీసంతో మహేశ్‌బాబులా హ్యాండ్‌సమ్‌గా ఉన్నాడు కదూ?!' వారికి అతన్ని చూపుతూ చెవిలో గుసగుసలాడిందామె.

'పుస్తకాలేతప్ప, అమ్మాయిల గురించి తెలియనట్టుందే' అంది రాగిణి.

అంతా ఫక్కున నవ్వారు.

'ఇక్కడెందుకే టైంవేస్ట్? పదండలా నక్లెస్‌రోడ్‌కు పోదాం' అంది షీలా విసుగ్గా.

'మీరు పదండే.. కాసేపుండి వస్తా నేను' అంటూ వారిని పంపేసిందామె.

తర్వాత తనూ అతనికి అల్లంత దూరంలో కూర్చొని గమనిస్తోంది.

అరగంట గడిచింది.. పరిసరాల్ని పట్టించుకోకుండా చీకటిపడ్డా లైటు వెలుగులో చదువుతూనే ఉన్నాడతను.

'బాబూ... టైమెంత?' మాటకలపాలని ప్రయత్నం.

తలెత్తకుండానే ఓసారి వాచీ చూసి 'ఏడున్నర' అంటూ మళ్లీ పుస్తకంలో మునిగిపోయాడు.

'మీరూ రోజూ ఇక్కడికి వస్తారా?'

'ఆఁ' అంటూ ఓసారి తలెత్తి ఆమెను చూశాడు.

'నా పేరు కావేరి..' అందామె మీ పేరేంటన్నట్లు.

'నవనీత్... కంప్యూటర్ ఇంజనీరింగ్ చదువుతున్నా' అన్నాడతను మర్యాదగా.

'ష్‌ష్..' శబ్దం వచ్చిన వైపు చూసిందామె.

పదడుగుల దూరంలో నిలుచున్న ఓ వ్యక్తి సైగచేసి పిలుస్తుంటే లేచివెళ్లిందామె.

ఇద్దరూ రెండునిముషాలు మాట్లాడుకున్నాక అతని బైక్‌పై వెళ్లిపోయింది.

అతను అప్రతిభుడిలా ఆమె వెళ్లిన దిక్కే చూస్తుండిపోయాడు.

మర్నాటి సాయంత్రం-

'బాబూ..'

పుస్తకంలోనుంచి అతను తలెత్తాడు.

ఆమే!

అతను మళ్లీ పుస్తకంలో తలదూర్చాడు.

'నిన్న చెప్పాపెట్టకుండా వెళ్లానని కోపమా?'

'నాకెందుకు కోపం? అసలు నువ్వెవరు? నేనెవరు?' నిన్నటి మార్దవం

అతని స్వరంలో లేకపోవడం గమనించిం దామె. అందుకే-

'నేను కావేరి.. మీరు నవనీత్' అంటూ పకపక నవ్వింది.

అతనూ నవ్వాడు.

'నవనీత్.. మీది హైదరాబాదేనా?'

'అవును.. మీది కాదా?'

'కాదు.. రాజమండ్రి'

అతనేం మాట్లాడలేదు.

'హీరోయిన్ అవ్వాలని ఆశపడి ఇంట్లోచె ప్పకుండా వచ్చా.. ఆ తర్వాత బతుకుతెరు వుకు మరోదారి లేక ఈ పనిచేపట్టా..'

'....'

'నా మీద కోపమా?'

'అబ్బే.. అదేం లేదు..'

'నాన్నగారు ఏంచేస్తారు?'

'సచివాలయంలో సెక్షన్ హెడ్. అమ్మ వాటర్ వర్క్సులో అకౌంట్స్ ఆఫీసర్'

'నువ్వింత బాగుంటావు నాన్న పోలికా? అమ్మపోలికా?'

'టైమైంది వెళ్తాను' చటుక్కునలేచి పుస్తకం చేతిలోకి తీసుకుని ఫుట్‌పాత్ దిగాడతను.

ఈ హఠాత్పరిణామానికి ఖిన్నురాలైంది కావేరి.

తనేమన్నా తప్పు మాట్లాడిందా? బైక్ స్టాండ్ తీస్తున్న నవనీత్ దగ్గరకు పరుగెత్తి 'సారీ' అంది.

అతనేం మాట్లాడలేదు.

'నవనీత్.. కొద్దిగా నన్ను నక్లెస్ రోడ్‌లో డ్రాప్ చేయవా?'

'సారీ' అంటూ అతను బైక్ ముందుకు దూకించాడు.

★ ★ ★

మూడోరోజు-

'వెరీవెరీ సారీ'

పుస్తకం చదువుతున్న అతను తలెత్తి ఎందుకన్నట్లు చూశాడు.

'నిన్న నేను తప్పుగా మాట్లాడితే సారీ'

'సారీ నేనే చెప్పాలి! లిఫ్ట్ అడిగితే కాద న్నందుకు.. అయినా నిన్న నువ్వేం తప్పు న్నావని? నేనే మ్యానర్స్ లేకుండా బిహేవ్ చేశాను సారీ' మృదువుగా అన్నాడతను.

విభ్రమగా చూసిందామె.

తనతో మాట్లాడుతున్నా.. అతని చూపులు తన ముఖంమీద నుంచి కిందకు దిగకపోవడం ఆమె గమనించింది. అతని సంస్కారానికి మనసులోనే శతకోటి నమ స్కారాలు అర్పించింది.

'అమ్మా.. నాన్న ఇద్దరూ బావుంటారు. అయినా నా అందమేంచూశావ్? మా చెల్లాయి రాజీని చూస్తే కళ్లు తిరిగిపోవా ల్సిందే! కాలేజిబ్యూటీ కాంపిటీషన్‌లో తనే ఫస్ట్.. క్యాట్‌వాక్‌లో తనే ఫస్ట్.. చదు వులో తనే ఫస్ట్' నవనీత్ పొంగిపోతూ చెబుతుంటే కావేరి కళ్లార్పకుండా అతన్నే చూసింది.

'మేం మద్రాస్ వెళ్తుంటే ఒకసారే మైందంటే...' అతను ఏదో చెప్పబోతుంటే కావేరి సెల్ రింగయింది.

అట్నించి రాగిణి-

'ఏమే ఇంకా ఆ పుస్తకాల పురుగు దగ్గరే ఏడ్చావా? మంచి పార్టీ దొరికింది.. పది వేలు!! వెంటనే ఆటోలో మన హోటల్‌కి వచ్చెయ్..' అంటూ కట్‌చేసింది.

ఆమె పదివేలా అనడం విని నవనీత్ ముఖం అప్పటికే వాడిపోయింది.

'సారీ నవనీత్.. రేపు కలుస్తా' అంటూ లేచిందామె.

'ఎక్కడ దింపాలో చెప్పు డ్రాప్‌చేస్తా' లేవబోయాడతను.

'నో థ్యాంక్స్' అంటూ పోతున్న ఆటోను పిల్చి ఎక్కేసింది కావేరి.

★ ★ ★

రోజులు.. వారాలు.. గడుస్తున్నాయి..

శ్రీశ్రీగారి సాక్షిగా వాళ్లమధ్య స్నేహం

పెరిగింది. బేరం వచ్చిందాకా అతనితో కబుర్లు చెబుతూ కూర్చొనేదామె. అతనూ ఆమెకోసం ఎదురుచూసేవాడు. కానీ రాత్రి తొమ్మిదయితే క్షణం కూడా ఉండేవాడు కాదు. తొమ్మిదిలోపు కుటుంబ సభ్యులంతా ఇంటికి చేరాలనేది వాళ్ల నాన్నగారి రూలట. తను అమెరికా వెళ్లాలనుకుంటున్నట్లు చెప్పాడతను. చెల్లాయికి అమెరికాలో ఉన్న తమ మేనమామ కొడుకు పంకజ్‌తో నిశ్చితార్థం జరిగిందని చెప్పాడు.

అంత చక్కని కుటుంబంలోని ఓ మంచి వ్యక్తితో స్నేహం దొరకడం ఆమెకు ఆనందాన్నిస్తోంది. అతనిపై వాత్సల్యం పెరిగింది.

కానీ నచ్చనిది ఒకటే! అతని చూపుల్లో ఇటీవల కన్పిస్తున్న మార్పు!! గతంలోలా ఆ కళ్లు అమాయకంగా లేవు. వాటిలోనూ ఆకలి ఛాయలు.. మాట్లాడినంతసేపూ కళ్లతోనే ఒళ్లంతా తడిమేయడం.. పొరపాట్న తగిలినట్లు తాకడానికి ప్రయత్నించడం..

★ ★ ★

ఆ రోజు-

'కావేరీ?'

'ఏంటి?'

'ఇవిగో తీసుకో' అంటూ జేబులోంచి నోట్లకట్టలు తీసి ఆమెచేతిలో పెట్టాడు నవనీత్.

ఆశ్చర్యంగా చూస్తుంటే 'పదివేలు.. ఇవ్వాళ నువ్వు నాకు కావాలి' అన్నాడు.

'ఆఁ..' ఆమెచేతిలోంచి డబ్బు జారిపడింది.

'ఎప్పటి నుంచో అడగాలని అనుకుంటున్నాను.. డబ్బు రెడీ అయ్యాక అడిగితే బావుంటుందని..' అర్థోక్తితో ఆగాడతను.

'వద్దు..నో!' తల అడ్డంగా ఆడిస్తూ డబ్బు అతనికి ఇచ్చేసింది.

అంతలో ఓ కస్టమర్ రావడంతో 'వస్తాను' అంటూ పిలుస్తున్నా విన్పించుకోకుండా లేచి అతనితో వెళ్లిపోయింది.

★ ★ ★

ఇవ్వాళ తాడోపేడో తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడు నవనీత్. రాగానే నిలదీశాడు.

'కావేరీ నేనంటే నీకిష్టమా కాదా?'

'అదేంమాట.. చచ్చేంత ఇష్టం'

'అందుకేనా? అందరికీ స్వర్గాన్ని అందిస్తూ నా దగ్గరకొచ్చేసరికి నోట్లో మట్టి కొడుతుతున్నావు!! నా డబ్బు చేదా? లేక నేనే నీకు తగనా?'

అతని కళ్లలో ఎర్రటి కామజ్వాల!

'మాట్లాడవేం?' రెట్టించాడతను. 'పది చాలకుంటే పదిహేను తీసుకో.. మీకందరికీ డబ్బేకదా ముఖ్యం' అతని కంఠంలో ఎత్తిపొడుపు.

బాధగా చూసిందామె.

'నవనీత్ నిన్ను కాదనడం నాకు మాత్రం ఇష్టమా? నీ కోసమే వద్దంటున్నాను' అంది మెల్లగా గొంతు పెగుల్చుకుని.

అతను ఆశ్చర్యంగా చూశాడు.

'అవును... నేను హెచ్ఐవీ పాజిటివ్ పేషంటును'

పక్కలో బాంబు పడ్డట్టు ఉలిక్కిపడ్డాడతను. ఆమె వంక అలాగే చూస్తుండిపోయాడు.

అతనలా చూస్తుండగానే ఎవరో కస్టమర్ రావడం.. అతని స్కూటర్ఎక్కి టాటా చెబుతూ ఆమె వెళ్లిపోవడం క్షణాల్లో జరిగిపోయింది.

ఫర్వాలేదు.. తానాడిన అబద్ధం ఒక మంచి కుర్రాడ్ని రొచ్చులో పడకుండా కాపాడిందని అనుకున్నాక ఆమె మనసు తేలికపడింది.

పెదాలపై సన్నని చిరునవ్వు తొణికిసలాడింది.

—చంద్రప్రతాప్

# కాలాతీతం

# వన్ డే ఇన్ ది లైఫ్ ఆఫ్ ఇవాన్ డెనిసోవిచ్



**గతనెల మూడో తేదీన మాస్కో శివార్లలోని తన నివాసంలో మృతి చెందిన ప్రఖ్యాత రష్యన్ రచయిత అలెగ్జాండర్ సోల్జెనిత్సిన్‌కు నివాళిగా జైలు జీవితంపై ఆయన రచన 'వన్‌డే ఇన్ ద లైఫ్ ఆఫ్ ఇవాన్ డెని సోవిచ్'ను ఈ నెల 'కాలాతీతం'లో ఇస్తున్నాం. రష్యన్ జైళ్లవ్యవస్థపై రాసిన 'ది గులాగ్ ఆర్కిపెలాగో' ఆయనకు 1970లో నోబెల్‌ను తెచ్చిపెట్టింది.**

ఖైదీలను నిద్రలేపటానికి కొట్టేగంట మోగటంతోనే కళ్లు తెరిచాడు ఇవాన్ డెనిసోవిచ్ షుఖోవ్. గది కిటికీల మీద మంచుపట్టి చీకటిగావుంది. చలితో వణు కొస్తున్నది. ఒకటి రెండు చింకిపాతలు తప్ప మరేగుడ్డలూ లేవాగదిలో.

ఉదయం అయిదయింది. అయినా రాత్రిలాగేవుంది. లేవటానికి ప్రయత్నించాడు. జ్వరంగా వుండేమో శరీరం తూలింది. క్యాంపులో డాక్టర్లు పట్టించుకోరు. అప్పటికే అక్కడ పన్నెండేళ్ల నుండీ శిక్ష అనుభవిస్తున్న కుజియోమిన్ మాటలు గుర్తుకొచ్చాయి.

"ఇక్కడ ఆటవిక న్యాయం. రేపటి గురించి కాదు.. ఈ రోజు, ఈ క్షణం ఎలా గడుస్తుందని ఆలోచించాలి. తిట్లూ, తన్నులూ చిన్న విషయాలు. తిండి దొరికితే చాలు".

జబ్బు మనుషులకు పనినుండి మినహాయింపు వుంటుంది. లేదా కాస్త తేలిక పని యిస్తారు. ఒక్కొక్కటి ఇరవై గాలన్ల లెట్రిన్ ట్యాంకుల్లోనుంచి ఒక్క చుక్క కూడా కింద పడకుండా దూరంగా తీసికెళ్లి ఖాళీచేసి రావాలి. మంచులో తడిసి, బరువెక్కిన బూట్లు వేసుకుని నడవటం అంత సులభమేమీ కాదు.



'సోషలిస్టు కమ్యూనిటీ డెవలెప్‌మెంట్' కోసం ఒక బిల్డింగ్ నిర్మించే కార్యక్రమం కొనసాగుతున్నది. పునాదులు తీసి, గోడలు లేపాలి- గడ్డకట్టే ఈ చలిలో. చలి మంట వేసుకుందామంటే కట్టెలు వాడటం మీద నిషేధం.

"పనిచేస్తుంటే ఒంట్లో వేడిపుడుతుంది. ఇప్పుడు మైనస్ ట్వెంటీయేగా" అరిచాడు స్క్వాడ్రన్ కమాండర్.

నేరం చేసి ఇక్కడికి వస్తే షుఖోవ్ యింత బాధ పడేవాడు కాదేమో. త్వరగా విముక్తి ప్రసాదించమని దేవుణ్ణి రోజూ ప్రార్థిస్తాడు. షర్టు మీద S-854 అని కుట్టిన రంగుదారం వెలిసిపోయింది. తన స్క్వాడ్రన్ నెంబర్ 104.

ఉష్ణోగ్రత -41సెంటీగ్రేడుల కన్న తక్కువయితే ఆరుబయట మార్చ్‌ఫాస్ట్ చేయాల్సిన అవసరం లేదు.

జ్వరంతో డ్యూటీకి రావటం కొద్దిగా ఆలస్యమైంది. ఉరిమి చూశాడు కమాండర్. బూతులు తిట్టాడు.

"ఈ రోజు వార్డర్ యిల్లు తుడిచి శుభ్రం చెయ్యి" అన్నాడు. నిజానికి ఇది కఠినశిక్ష పడిన స్పెషల్ ఖైదీపని. ఆ మనిషి పైవాళ్ళను మంచిచేసుకుని అక్కడే మరోగదిలో మకాం పెట్టాడు. పైగ్రేడ్ ఖైదీ యిచ్చిన ఆజ్ఞలు కింది గ్రేడ్ ఖైదీ పాటించాలి. గంట గడిచింది. మెస్‌హాల్ బెల్ మోగింది. అందరూ క్యూగట్టారు. బాయిలర్ల సెగలతో మెస్‌లో కాస్తవెచ్చగా వుంటుంది. కదలాలనిపించదు. బ్రేక్‌ఫాస్ట్‌గా గంజిలాంటిదేదో యిస్తారు. లంచిలో కూడా అదే! కనీసం వేడిగా వుంటే చాలు. కాగు అడుగునుండి పోస్తే గట్టిపదార్థమేదైనా పంటికి తగిలే అవకాశముందేమో కాని వంటవాడు గరిటెను లోపలికే సరిగా ముంచడు. ఆ ద్రవపదార్థంలో ఎప్పుడైనా ఒక క్యాబేజి ఆకు కనిపిస్తుంది. ఈ రోజు మెరుగే. జులైలో ముళ్లకంపను సన్నగా




తరిగి సూప్‌లో వేస్తారు. ఎప్పుడైనా చేప వాసనకూడా వస్తుంది. కాని తమకు దొరికేది ఎముకలే. అనారోగ్య కారణంతో పనికి మినహాయింపు ఇవ్వవచ్చు. కానీ రోజుకిద్దరికి మాత్రమే అలాంటి పర్మిషన్ దొరుకుతుంది. ఎవరు ముందర పేరు నమోదు చేయించుకుంటే వాళ్లకే ఆ అవకాశం. ఇటీవల కొత్త డాక్టరొచ్చాడు. అతడు రోగుల చేత ఆసుపత్రి ఆవరణలో పనిచేయిస్తాడు. పేరుకుపోయిన మంచును పారతో తొలగించాలి. గదుల్లో వెచ్చగా పడుకున్న వాళ్లు, బయటివాళ్ల గురించి ఆలోచిస్తారనుకోవటం అవివేకమే.

తూకం వేసి యిస్తారు రేషన్లు. కాని అవి ఎప్పుడూ వుండవలసినంత వుండవు. ఎవరికెంత వచ్చిందో తెలుసుకుని తమ అదృష్టాన్ని తిట్టుకుంటూరు ఖైదీలు. అవును, క్యాంపుకు వచ్చేదే పరిమితమైన ఆహారం. అందులో నచ్చినవన్నీ అట్టే పెట్టుకుంటారు పైవాళ్లు. ఆ తర్వాత మిగిలిందే ఖైదీలదాకా వస్తుంది.

సోషలిస్ట్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కోసం స్క్వాడ్రన్ 104 కదిలింది.

బొటనవేలికి, మిగతా నాలుగు వేళ్లకు చెరొక అర వున్న గ్లోవ్స్ వేసుకున్నా వేళ్లు కొంకర్లు పోతున్నాయి.

104 లోని ఒకఖైదీ సీజర్. అతడు మేధావి. ఆఫీసు పని కేటాయించారతడికి.

# సోల్జెనిత్సిన్

(1918 - 2008)

అలెగ్జాండర్ ఇసాయేవిచ్ సోల్జెనిత్సిన్‌ది కోసక్కుల సంతతి. తండ్రి జారు ప్రభుత్వంలో ఆర్టిలరీ ఆఫీసర్, కొడుకు ఇంకా తల్లి కడుపులో వున్నప్పుడే మరణించాడు. తల్లి పోషణలోనే నిరుపేద కుటుంబంలో పెరిగాడు సోల్జెనిత్సిన్. గణితం, ఫిజిక్సులలో రోస్టోవ్ యూనివర్సిటీ నుండి 1941లో డిగ్రీ పుచ్చుకున్నాడు. తరువాత మాస్కో యూనివర్సిటీలో కరస్పాండెన్స్ కోర్సు ద్వారా సాహిత్యం అభ్యసించాడు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఆర్టిలరీ కెప్టెన్‌గా పనిచేశాడు.

స్టాలిన్‌ను విమర్శించినందుకు 1945-1953 మధ్య ఫోర్స్‌డ్ లేబర్ క్యాంప్‌లో శిక్షలు అనుభవించాడు. అప్పుడే జీర్ణాశయానికి క్యాన్సర్ వచ్చింది.

సోల్జెనిత్సిన్ రచనలేవీ స్టాలిన్ కాలంలో అచ్చుకాలేదు. కృశ్చేవ్ హయాంలో ఇతడి నవల 'ఒన్ డే ఇన్ ది లైఫ్ ఆఫ్ ఇవాన్ డెనిసోవిచ్'(1962) ఒక సోవియట్ సాహిత్య పత్రికలో అచ్చయ్యింది.

ఆ తర్వాత కూడా 'అధికార ఆలోచనా ధోరణి'ని విమర్శించిన సోల్జెనిత్సిన్‌పై ప్రభుత్వం నిషేధం విధించింది. ఈ సందర్భంలో మే 16, 1967న ఆయన సోవియట్ రచయితల నాల్గో జాతీయ కాంగ్రెస్‌కు రాసిన లేఖలో-

"ప్రచురణకు ఉద్దేశించని నా ప్రైవేటు కాగితాలను కూడా సెన్సారు వాళ్లు జప్తు చేశారు. 'ఇన్ ది ఫస్ట్ సర్కిల్', 'ది క్యాన్సర్ వార్డ్', 'ది రెయిన్ డీర్ అండ్ ది లిటిల్ గర్ల్', 'ది టాంక్స్ నో ది ట్రూత్', 'ది లైట్ దటీస్ ఇన్ యు', 'ది రైట్ హాండ్' వగైరా నవలలు, కథలు, నాటకాలను ప్రచురించకుండా, ప్రదర్శించకుండా అధికారులు ఆటంకాలు కల్పిస్తున్నారు. దేశద్రోహిననీ, నేరస్తుడిననీ, జర్మనులకు సహాయం చేసిన గూఢచారిననీ దుష్ప్రచారం చేస్తున్నారు. స్టాలిన్‌ను విమర్శించినందుకే నా మీదయిలా కత్తి గట్టారు" అంటూ రాశాడు.

ప్రభుత్వ అనుమతి లేకుండా రచనల్ని

కెమెరామాన్‌గా పనిచేశాడు. తొలి సినిమా పూర్తికాకముందే యిక్కడి కొచ్చాడు. రూల్సుకు విరుద్ధంగా ఉన్ని షర్టు వేసుకున్నందుకు కమాండర్ అతణ్ణి నిలదీశాడు.

"ఇంత చలిలో ఇలాంటి ప్రశ్నలా? మీకు క్రిమినల్ కోడ్‌లోని ఆర్టికల్ 9 తెలుసా?" వాదనకు దిగాడు సీజర్.

"క్యాంపులో అధికారులతో వాదించొద్దు బ్రదర్. నువ్వు సోవియట్ పౌరుడివి కావు. కమ్యూనిస్టువి కావు" అంటూ కోపగించు కున్నాడు కమాండర్.

అంతే, తర్వాత అతడికి పదిరోజుల ఏకాంతవాసం. అది మరణ శిక్షతో సమానమే. రాతిగదుల్లో, బెంచీల మీద, మంచు నీళ్లలో వుంటే క్షయరాక మతేం చేస్తుంది! ఆ తర్వాత జీవితాన్ని వారాల్లో, నెలల్లో లెక్కపెట్టుకోవాల్సిందే.

ఖైదీలు పనిచేసేటప్పుడు గార్డులెప్పుడూ గన్స్ మొహాలకే గురిపెట్టి నిల్చుంటారు. తలెత్తకుండా గొడ్డులా పనిచెయ్యటానికి.

స్క్వాడ్రన్ ఎప్పుడూ, ఐదేసి మనుషుల చొప్పున ఒక వరుసలో కదలాల్సిందే. పొరబాటున ఎవడికైనా కాలు పక్కకు జరిగితే, తప్పించుకునే ప్రయత్నమంటారు.

విదేశాలలో ప్రచురించినందుకు 1969లో సోవియట్ రైటర్స్ యూనియన్ అతణ్ని బహిష్కరించింది. పశ్చిమ దేశాలవాళ్లు రష్యాను వ్యతిరేకించిన అమెరికా నాయకత్వంలో- సోల్జెనిత్సిన్ ధిక్కార స్వరాన్ని గుర్తించి 1970లో నోబెల్ బహుమతితో సత్కరించారు. దీనికి ప్రతీకారంగా సోవియట్ యూనియన్ దేశ బహిష్కరణ శిక్ష విధించింది.

ఆ తర్వాత స్విట్జర్లాండ్, అమెరికాలలో నివసించిన సోల్జెనిత్సిన్ 1918-1956 మధ్య అమలులో వున్న సోవియట్ శిక్షావ్యవస్థను అభిశంసిస్తూ 'గులాగ్ ఆర్కిపెలాగో' ప్రచురించాడు. విప్లవానంతర రష్యన్ చరిత్రను 'రెడ్‌వీల్' పేరున రాయాలని తొలి సంపుటిగా 'ఆగస్టు 1914' ప్రచురించాడు.

సోవియట్ యూనియన్ పతనం తర్వాత 1994లో రష్యాకు తిరిగి వచ్చి 'స్టాలిన్ అణచివేత' గురించి తెలియచెప్పేందుకు కృషిచేశాడు. 1997లో ఈయన పేరుమీద ఆ దేశంలో ఒక ప్రైజు కూడా ఏర్పాటు చేశారు.

1998లో 'రష్యా కొలాప్సింగ్', 2003లో 'వి నెవర్ మేక్ మిస్టేక్స్' ప్రచురించాడు.

రెండు దశాబ్దాలకు పైగా సోవియట్ పౌరులు అనుభవించిన నరకం గురించి, మొదటిసారిగా బయటి ప్రపంచానికి తెలియ చేసింది 'వన్ డే...'

కోలా ద్వీపకల్పం నుండి మగాడా దాకా, వోర్కుటా నుండి కోలిమా దాకా వ్యాపించిన వేలాది క్యాంపులలో చెయ్యని నేరానికి శిక్షననుభవించిన అనేకుల్లో ఒకడు ఇవాన్ డెనిసోవిచ్ షుఖోవ్.

"ఆ కాలంలో చట్టబద్ధమైన హక్కులంటూ ఎవరికీ లేవు. అధికారి నిర్ణయమే జడ్జిగారి తీర్పుగా శిక్షలు విధించారు" అంటాడు రచయిత.

స్టాలిన్ విధానాలను తీవ్రంగా వ్యతిరేకించిన ఈ రచయిత వ్యక్తి పూజను, నియంతృత్వ పద్ధతులను వ్యతిరేకించటానికే కలంపట్టాడు. అందువల్ల 'వన్‌డే...' మనకు తెలిసిన మిగతా నవలలకన్న భిన్నంగా వుంటుంది. ఆనాటి శిక్షా వ్యవస్థపై అభిశంసన ఇది. ఈ కథ చదివితే ఆ వ్యవస్థ మీద ఏవగింపు కలుగుతుంది. రచయిత ఆశించిన ప్రయోజనం అదే.

'ఇవాన్ డెనిసోవిచ్ జీవితంలో ఒక రోజు' అనుభవాలే కథాంశం. కల్పన కాదనుకుంటే యిది ప్రత్యక్ష నరకమే.

1941లో జూన్ 23న ఇంటి నుండి బయల్దేరాడు షుఖోవ్. చర్చికి వెళ్లివచ్చిన వాళ్లు యుద్ధం ప్రారంభమైందని చెప్పారు. అలా ప్రారంభమైంది ఈ ప్రస్థానం.

ఏడాదికి రెండుసార్లు యింటికి వుత్తరాలు రాస్తాడు. అక్కడి సహకార వ్యవసాయ క్షేత్రం కోల్ఖోజ్‌లో ఎవరూ చేరటం లేదని చెప్పింది భార్య. అందరూ ఫ్యాక్టరీల వైపే వెళ్లిపోతున్నారు. వ్యవసాయం మూలపడింది. బుట్టలల్లటం మానేశారు.

షుఖోవ్‌కు నలభైఏళ్లు. బట్టతల వచ్చింది. జీవితంలో ఎవరికీ లంచమివ్వ లేదు, తీసుకోలేదు. క్యాంపులోనూ అలాంటి పనులు చెయ్యడు.

తనను అరెస్టు చేసి మొదట ఉస్త్-ఇజ్మా(మరో క్యాంపు)కు పంపారు. ఆ తర్వాత, ఆర్టికల్ 58 కింద దేశద్రోహ నేరం మోపటంతో ఇక్కడికి వచ్చాడు.

సోవియట్ శిక్షాస్మృతిలోని 58వ నిబంధన కిందకు సోవియట్ వ్యతిరేక చర్యలు- అంటే గూఢచారి కార్యకలాపాలు, విధ్వంసం సృష్టించటం, ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం లేదా అధికారులు నిర్ధారించిన

'సమాజ శ్రేయస్సుకు హానికలిగించే మరే చర్య అయినా' వస్తాయి. స్టాలిన్ కాలంలో విచక్షణా రహితంగా అనేకమంది అమాయకులను షుఖోవ్‌లాగా యిలాగే నిర్బంధించారు. ఒక మనిషిని క్యాంపుకు తరలించటానికి కేవలం అనుమానం చాలు.

ఆకలేస్తోంది. ఊరు జ్ఞాపకం వచ్చింది. అక్కడ ఎలాతినేవాడో! బంగాళా దుంపలు, సూప్, లేత మాంసం, తాగినన్ని పాలు.

ఇక్కడో - తుండుగుడ్డలా.. పిసికితే పిడికిట్లో సాగే నల్లటి బ్రెడ్డు. అది కూడా రోజుకు ఆరు ఔన్సులు.

అప్పుడప్పుడూ దమ్ముకొట్టాలనిపించినా పొగాకు దొరకదు. ఫెట్యుకోవ్ అని ఒకడున్నాడు తమ స్క్వాడ్రన్‌లో. వాడు యితర్లు తాగి పారేసిన సిగరెట్ పీకలు ఏరుకుని - వుమ్మిలో పడినా సరే- వాటిలోని పొగాకు తీసి, ఆరబెట్టి న్యూస్‌పేపర్‌లో చుట్టుకొని పొగపీలుస్తాడు.

చలి ఎక్కువగా ఉన్నప్పుడు కొందరు మరణిస్తారు. ఆ శవాలను కుక్కలు పీక్కుతిన్నా సరే, ఎవరూ పట్టించుకోరు.

తమ స్క్వాడ్రన్‌లో గోప్చిక్ అని ఓ కుర్రాడున్నాడు. పదహారేళ్లే. వాడంటే షుఖోవ్‌కు యిష్టం. తన కొడుకు చిన్నప్పుడే మరణించాడు. ఇంకా యిద్దరు కూతుళ్లున్నారు. స్టాలిన్ వ్యతిరేకులతో మాట్లాడినందుకు వాణ్ణి అరెస్టు చేశారట. క్యాంపులో భవన నిర్మాణాల కోసం, కమాండర్లకు బాగానే చెల్లిస్తుంది ప్రభుత్వం. తెలివైనవాళ్లైతే రేట్లు పెంచి బిల్లులు పెడతారు. వాళ్ల దయ వుంటే కూలీలయిన ఖైదీలకు ఏమైనా గిట్టుతుంది. లేదా నీళ్ల సూప్, బ్లాక్ బ్రెడ్డే గతి.

మధ్యాహ్నం పన్నెండింటికి కమాండర్ వచ్చి చెప్పాడు-

"సూర్యుడు సరిగ్గా తన తలపైనున్నాడు. ఇప్పుడు ఒంటిగంటన్న మాట"

"అదేమిటి? ఎవర్నడిగినా చెబుతారు.. సూర్యుడు నెత్తిమీదుంటే పన్నెండు" అన్నాడు షుఖోవ్.

"అది పాతకాలం మాట. ఇటీవలే చట్టం చేశారు. దాని ప్రకారం ఒంటిగంట"

సూర్యుడికి కూడా సోవియట్ చట్టాలు వర్తిస్తాయా?

ఒకప్పుడు క్యాంపు జీవితం పదేళ్లకే పరిమితం. కాని 1949 నుండి అందరికీ ఇరవై అయిదేళ్లన్నారు. పదేళ్లంటే ఎలాగోలా బతికి బయటపడొచ్చు. పాతికేళ్లంటే యిక యిక్కడే సమాధి!

శిక్షాకాలం వాళ్ల యిష్టం వచ్చినట్టు పొడిగిస్తారు. ఒకడు 1946లో విడుదల కావాలి. అప్పుడు, "తదుపరి ఆజ్ఞల దాకా యిక్కడే వుండాలి" అన్నారు. పేరుకు చట్టం. దానికి ఎలాపడితే అలా అర్థం చెబుతారు వాళ్లు. పదేళ్లు ముగిస్తే మరో పదేళ్లంటారు. అంతే.

కాని ఆశ చావదు. 'ఏమో, నా అదృష్టం పండకపోతుందా? రేపే విడుదల కాకపోతానా? " అనుకుంటాడు ప్రతి ఖైదీ.

రికార్డులో షుఖోవ్ దేశ ద్రోహానికి పాల్పడ్డాడని రాశారు. జర్మనులకు లొంగిపోవటమంటే దేశద్రోహమే అంటారు అధికారులు. మొత్తంమీద తప్పించుకుని తిరిగి వచ్చాడు. అదీ తన కన్‌ఫెషన్. పెట్టమన్నచోట సంతకం పెట్టకపోతే ప్రాణం పోతుంది. ఈ నిర్బంధంలో కనీసం యిన్నాళ్లు ప్రాణాలతోనైనా వున్నాడు.

అసలు జరిగిన కథ -

1942 ఫిబ్రవరిలో వాయువ్యాన జరిగే యుద్ధ రంగంలో సైన్యంతో లింకు తెగిపోయింది. ఆకలికి తాళలేక, చచ్చిన గుర్రాల గిట్టల్ని నీళ్లలో నానబెట్టి కొరుక్కుని తిన్నారు. మందుగుండు సామగ్రి లేదు. ఒక అడవిలో జర్మనులు తమను యుద్ధ ఖైదీలుగా ఒక బోనులో రెండు రోజులు

బంధించారు. అతికష్టం మీద తప్పించుకుని వచ్చినప్పుడు, యిద్దర్ని కాల్చి చంపారు వాళ్లు. ఆ తర్వాత మరొకడు గాయాలతో మరణించాడు. మిగిలింది తనొక్కడే. అడవిలో తప్పిపోయానని చెబితే ఏ చిక్కూ వుండేది కాదు. బుద్ధి గడ్డితిని నిజం చెప్పటం వల్లే తన ప్రాణాలమీదికి వచ్చింది. 'జర్మనులు వదిలేస్తే వచ్చావా లం..కొడకా! శత్రువులతో స్నేహం చేసిన బాస్టర్డ్స్‌కు ఏ శిక్షవేసినా తక్కువే' అన్నారు.

అధికారుల మెప్పుకోసం, క్యాంపులో కొందరు తోటిఖైదీల మీద ఫిర్యాదు చేస్తుంటారు. ఇలాంటి వారిని ఎవరో ఒకరు తరచూ గొంతుకోసి చంపుతుంటారు.

ఇతర అభాగ్యులతో పోలిస్తే సీజర్‌కు తీరిక ఎక్కువే. అప్పటికే ఇరవై ఏళ్లు పూర్తి చేసుకున్న మరో ఖైదీ K-123తో అతడు చర్చ జరుపుతున్నప్పుడు, షుఖోవ్ సిగరెట్ కోసం ఆశగా గదిలోకి ప్రవేశించాడు.

"పాలసీల సంగతెందుకుగాని ఐన్‌స్టీన్‌ను జీనియస్ కాదనగలమా? ఇవాన్, ది టెరిబుల్‌ను (సెర్గీ ఐసెన్‌స్టీన్ తీసిన సినిమా. గొప్ప కళాఖండం) ఒక జీనియస్ మాత్రమే తీయగలడన్నది నిర్వివాదాంశం కాదా? " అన్నాడు సీజర్.

"కళకూ పరిమితులుండాలి. భోజనానికి బదులు మిఠాయిలు తింటే మంచిదా? ఇవాన్, ది టెరిబుల్‌ను(నిరంకుశుడనే అర్థంలో) గొప్పవాడంటే తరతరాల రష్యన్లను అవమానించినట్లు కాదా? "

"కాని, సినిమా ట్రీట్‌మెంట్ సంగతి? "

"అదేమీలేదు. నియంత తీయమన్నట్లు నియంత గురించి తీసిన సినిమా".

"నియంతల సంగతి సరే. కళలో ఏం చెప్తామన్నదికాదు, ఎలా చెప్తామన్నది ముఖ్యం".

"గోటు హెల్".

'ప్రతి స్క్వాడ్రన్‌లో కనీసం అయిదు గురు గూఢచార్లుంటారు' అని రికార్డుల్లో రాసుంటుంది. అదంతా బూటకం. గూఢచారులంటే యుద్ధఖైదీలే. షుఖోవ్ అలాంటి గూఢచారి. ఏదోకారణంతో, ఖైదీలంతా శత్రువులుగా కలహించుకుంటే అధికారులపని సులభమవుతుంది.

అప్పుడప్పుడూ బంధుమిత్రులు ఏవైనా బహుమతి పొట్లాలు పంపిస్తుంటారు. ఉస్త్ ఇజ్మాలో వున్నప్పుడు షుఖోవ్‌కు కూడా భార్య ఏదో పంపింది. కాని అధికారులందరూ రుచిచూశాక, ఏమైనా మిగిలితే అది ఖైదీదాకా చేరుతుంది.

ఆదివారం సెలవని అందరికీ తెలుసు. అధికారులు మాత్రం ఇష్టానుసారం సెలవు కాన్సిల్‌చేసి బలవంతంగా పనిచేయిస్తారు.

మధ్యాహ్నం గంజిలో చిన్న బంగాళా దుంప వచ్చింది. ఎంత ఆనందమో! ఈ రోజు అదృష్టం బాగుంది. ఇంటినుండి పార్శిల్ వచ్చినందుకు సీజర్ తనవంతు గంజి షుఖోవ్‌కిచ్చాడు. అదనపు బ్రెడ్డూ దొరికింది. కాస్త ప్రైవసీ దొరికితేచాలు, ఖైదీలలో కోపం కట్టలు తెంచుకుంటుంది.

★ ★ ★

"మనకు అదనంగా మరో జత షర్టులు కావాలని రిపోర్టు పంపిస్తామన్నారుగా, ఏమైంది? " అడిగాడొక ఖైదీ.

"రిపోర్టులు తయారుచెయ్యాలనే అనుకున్నారు. పాపం, వాళ్లకు చదవటం, రాయటం రాదు. ఒకవేళ రాయాలన్నా కలం, కాగితం ఇక్కడుండవు".

"రూల్సు ప్రకారం ఇక్కడుండాలే? " అదో వృథాప్రశ్న.

రోజు ముగిసింది.

మరోసారి ఖైదీలందర్నీ లెక్కపెట్టాలి. లెక్క తప్పిందో, అందరూ బారక్సు ముందర నిలబడాలి. రాత్రిళ్లు చలెక్కువగా వుంటుంది.

# మ్యూజికల్ జాగింగ్




ఇటీవల శాన్‌ఫ్రాన్సిస్కోలో నలుగురు మ్యూజిషియన్స్ వయోలిన్స్‌తో సంగీతాన్ని సృష్టిస్తుండగా దాదాపు 1300 మందికిపైగా జాగింగ్ చేస్తూ ఆరున్నర మైళ్ళు వారి వెంట వెళ్ళారు. సంగీతకారులు ట్రక్‌లో ముందుకు సాగారు. శాన్‌ఫ్రాన్సిస్కో సింఫొనీ ఆర్కెస్ట్రా మారథాన్ ఈ మ్యూజికల్ జాగింగ్ కార్యక్రమాన్ని ఏటా నిర్వహిస్తుంటుంది.



"దీనికే వణికిపోతున్నారా? సైబీరియా చలికి అలవాటుపడండి. వెన్నెల్లో తోడేళ్లు చలికాచుకున్నట్లుగా ఆరుబయటికి రండి" అంటూ ఆజ్ఞాపించాడు కమాండర్. షఖోవ్ వచ్చిన ప్రాంతంలో చంద్రుణ్ణి 'తోడేళ్ల సూర్యుడు' అంటారు.

రాత్రి హెడ్ కౌంట్ తొమ్మిదింటికి జరగాలి. కాని తరచూ డబుల్ చెక్ జరుగుతుంది. పది దాటుతుంది. రెవీల్‌తో ప్రారంభమై, రోల్‌కాల్, మధ్యాహ్న భోజనం తర్వాత చివరికి రాత్రికి లైట్సాఫ్.

షఖోవ్ తృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు. హాయిగావుంది. నిద్రకూడా రావటంలేదు.

ఇదంతా దైవ నిర్ణయమని తోటిఖైదీ అల్యోష్కా తనకు బోధిస్తుంటాడు.

"ప్రార్థించాలి షఖోవ్. మనం చెయ్యగలిగింది అదొక్కటే. విశ్వాసం పెంచుకో. భోజనం కావాలనీ, ఇంటి నుండి పార్శిళ్లు రావాలనీ ప్రార్థించకూడదు. చెడు నశించి, మంచి పెరగాలని దేవుణ్ణి వేడుకో".

"కాని మా ఊళ్లో ప్రీస్టు బాగా సంపాదించాడు. అతడు ముగ్గురు భార్యలకు మనోవర్తి యిస్తూ ప్రస్తుతం నాల్గోదాన్ని పెట్టుకున్నాడు. బిషప్ కూడా అతడు చెప్పినట్టే వింటాడు. అల్యోష్కా, నువ్వెంత ప్రార్థించినా, ఎవరికి మొరపెట్టుకున్నా నీ శిక్ష ఒక్కరోజు కూడా తగ్గదు. రెవీల్ నుండి లైట్సాఫ్ దాకా నీ దినచర్య మారదు".

షఖోవ్ అదృష్టవంతుడు. ఈ రోజు కలిసివచ్చింది. 'సోషలిస్టు కమ్యూనిటీ డెవలప్‌మెంట్'కు పనిచెయ్యవలసిన స్క్వాడ్రన్‌లో తనపేరు చేర్చలేదు. ఎక్స్‌ట్రా భోజనం దొరికింది. కూలీకి డబ్బులిస్తామన్నారు. ఇంకేం కావాలి! అతడు అలా 3653 రోజులు గడిపాడు- రెవీల్ నుండి లైట్సాఫ్ దాకా. ఆ మూడు రోజులు అదనంగా గడపటానికి కారణం- అధిక సంవత్సరాలు రావటమే.

-ఎం.వసంత




★ సంధ్య ముఖచిత్రంతో ఆగస్ట్‌నెల చతుర ముచ్చటగొలిపేలా ఉంది. సేవలోనే ఆనం దాన్ని పరిపూర్ణంగా పొందవచ్చని, శేషజీవి తాన్ని ఆనందంగా గడుపవచ్చని 74 ఏళ్ల 'మేక్ స్టేలీ' ఆదర్శంగా నిలిచాడని 'చతుర ప్రపంచం' ద్వారా గ్రహించాం.

–నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం

★ చతురలో ప్రచురితమైన 'అభిమానం' నవలను రచయిత చాలా ధైర్యంతో రాసారనిపించింది. చాలా సున్నితమైన ఇతివృత్తం ఇది. అబ్బాయి, అమ్మాయి ప్రేమకథలతో విసుగెత్తిన మాకు ఈ నవల రిలీఫ్ కలిగించింది.

– శైలూషి, అరసవిల్లి

★ అద్భుతమైన పిడిఎఫ్ నాణ్యతతో నెట్‌లో 'చతుర'ను వీక్షిస్తుంటే ఆశ్చర్యం, ఆనందం కలుగుతున్నాయి. ఆసక్తికరంగా, తెలియని విషయాలను పూసగుచ్చినట్లు చెప్పే ఈ సంచికలు చదువుతుంటే సొంతింట్లోనే ఉంటున్న అనుభూతి కలుగుతోంది. సంపాదకవర్గానికి, ప్రత్యేకించి రామోజీరావుగారికి అభినందనలు.

– వెంకట సురేష్ రావి, ఒహియో, యుఎస్ఎ,
suri858@gmail.com

★ నిమ్న కులాలవారిని అగ్రవర్ణాలవారు ఎంత అమానవీయంగా చూసేవారో కళ్లకు కట్టినట్లు వివరించిన 'అభిమానం' నవల ముగింపు మాత్రం అంత సందేశాత్మకంగా లేదనిపిస్తోంది. విజయ ప్రసాదు పట్ల చూపించిన అభిమానం కులం పేరుతో వికటించడం బాగోలేదు.

– కె.వి. ప్రసాద్, రిషికేష్

★ 'అభిమానం' నవల సుమారు 30 సంవత్సరాల క్రితం నాటి సామాజిక పరిస్థితులను ప్రతిబింబించిదనే చెప్పాలి. ప్రస్తుత సమాజంలో వారి పరిస్థితులు భిన్నంగా ఉన్నాయి. 'అపార్ట్‌మెంటాలజీ'లో శ్రావ్య నిర్ణయం సమంజసంగా లేదు. చతురకత, టాంక్‌బండ్ కథల పరంపరలో 'ప్రాయశ్చిత్తం' కథ మమ్మల్నెంతగానో అలరించాయి.

–అక్కినపల్లి రామారావు, విశాఖపట్నం

★ కులాల పట్టింపులు పక్కన పెట్టి అందరూ కలిసిమెలసి ఉంటున్న ఈ తరుణంలో పాత సంగతులు ప్రస్తావిస్తూ 'అభిమానం'లాంటి నవల రచించడం అవసరమా? ఒక వర్గాన్ని దుర్మార్గులుగా చిత్రీకరించే ఇటువంటి రచనలను ప్రోత్సహించడం అంత బాగాలేదు.

–చిలకం వేణుగోపాలరెడ్డి, అనంతపురం

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **అమిర్నేని వివేకానంద** - రేపల్లెవాడ, ఖమ్మం జిల్లా
2. **బి.భారతి** - తిరుపతి, చిత్తూరు జిల్లా
3. **వి.వి.సుబ్బారావు** - నర్సాపూర్, పశ్చిమగోదావరి జిల్లా
4. **పిల్లి సదానందం** - నర్సాపూర్, మెదక్ జిల్లా
5. **జి.మోహన వెంకట రత్నాజీ** - సైదాబాద్, హైదరాబాద్



అసంఖ్యాకంగా స్పందనలు రావడంతో అందరి పేర్లు ప్రచురించలేకపోతున్నాం.



# చతుర ప్రవేశిక





**సెప్టెంబరు - 08**

ఆగస్టు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం.

1. బీశేరయ్యది ఏఊరు?
2. శంకర్‌రెడ్డి కొడుకు పేరు?
3. కనకమ్మ ప్రియుడు?
4. బీశేరయ్య ఏ పరసలో దేశపు దూడను కొన్నాడు?
5. సిద్ధిరాజుల ఉంపుడుగత్తె?
6. రాహుల్ గాళ్‌ఫ్రెండ్?
7. సోల్జెనిత్సిన్‌కు నోబెల్ వచ్చిన సంవత్సరం?
8. పల్లవి ఇంటికి ఎవరొచ్చారు?
9. నవనీత్ ఏ విగ్రహం దగ్గర చదివేవాడు?
10. ఆరోగ్యరహస్యం చెప్పిన అందాలతార?

పంపినవారి పేరు: ------------------------------ వయసు (    )

చిరునామా: ----------------------------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

**ప్రవేశికలకు చివరి తేదీ 16**

*ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.*

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RNI/32186/78